ఏటుకూరు బలరామమూర్తి, డా.ఎన్.రామచంద్ర డా.చందు సుబ్బారావు డా.పి.సంజీవమ్మ డా.రావి భారతి డా.ఆలూరి విజయలక్ష్మి డా.అట్లూరి రాజకుమారి పరకాల పట్టాభి రామారావు డా.యస్వీ సత్యనారాయణ

# చలం - స్త్రీవాదం

సంకలనం :

ఏటుకూరు బలరామమూర్తి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001

ప్రచురణ నెం : 1848

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబరు, 1994

టైటిల్ డిజైన్ : చంద్ర

**వెల : రు. 15-00**

ప్రతులకు :

## విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాదు - 500 001.

## విశాలాంధ్ర బుక్ హౌస్

విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్నం, అనంతపురం,

తిరుపతి, హన్మకొండ, గుంటూరు, కాకినాడ.

**ISBN** : 81-7098-112-3

---

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ - 520 004.

# ఇందులో....

# భగ్నయోగి

## శ్రీ ఏటుకూరు బలరామమూర్తి

సుమారు 15 సంవత్సరాల క్రితం నేను రాసిన వ్యాసాన్ని పునర్ముద్రించి విశాలాంధ్రవారు చలంపై చర్చకు ప్రాతిపదికను చేశారు. దాదాపు 5 వారాలు, స్పందన - ప్రతిస్పందనలు చాలా వచ్చాయి. ఇక ముగిద్దాం అన్నారు. ముగింపు వ్యాసం అంటే చర్చలో ప్రస్తావితమైన అన్ని అంశాలకు సమాధానం కాదు. అలా ఇవ్వగలననీ కాదు. నూరేళ్ళ చలం ఉత్సవాలు జరుగుతున్న నేడు, తెలుగు సాహిత్యంపై గొప్ప ప్రభావం కలిగించిన ఒక రచయితపై వీలైనంత సత్య సమ్మతమైన అంచనాకు రావటం అందరి సమస్య. విమర్శకుల వ్యాఖ్యాతల బాధ్యత.

గతంలో ఒక రచయితపై ఒక అభిప్రాయం కలగవచ్చు. అవసరమనుకుంటే ఆ భావనను కొద్దిగానో, గొప్పగానో మార్చుకోవచ్చు. వర్తమాన కాలంలో వారి రచనలు ఎలాంటి ప్రభావం కలిగిస్తున్నాయి. భవిష్యత్తులో ఎలా కలిగిస్తాయనేది అన్నిటి కంటే ముఖ్య సమస్య.

సాహిత్యాన్నిగాని, చరిత్రను అర్థం చేసుకోటంలో రెండు ప్రమాణాలున్నాయి. ఆనాడు అవి కలిగించిన ప్రభావం, ఈనాడు కలిగిస్తున్న, ఇక ముందు కలిగించే ప్రభావం రెండూ అవసరమే. కాకపోతే సమ్యక్ దృష్టి ఏర్పడదు.

మొదట్లోనే ఒక వివరణ ఇస్తాను. తిరుగుబాటుదారు, మార్మికవాదిగా మారటం ఆలోచనాస్థాయిలో పతనం అని నా మొదటి వ్యాసంలో పేర్కొన్నాను. ఈ మాటలో అవసరమైన దానికంటే హెచ్చు తీవ్రత కొందరికి

స్ఫురించింది. పతనం అనే మాట బదులు వెనకడుగు (A step back) అనటం సమంజసమని యిప్పుడు నాకు అనిపిస్తున్నది.

దైవంలో విశ్వాసం ఏర్పరచుకోవటం, అందులో కొంత మార్మికత చోటు చేసుకోవటం మహాపాపం కాదు. ఒకప్పుడు ఉగ్రరూపంలో సర్వ ఆచారాలను నిరసించి, దూషించి, ఉల్లంఘించిన చలం, చివరలో తన కుమార్తె సౌరీస్ పలికిన ప్రతి మాటను ఈశ్వరవాణిగా భావించటం నిస్సందేహంగా వెనుకడుగే.

ఆస్తికులలో ఎంతో కొంత మార్మికత ఉండవచ్చు. తొలి బ్రహ్మ సమాజ ప్రవక్తలు ప్రచారకులు ఎలాంటి మార్మికతా లేని ఆస్తికులు రామ్మోహనరాయ్, వీరేశలింగం, వెంకటరత్నం ఇత్యాదులంతా అలాంటి వారే. వారి ప్రభావంతో కవిత్వ రచన ప్రారంభించి, అత్యున్నత స్థాయి పొందిన టాగూరులో కొంత మార్మికత లేకపోలేదు. అది కవితా పరమైనది. అలాగే వెంకట పార్వతీశ్వర కవులు, కృష్ణశాస్త్రి గారలలోనూ.

చలం మార్మికత అలాంటిదికాదు. అందులో అశాస్త్రీయ విశ్వాసాలు చాలా హెచ్చు. ప్రళయం రానున్నది. జాగ్రత్తపడి అరుణాచలం రావలసిందని చలంగారు కొందరికి ఉత్తరాలు రాశారు, ప్రళయం రాలేదు. "ఏమీ జరగలేదే, ఇక ముందు మన మాటలు ఎవరైనా విశ్వసిస్తారా" అని ఈశ్వరుణ్ణి అనగా సౌరీస్‌ని ప్రశ్నించారు. "రాకపోవటం మంచిదే కదా" అని ఆమె సమాధానం. అంతటితో చలం నిరుత్తరుడైనాడట. ప్రశ్నకు, సమాధానానికి సంబంధం లేదు. తన మాటలకు విలువ పోతున్నదని చలంలో ఏదో ఒక మూల సందేహం స్ఫురించింది. సౌరీస్ సమాధానంతో ఆ స్ఫురణే లేదు.

సంశయాత్ములకు గురువు లిచ్చే సమాధానాలిలాగే వుంటాయి. దీనినే **Hypnotise** చేయటం అంటారు. రమణాశ్రమం చేరిన తర్వాత ఆఖరు క్షణం వరకు మానసిక, ఆధ్యాత్మిక ఆలోచనలలో సౌరీస్, చలానికి గురువు. తొలి రోజులలో తన స్వేచ్ఛా భావనలతో ప్రభావితమైన సౌరీస్ రమణాశ్రమం చేరిన మరుక్షణం నుండి చలానికి గురువేకాదు, సాక్షాత్తు ఈశ్వరుడే ఐనాడు. తొలి నుండి చలంతో వున్న స్వేచ్ఛా భావవిస్తరణే

కాలక్రమేణ ఆయనను రమణాశ్రమం చేర్చిందని, అది క్రమ పరిణామమే నని 'వెనకడుగు'కాదని కొందరంటారు.

చలం మొదటి నుండి సంశయవాది. 'ఈశ్వరశక్తి తెలియని నేను స్త్రీ శక్తిని' ఆరాధించాను అని చాలాసార్లు చెప్పుకున్న వాడు. సంశయ వాదిగా ప్రారంభమైన వ్యక్తి, చివరిలో నాస్తికుడు కావచ్చు. ఆస్తికుడు కావచ్చు. లేక అలానే మిగిలి పోవచ్చు.

చలం జీవితంలో రమణాశ్రమ ప్రవేశం ఒక మలుపు. సౌరీస్, దీక్షితులు, తదితర హితైషులు, ఇష్టమున్నా లేకపోయినా, బలవంతంగా ఒక రోగిని ఆస్పత్రిలో చేర్చినట్టు చలాన్ని రమణాశ్రమానికి చేర్చారు. ఒక దశలో చికిత్సకై మద్రాసు వెళ్ళటం మంచిదని వైద్యులు సూచించినా సౌరీస్ అభ్యంతరం చెప్పి, ఆఖరు క్షణం వరకు రమణాశ్రమంలోనే వుండేట్లు చేసింది. అక్కడనే ఆయన మరణించాడు.

తన నిత్య జీవితంలో సౌరీస్ (ఈశ్వరుడు) మాటను జవదాట కుండా గడపటం ద్వారా చలానికి చివరి చివరకు చిత్తశాంతి ఏర్పడి వుండవచ్చు. ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా ప్రశాంత స్థితి లభిస్తుంది. ఏదో విధంగా చిత్తశాంతిని పొందే హక్కు అందరికీ వున్నది. అందుకు ఎవరూ అభ్యంతరం పెట్టరాదు. సామాజిక, సాంస్కృతిక రంగాలలోనే కాక, రాజకీయ రంగంలో సైతం ఒకప్పుడు ఉగ్రవాదాన్ని ఆశ్రయించి ఆచరించిన వారు చివరకు మార్మికత్వంలోకి పోయిన సందర్భాలు చాలా వున్నాయి. ఆ దృష్టితోనే చలానిది వెనకడుగు అనటం.

ఆ విషయం వదిలివేద్దాం. Let the dead rest in peace.

*　　*　　*

నూరేళ్ళ చలం పుస్తకంలో స్త్రీ వాదం, చలాన్ని ఎందుకు ఆదర్శంగా తీసుకుందో వివరిస్తూ సంపాదకులు నాలుగు అంశాలు పేర్కొన్నారు.

1) స్త్రీ పురుష తేడాలు రద్దు
2) కుటుంబం రద్దు
3) స్వంత ఆస్తి రద్దు
4) రాజ్యం అవసరం లేకుండా జీవించే శక్తి సంపాదించటం

ఇందులో మొదటి అంశాలను చలం ప్రతిపాదించిన మాట నిజం. ఆస్తిమీద నిజ జీవితంలో చలం మమకారం చూపలేదు. ఐనా సూత్రరీత్యా స్వంత ఆస్తిరద్దు ప్రతిపాదనను చేసినట్లు దాఖలాలు లేవు. రాజ్యాం అవసరం లేకుండా జీవించటం అనే భావన, స్వేచ్ఛకు పరాకాష్టగా ఆయన రచనలలో అక్కడక్కడ కనిపించినా, అదీ ఒక నిర్దిష్ట ప్రతిపాదనగా చేసినట్లు దాఖలాలు లేవు. మొదటి రెండు అంశాలు నిర్దిష్టంగాను, చివరి రెండు అంశాలు అనిర్దిష్టంగాను చలం రచనలలో స్ఫురింహాయని స్త్రీ వాదులు భావించవచ్చు. పోనీండీ ఎవరి స్ఫురణ వారిది.

చలం భావనల కన్నిటికి అంతస్సూత్రం స్వేచ్ఛ. ఈ భావన విశ్లేషణ, వివరణ, వర్ణన ఆయన రచనలన్నిటిలోను కనిపిస్తుంది. స్వేచ్ఛకు ఆయన యిచ్చిన అన్వయం ప్రాథమికంగా లైంగిక స్వేచ్ఛ. "స్త్రీ ప్రేమ మారుతుందనీ, తనకు నచ్చని సంసారాన్ని, భర్తను వదలి తిరిగే హక్కున్నదని చెప్పారు చలం" అని కూడా సంపాదకులు చెప్పారు.

స్వ, ఇచ్ఛ- తన కోర్కె, ఈ కోర్కెలో మొదట్లో జైవిక అంశాలు, ఆ పిమ్మట వయస్సు వచ్చిన కొద్దీ సామాజికాంశాలు చోటుచేసు కుంటాయి. ఆయా సందర్భాలు, చారిత్రక సామాజిక పరిస్థితులు వ్యక్తుల మనస్తత్వం, సంస్కారాల ననుసరించి వాటి నిష్పత్తి మారుతూవుంటుంది. తన కోరికను తానే అదుపులో పెట్టుకున్నాను అనుకుంటే ఏ బాధ వుండదు. ఆత్మవిశ్వాసం, సంతృప్తి, ఆనందం కలుగుతాయి. బాహ్య పరిస్థితులు తన కోరికను అణచి వేస్తున్నాయి అనుకున్నపుడే అన్ని చిక్కులూ ఉద్భవిస్తాయి.

కోరిక జంతు స్వభావానికి చిహ్నం. సంతృప్తి, జంతు, మానవ స్వభావాలకు రెంటికీ సామాన్యం. ఆనందం కేవలం మానవ స్వభావం. జంతు స్వభావాన్నుండి, మానవ స్వభావాన్ని అలవరచుకోవటమే అనాదిగా మానవ జాతి చేస్తున్న యాత్ర. ఈ యాత్రకు మొదలువుంది. అంత్యం లేదు. ఇందొక ప్రధ్వంసా భావం. జంతు దశలో మానవుడు యధేచ్ఛగా లైంగిక జీవితం గడిపాడు. గుంపుకు, తన వ్యక్తికి నిత్య ఘర్షణ అనుభ వించాడు. కొన్ని తెగలు, గుంపులు ఈ క్రమంలో నశించాయి. మిగతా తెగలు, గుంపులు ఈ క్రమం నుండి గుణపాఠం గ్రహించాయి. కోరికలకు

తమను అనే మాట అలా పుట్టింది. వ్యక్తి భద్రత తద్వారా సాధ్యమైంది. భద్రత వుంటేనేగదా ఏదైనా? జీవం అంటూ వుంటేనే స్వేచ్ఛ. జీవన్ భద్రాణి పశ్యతి - అన్నారు.

సమాజం అంతా మొత్తంగా ఒకే విధంగా ముందుకు సాగలేదు. వేర్వేరు వివాహ వ్యవస్థలు, ఏ వ్యవస్థా లేని గుంపులు, సహజీవనం చేశాయి. ఎన్నో యుగాలు ఇలా గడిచాయి.

పిమ్మట దంపతీ వ్యవస్థ. కుటుంబ వ్యవస్థ రూపొందింది. దంపతీ వ్యవస్థ యిప్పటికి ఉత్తమమైంది. భవిష్యత్తులో ఇంత కంటే ఉన్నతమైన వ్యవస్థ రూపొందవచ్చు. రూపొందాలి కూడా. ఏమంటే దంపతీ వ్యవస్థ ఫ్యూడల్ కుటుంబ వ్యవస్థ పురుషాధిక్యతా మూలకం. ఇది బద్దలు కావాలి. ఔతున్నది. ఇంకా కావాలి. అందులో అంతర్భాగమైనది దంపతీ వ్యవస్థ. అనగా ఒకే స్త్రీ ఒకే పురుషుడు జీవితాంతం కలిసి జీవించటం అనే పద్ధతి అంతంకారాదు. ఫ్యూడల్ కుటుంబ వ్యవస్థ కారణంగా స్త్రీలకు అసంఖ్యాకమైన బాధలు, కన్నీటి గాథలు వేలాది సంవత్సరాలుగా సాగుతున్నాయి.

ఫ్యూడల్ కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం, వివాహ వ్యవస్థ విచ్ఛిన్నాన్ని ఏకంచేసి చూడటం చలం ఆలోచనా క్రమంలోని ముఖ్య లోపం. నేటి ఉగ్రవాద స్త్రీవాదంలోను అదేలోపం.

ఈ విచ్ఛిన్నం ఎలా జరగాలి ? భౌతిక పరిస్థితుల వలన కొంత, ప్రయత్న పూర్వకంగా కొంత జరగాలి, జరుగుతున్నది.

బ్రహ్మ సమాజికులతో మొదలైన ఈ సంస్కరణ, జాతీయ వాదం కమ్యూనిజం ప్రభావంతో సాగిన సాంస్కృతికోద్యమం, ఇత్యాది ఉద్యమాల ప్రభావంతో ముందుకు సాగింది. చలం తనకండ్ల ఎదుట జరుగుతున్న పరిణామాన్నే చూడలేక పోయాడు. చూడ నిరాకరించాడు.

జాతీయవాదం పట్ల హేళన, కమ్యూనిజం పట్ల వ్యతిరేకత (కమ్యూనిజం సిద్ధాంతంలోనే స్వేచ్ఛకు చోటు లేదనే భావంతో)— ఈ రెండూ చలం తెచ్చి పెట్టుకున్న మానసిక అంధత్వానికి కారణాలు.

చలంలో మొదటి నుండి రెండు విరుద్ధ భావ స్రవంతులున్నాయి. స్త్రీలు పడుతున్న బాధలకు, ఏదో శాశ్వత పరిష్కారం చూపాలనే తాపత్రయం. ఇది వాంఛనీయం. ఆయన రచనల్లోని జీవశక్తికంతా ఇదే ప్రాణా

ధారం. రెంటో ఏవంతి. ఇది ఆలోచన అనరాదు. అనుభూతి ప్రధాన మైనది. తనకు తారసిల్లిన ప్రతి స్త్రీని కామ దృష్టితో మాత్రమే చూసే స్వభావం. ఇది ఆరోపణ కాదు. అనేక సందర్భాలలో చలమే స్వయంగా అనేక రూపాలలో అంగీకరించిన యథార్థం.

1972లో, కండ్లు కనపడక, చేతులు రాయలేని నిస్సహాయ దశతో మరొకరిచే రాయించుకున్న ఆత్మకథ. 76 వ పేజీలో ఇలా అంటాడు.

"ఈశ్వరుణ్ణి గురించి ఎప్పుడు సందేహాలు ఏర్పడ్డాయో, నాటి నుండి స్త్రీయే నా దైవం ఐంది. నా మనస్సు చంచలం. నా మనసు, హృదయం ఒకరిమీద నిలిచివున్నా, ఎవరన్నా నావేపు చెయ్యిచాచినా చూపుతో ఆకర్షించినా నిలవలేక, ఆమెవేపు పారిపోయే వాడ్ని. ఈ చాంచ ల్యంవల్ల నా ఆదర్శ ప్రేమకి ఏ భంగమూ కలిగేది కాదు. ఈ చాపల్యాన్ని చూస్తే నాకెంతో రోత. ఈ గుణాలతో నా జీవితమంతా యుద్ధం చేస్తు న్నాను. ఈ నాటికీ యుద్ధం చేస్తున్నాను. కాని నన్ను వదలదు ఈ దోషం. దాంతో ఎన్నో చిక్కుల్లో దిగాను.అసహ్యమైన పరిస్థితుల్లో ఇరుక్కున్నాను." కామాన్ని ఆయన ప్రేమ, శృంగారం అని ఏవో పేర్లతో పిలిచే వాడు. అమలిన శృంగార వాదులు, కామ రహిత ప్రేమ అంటే కాదు, అది అసం భవమని చలం సమాధానం చెప్పాడు. ఈ వైయక్తిక బలహీనత, తెలియ కుండానే ఆయన రచనల్లో ఆలోచనల్లో చోటు చేసుకుంది. బహుశా ఈ బలహీనత లేక ప్రత్యేకత ఆయనలో హైస్కూలు దశనుండి ఉన్నట్లు ఆయన రచనల్లోనే దాఖలాలున్నాయి. కళాశాల దశలో కొనసాగింది. బ్రహ్మసమాజం నుంచి బైట పడటానికి ఇదొక కారణం.

ఆ పిమ్మట ఈ ప్రవృత్తి ఆయనలో మరింత విజృంభించింది. అంతటితో ఆగక ఈ ప్రవృత్తినే స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతంగా ఆయన సూత్రీకరించాడు. ఆ సూత్రాన్ని చివరివరకు ఆయన విసర్జించలేదు. లేక ఆ సూత్రం ఆయనను విసర్జించలేదు.

తన లోపాన్ని స్వయంగా అంగీకరించటం చలం నిజాయితీకి చిహ్నం. కానీ ఏనాడూ ఈ బలహీనతను అదుపులో పెట్టటానికి ఆయన ప్రయత్నం చేయలేదు.

చిన్నప్పటి నుండి ఆయన పెంపకం తండ్రిపట్ల ద్వేషం, ఇత్యాదు

లన్నీ ఈః ప్రవృత్తి పెరుగుదలకు కారణాలేః ్? ఈఃసూత్రీకరణను ఆధారం చేసుకుని ఆయన చేసిన రచనలు, వాటివలన ఆనాడు, ఈనాడు కలుగుతున్న ప్రభావం ఏమిటన్నది ముఖ్యాంశం.

స్వేచ్ఛ పట్ల ఆయనకు గల ఊహాజనిత, అశాస్త్రీయ భావన బిడ్డల శిక్షణ విషయంలోను కనిపిస్తుంది. చలం తొలి రోజుల్లో వ్రాసిన బిడ్డల శిక్షణ మంచి పుస్తకంగానే పేరుపొందింది. కాని ఆచరణలో ఆయన ప్రవర్తించిన తీరు, ఆయన కుమారుడు ఇంట్లో నుంచి పారిపోవటానికి దారితీసింది. 'రవి'ని గురించి ఆయన ఎంతో బాధపడుతూ ఆత్మకథలోనూ ఇతర రచనల్లోనూ చెప్పుకున్నాడు. కాని తన పెంపకంలోని లోపాన్ని మాత్రం గుర్తించలేదు. రమణాశ్రమం చేరిన తర్వాత అదే పరిస్థితి. తమ ఇంట్లో పిల్లలు, పెద్దల ఎదుట ధూమపానం, జూదం, దెబ్బలాడుకోవటం, బూతుమాటలు వాడటం నిత్యకృత్యాలుగా వుండేవని, చలం ఏనాడూ వారిని కనీసం మందలించిన పాపాన కూడా పోలేదని సౌరీస్ జీవిత రచయిత సోదాహరణగా తెలియజేశారు. ఇది స్వేచ్ఛ కాదు. విచ్చలవిడితనం, విశృంఖల విహారం. ఈ వాతావరణం ఒకవైపున వుంటే మరొక వైపున సౌరీస్ తన గదిలో హెచ్చు భాగం సమాధిలో గడిపేవారు. చలం రచనలు చేసుకుంటూ వుండేవారు.

ఈ ప్రవర్తన గిట్టకపోవటంవల్లనే చలం భార్య నిత్యమూ చలంతో పోట్లాడేది. ఫలితం శూన్యం.

భార్య సమాధికి కొంచెం దూరంగా తన సమాధిని కట్టమన్నాడట. 'లేకపోతే మేము సమాధులలో నుండి లేచి పోట్లాడుకుంటాం' అని హాస్యం చేశాడు. చలం హాస్యం ఆయన రచనలకు వన్నె పెట్టినమాట నిజం. నిజ జీవితంలో మాత్రం బాధలకు గురిచేసింది.

తాత్విక అవగాహనకు, రచనలకు తరచు విలోమ సంబంధం వుంటుంది. చలం విషయంలో సరిగ్గా అదే జరిగింది.

*

చలం దాదాపు వంద రచనలు చేశారు. 87 కథలు, 8 నవలలు, 26 నాటకాలు-ఇవికాక మ్యూజింగ్స్, ప్రేమలేఖలు.

మ్యూజింగ్స్ తెలుగు సాహిత్యంలోనే కొత్త ప్రయోగం. ప్రేమ లేఖలు అంతే. ఇందులో స్త్రీ ఆరాధకులకు వ్రాసిన లేఖల కంటే, ఆయన మిత్రులకు వ్రాసిన లేఖలే హెచ్చు. ఈ రెండు సాహిత్య రూపాలలోను చలం అద్వితీయ ప్రతిభ చూపించాడు. తన తాత్విక అవగాహనను, sublimate చేసుకుని చలం రచనలు చేశాడు.

sublimation అంటే, జీర్ణం చేసుకుని, వడపోత పోసి ఆ సారాన్ని బహురూపాలలో వ్యక్తం చేయడం.

శశిరేఖ, మైదానం, బ్రాహ్మణీకం, దైవమిచ్చిన భార్య, జీవితాదర్శం - ఆయన రచనలలో ఎక్కువ ప్రశస్తి పొందినవి. ఈ నవలల న్నిటిలోనూ స్త్రీలు భర్తలతో ఏదో కారణంతో అసంతృప్తి చెందటం, అది తీవ్రరూపం ధరించి, స్వేచ్ఛా జీవితానికి అలవాటుపడటం చివరకు విషాద స్థితిలో మరణించటం లేదా కుంగిపోవటం సామాన్య కథాంశం. వీనిలో శశిరేఖ మొదటి రచన, జీవితాదర్శం ఆఖరుది.

స్త్రీకిగాని, పురుషునికిగాని కామం లేక శృంగారం ఎల్లప్పుడూ ఒకరి మీదనే వుండదని, చంచల స్వభావం ప్రకృతి సహజమని ఈ రచనలన్నిటి లోను చలం చెప్పదలచిన విషయం. ఈ ప్రకృతి సహజ వాంఛను పురుషుడు ఏదో విధంగా తీర్చుకుంటున్నాడు. స్త్రీ కూడా అదే ప్రయత్నం చేస్తే ఘర్షణ మొదలవుతున్నది. కుటుంబం విచ్ఛిన్నం కావటం, లేచి పోవడం లేక రహస్యంగా పరాయి పురుషునితో ప్రేమ కలాపాలు సాగించటం జరుగుతుంది. ఇది సహించని పురుషుడు స్త్రీని తిట్టడం, కొట్టడం, చిత్రహింసలు పెట్టడం ఈ నవలలన్నిటిలోనూ కథావస్తువు. ఇదే పురుషాధిక్యత. స్త్రీకి ఒక నీతి, పురుషునికి ఒక నీతి. ఈ ద్వంద్వనీతి కూడదనే ధ్వని అన్నిటిలోనూ ఉంది.

ఈ క్రమంలో పురుషునిలో అసూయ ఏర్పడుతుంది. ఈ భావాల నుండి బైటపడిన పాత్ర, చలం దృష్టిలో ఆదర్శ పురుషుడు జీవితాదర్శంలో దేశికాచారి. లాలస అనే స్త్రీ పెక్కుమంది పురుషులతో పరిచయం పెంచుకుని అందరిలోనూ 'అసూయ' దుర్గుణం ఉన్నదని గ్రహించి, చివరికి దేశికాచారిని చేరుకుంటుంది.

"ఏ పట్టూ, ప్రిజుడిస్ లేకుండా జీవితాన్ని మథించి, సుఖపడే రహస్యాన్ని" దేశికాచారి కనిపెట్టారు అని కథానాయిక లాలస కథ చివరలో అంటుంది.

లైంగిక సుఖాన్ని అనుభవించే హక్కు పురుషుని కెంత ఉన్నదో స్త్రీకి అంతే వుంది. అవివాహితగా వుండిపోయే హక్కూ వుంది. అదనంగా స్త్రీకి మాతృత్వం ఒక సమస్య. కొందరికది వాంఛనీయం. కొందరికి అవాంఛనీయం. ఆయా వ్యక్తుల అభిరుచులకు సంబంధించిన అంశం.

నిజానికి ఆ హక్కును ఎంత ఎక్కువమంది స్త్రీలు వినియోగించుకుంటే అంత మంచిది.

ప్రపంచ జనాభా ఇప్పటికే మితిమీరిపోయింది. ఈ జనాభాని ఇక ముందు పెంచరాదని అంతర్జాతీయ, జాతీయ నాయకులు ఘోషిస్తున్నారు.

పురుషుడుగాని, స్త్రీగాని లైంగిక సుఖం అనుభవించడంలో నిగ్రహం, కట్టుబాట్లు పాటించడం, మానవజాతి సాధించిన సంస్కృతి, పురోగతి. నిగ్రహం అనే మాట చలంలోగాని, ఈనాటి కొందరి స్త్రీవాద సాహితీపరులలోగాని మాటమాత్రం కూడా లేకపోవడమే విచారకరం.

ఫ్యూడల్ సమాజంలో పురుషుల విశృంఖల జీవితం, స్త్రీల గృహ దాస్యం మామూలు. గృహదాస్యంనుండి బైటపడాలనే స్త్రీ వాంఛ పూర్తిగా న్యాయసమ్మతమైంది. ఈ క్రమంలో జీవితాదర్శంలో లాలస లాగా అనేకమైన చేదు అనుభవాలను కూడా రుచిచూడవచ్చు.

ఇది సాధారణ సూత్రమైనట్లు, అనివార్యమైనట్లు చలం చిత్రించటమే అభ్యంతరకరం. ఉదారభావాలుగల పురుషులు నేటి సమాజంలో లేనే లేరా ? అన్ని పాత్రల లోను పురుషుడు కామైక దృష్టికలవాడుగానే ఎందు కాయన చిత్రించాడు.

జంతు దశనుండి మానవుడు వేరుపడిన మరుక్షణం నుండి ఇంద్రియాలను అదుపులో పెట్టుకునే ప్రయత్నం చేస్తూనే వచ్చాడు. ఇంద్రియ సుఖం పాపభూయిష్టమనే తాత్వికులు ఒకవైపున, అదే సర్వస్వమని భావించే తాంత్రికులు ఒకవైపున అనాదిగా ఉంటూనే వచ్చారు. ఆశేషజన సామాన్యం మధ్యేమార్గంలో జీవిస్తున్నారు.

ఫ్యూడల్ సమాజంలో స్త్రీ పురుషునికి భోగ్యవస్తువు. స్త్రీ గృహ దాస్యం, పురుషుల విచ్చలవిడితనం నాడు సర్వ సామాన్యం. వేశ్యాకుల సమ ర్థకులు ఆరోజులలో వుండేవారు. పురుషులకు విస్తార కామ ప్రవృత్తి సహజ మని, దానిని తీర్చటానికి వేశ్యాకులం అవసరమైందనీ, ఆ కులం లేకపోతే కుల సతులు దూషితులయ్యేవారని వాదించిన ఘనులు చాలామంది ఆనాడు వున్నారు. ఇందుకు వ్యతిరేకంగా మహోద్యమం ప్రారంభించిన వాడు వీరేశలింగం. వేశ్యావృత్తిలోని నీచత్వాన్ని, దానిని ఆచరించే పురుషుల లజ్జా హీనత్వాన్ని విమర్శిస్తూ ఎన్నో గ్రంథాలు రాశారు. వీరేశలింగం రచనలలో ఇదే అత్యధిక భాగం.

స్త్రీలను విద్యావంతులను చేసి, సంస్కారవంతులనుచేసి పురుషుల దుశ్చేష్టలను విమర్శించి, ఖండించి, ఉభయుల మధ్య సాంస్కృతిక అగా ధాన్ని పూడ్చడం ఆయన ధ్యేయం. వివాహ వ్యవస్థను సంస్కృతీకరించ టానికి, ఉన్నతీకరించటానికి అదే ఏకైకమార్గం. ఆ మార్గాన్ని ఈనాడు మరింత తీవ్రంగా, విస్తృతంగా నిర్వహించే ఉద్యమాలు అవసరం. ఆంధ్రలో 42-45 సంవత్సరాల మధ్యకాలంలో ఈ ఉద్యమాన్ని కమ్యూ నిస్టు పార్టీ పెద్దఎత్తున చేపట్టి, ఎంతో ప్రభావాన్ని కలిగించింది. వందలు, వేల కుటుంబాలు, సంస్కారవంతులైనారు.

ఇదంతా చలం చూస్తూనే వున్నాడు. ఐనా మానసిక అంధత్వంతో చూడలేక పోయినాడు.

స్త్రీలకు పురుషులకు ప్రేమ చంచలమనీ, సహజమని, అది ప్రకృతి ధర్మమని కనుక వివాహ వ్యవస్థ ధ్వంసం కావాలనే విపరీత వాదన చేప ట్టాడు.

ఈ వాదనతో. ఆచరణతో ఆయన అధికాధికంగా ఒంటరివాడైనాడు. ఆలోచనలో, రచనల్లో, నిజజీవితంలో ఈ ఒంటరితనం, అసహనాన్ని, ద్వేషాన్ని పెంచింది. ఆయనకు చిరకాల మిత్రులు,సన్నిహితులైన నండూరి సుబ్బారావుగారిని దూరం చేసుకున్నాడు. "నన్నుచూసి దూరదూరంగా సుబ్బారావు పోతున్నాడు" అని ఏలూరు అనుభవాలను గురించి రాసు కున్నాడు. మరో మిత్రుడు కృష్ణశాస్త్రి అంతకుముందే దూరమైనాడు. వారి మార్గాలు కూడా వేరైనాయి.

సిద్ధాంత సారూప్యత ఏమాత్రంలేని చింతా దీక్షితులు చలం మేళా కోరి రమణాశ్రమానికి చేర్చాడు. చివరకు ఆయన కూడా దూరమైనాడు. బహుశా ఆయన కర్తవ్యం పూర్తయిందని భావించి ఉంటాడు.

'ప్రీ' గ్రంథానికి 1940లో పీఠిక రాస్తూ చలం ఇలా అన్నాడు.

"ఆ కాలంలో నేను బతకటం ఇష్టంలేని ప్రజలమీద దండెత్తి 'సెల్ఫ్ ఎసెర్ట్' చేసుకోవటమే ప్రధానంగా వుండేది. ప్రజలకి ఎంత కోపం తెప్పిస్తే నాకు అంత సంతోషం. నన్నెదిరించిన వాళ్ళని మాటలు అదరకొట్టటానికి శక్తిహీనంగా తోచేవి. అందువల్లనే ఆనాటి పుస్తకాలనిండా అతిశయోక్తులూ, వన్ సైడెడ్ స్టేటుమెంట్సు ద్వేషం కూడిన తిట్లూ, అనవసర శృంగారమూ ఉండేవి."

ఈ వ్యాకాలను చూస్తే చలం గతాన్ని గురించి పశ్చాత్తాపపడుతున్నాడా అనిపిస్తుంది. అదేంలేదు రమణాశ్రమం చేరిన తర్వాత ఆఖరు దశలో చేసిన రచనలలో కూడా "నా పూర్వ రచనలను ఒక్కటినీ నేను నిరాకరించటంలేదు" అని పదేపదే అంటూ వచ్చాడు.

పరస్పర విరుద్ధభావ ప్రకటనలు చలంలో కోకొల్లలు.

గురజాడ అప్పారావుగారు ఆంధ్రసాహిత్యంలో సర్వవిధాలైన ఆధునికతకు ఆద్యుడు, మూలపురుషుడు. కన్యాశుల్కం పీఠికలో ఆయన రాసుకున్న మాటలు చూడండి "నేను అవినీతిని ఆకర్షణీయం చేయటంలేదు గదా".

వేశ్య అయిన మధురవాణి పాత్రను అత్యద్భుతంగా చిత్రించి చివరకు వేశ్యా వృత్తిలోని హైన్యాన్ని ఆయన చిత్రించాడు. అయినప్పటికీ తానై చేసుకున్న హెచ్చరికను, అవినీతిని ఆకర్షణీయంగా చేయకపోవటాన్ని పాటించాడు.

చలం పూర్తిగా అందుకు వ్యతిరేకం. అవినీతిని ఆకర్షణీయం చేయటం, మితిమీరిన శృంగార వర్ణనలతో పెద్దలలో జుగుప్సను, పిన్నలలో లైంగిక కుతూహలాన్ని రెచ్చగొట్టాడు.

'తన పుస్తకాలను పెద్ద మనుషులు సైతం రహస్యంగా చదువుకుని ఆనందిస్తున్నారు' అని తన రచనలకు అది ప్రశంస అయినట్టు చెప్పుకున్నాడు. పెద్దలుగాని, పిన్నలుగాని రహస్యంగా చదివి ఆనందించే పుస్త

ాలు, వారిలో అభ్యంతరకర భావాలను, అభిరుచులను, ఆకాంక్షలను రెచ్చ గొట్టేతీరుతాయి. చలం పుస్తకాలే కాదు ఒకప్పుడు నిషిద్ధమైన శృంగార గ్రంథమాలలోని రచనలను కొందరు ఇలాగే చదివారు. ఎవరు చదివినా, ఏది చదివినా పదిమంది వింటే ఏమనుకుంటారో అనే భీతితో చదివే రచనలు, పాఠకులలో ఆ మేరకు నిద్రాణమై వున్న అనారోగ్యకర లక్షణాలను ప్రకోపింప చేస్తాయి.

ఈనాడాపని దిన, వారపత్రికలలో సీరియల్ రచయితలు బాహాటంగా చేస్తున్నారు. అశ్లీల సాహిత్యాన్ని పనిగట్టుకుని ప్రచారం చేస్తున్నారు. పాఠకులలో సంఘవ్యతిరేక భావాలను రెచ్చగొడుతున్నారు.

ఈనాటి అశ్లీల రచనలకు చలం ఆనాడే బీజాలువేశాడు అంటే అతిశయోక్తి కాదు.

అనేక కారణాలవలన కొన్ని పాశ్చాత్య దేశాలలో ఈపాటికే వివాహ వ్యవస్థ విచ్ఛిన్నమైంది. మూడుతరాలు కలిసి జీవించే కుటుంబ వ్యవస్థ పోయింది. పోవలసిందే. రెండుతరాలు, తల్లిదండ్రులు సంతానం కలిసి జీవించేది వివాహ వ్యవస్థ. అదీపోయింది. తండ్రి ఎవరో తెలియని పిల్లలు అసంఖ్యాకంగా జన్మిస్తున్నారు. తల్లి ఒక్కతే వారి బాధ్యతలను ఎలా చూడగలదు. అనాథ శరణాలయాలలో ఉంచి, కొంత ధన సహాయం చేస్తూ వుండవచ్చు. కొన్ని సందర్భాలలో అదీ లేకపోవడం మామూలైంది. అమెరికాలోను, యూరప్ ఉత్తర దేశాలలోను ఈపరిస్థితులు విపరీత రూపం ధరించాయి. తల్లిదండ్రుల ప్రేమకు, ఆదరణకు, ఆప్యాయతకు దూరమైన పిల్లలలో అత్యధికులు సంఘ వ్యతిరేక శక్తులౌతున్నారు.దొంగలు, జూదాకోర్లు, స్మగ్లర్లు, హంతకులు, అంతా దాదాపు ఇలాంటివారేనని, సామాజిక శాస్త్రవేత్తలు పేర్కొంటున్నారు. ఇదొక అంతర్జాతీయ సమస్యగా మారింది. కనుకనే కుటుంబ వ్యవస్థ అనగా తల్లిదండ్రి పిల్లలు అనే వ్యవస్థ పునరుద్ధరణకై తీవ్ర ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఐక్యరాజ్యసమితి 1994వ సంవత్సరాన్ని 'International Family Day'గా జరపమని పిలుపిచ్చింది.

పాశ్చాత్య సంస్కృతిలోని ఈ వ్యతిరేక లక్షణాలను, భారత దేశం కొని తెచ్చుకోనక్కరలేదు. ఇదంతా అనివార్యం. ముందు వివాహ వ్యవస్థ సర్వనాశనం కావలసిందే. ఆ తర్వాత ఏదో వ్యవస్థ అదే వస్తుంది అనుకోవటం విధివాదం (fatalism) అశక్తతావాదం, కర్మవాదం. ఇతర దేశాల అనుభవాలనుండి జాగ్రత్తపడి ముందు జాగ్రత్తలు తీసుకోవటం విజ్ఞతగల ప్రజల లక్షణం.

స్త్రీ పురుషుల మధ్య మౌలికమైన వైరుధ్యంలేదు. ఉన్నదల్లా సాంస్కృతిక అగాథం. పురుషాధిక్యతా భావాలు నరనరాన జీర్ణించిన సమాజంలో మనం ఉన్నాం. దానిని మార్చటానికి ఒక సాంస్కృతిక మహోద్యమం అవసరం. మానసిక పరివర్తనకు ఇందులో చాలా పాత్ర వుంది, అవకాశమూ వుంది.

మౌలికమైన సామాజిక ఆర్థిక ఘర్షణలను సైతం శత్రుత్వపూరిత వైరుధ్యంగా చూసి, సాయుధ పోరాటం, హింసాయుత పోరాటాలద్వారానే అవి పరిష్కారమౌతాయనే వాదనలకు, ధోరణులకు కాలదోషం పట్టింది, పడుతున్నది. ప్రజాతంత్ర పద్ధతులద్వారానే వాటిని పరిష్కరించుకోవాలని, మరో మార్గం చేబడితే నిరంతర, నిరర్థక అంతర్యుద్ధాలతో సమాజం అతలాకుతలం అవుతుందని ప్రపంచ పరిణామాలు రుజువు చేస్తున్నాయి.

ఈ స్థితిలో, స్త్రీ పురుషుల మధ్య వైరుధ్యం, శాశ్వత వైరుధ్యం ఉన్నట్లు వివాహ వ్యవస్థ విధ్వంసనే అందుకు పరిష్కారమైనట్లు భావించటం ఏ మాత్రం సమంజసంకాదు. వీరేశలింగం ప్రారంభించి, ఆ తర్వాత వారు కొనసాగించిన, కొనసాగిస్తున్న సంస్కరణనూ, వివాహ సంబంధాల ఉన్నతీకరణ, మానవీకరణ, సంస్కృతీకరణలనూ ముందుకు తీసుకుపోవటమే సమస్యకు పరిష్కారం.

చలంగారి స్వేచ్ఛా ప్రణయవాదం చివరికెలా పరిణామం చెందింది?
'పురుగుల్లా బతకటం కంటె స్వేచ్ఛగా చనిపోవటం నయం."

"యధేచ్ఛగా ప్రవర్తించి నీవు సృష్టించుకున్న అగ్నిలో దగ్ధం కావటానికి నీవెప్పుడూ సిద్ధంగా ఉండాలి."

ఇవన్నీ చలం వేర్వేరు సందర్భాలలో చెప్పిన మాటలు.

ఫ్రాయిడ్ భావాలతో ప్రభావితమైన రచయిత చలం. లైంగికవాంఛ

అన్నిటికంటె ప్రబలమైన ఏకైక సహజాతమని ఫ్రాయిడ్ సిద్ధాంతం. ఆయా దేశ, కాల పరిస్థితులు, వ్యక్తుల గ్రూపుల మనస్తత్వాన్నిబట్టి సహజాతాలు మారుతుంటాయి. మౌలిక సహజాతం అంటూ ఏదీలేదు. ఆర్థిక కారణం ఏకైక చోదకశక్తి అని భావించిన సోవియట్ వ్యవస్థ కూలిపోయింది. ఫ్రాయిడ్ సిద్ధాంతం పరిమిత సత్యమేతప్ప పరమ సత్యం కాదని ఇప్పుడిప్పుడు శాస్త్రజ్ఞులు గుర్తిస్తున్నారు. అఖండ సత్యం అంటూ ఏదీలేదు. బహుకారణాలు, ఆ మాటకొస్తే అనంత కారణాలు, మానవ పురోగతికి చోదక శక్తులుగా ఉంటున్నాయి. ఆయా పరిస్థితులననుసరించి వాటి అన్వయం, ప్రాధాన్యత మారుతూ వస్తున్నది.

గురజాడ అప్పారావుగారి కాలానికి విద్యావతి అయిన అధునిక స్త్రీ ఆవిర్భవించలేదు. అయినా దూరదృష్టితో "భవిష్యత్తులో స్త్రీలు చరిత్రను పునర్నిర్మించగలరు" అని ఆయన అన్నాడు. విద్యావంతులైనవారు, విద్యాగంధంలేనివారు సైతం ప్రస్తుతం చరిత్రను పునర్నిర్మిస్తున్నారు. నెల్లూరు మహిళోద్యమ ప్రభావంతోనే సారా నిషేధం రావటం ఒక ఉదాహరణ.

చలం కాలంనాటికి ఆధునిక స్త్రీ ఆవిర్భవించింది. అన్ని రంగాలతోను పురోగమించింది. ఆయన అవసానకాలంనాటికి ఇంకా పురోగమించింది. అయినా చలాన్ని ఆవరించిన మానసిక అంధత్వం, ఈ వాస్తవాన్ని చూడనివ్వలేదు. "తిరుగుబాటు తర్వాత మరొక తిరుగుబాటు" అన్నాడు. నేటి స్త్రీ వాదులలో కొందరికీ మాట సందేశంగా స్ఫురిస్తున్నది.

సత్వ, రజస్తమోగుణాలు అని మూడు. పూర్తి సత్వగుణ ప్రధానుడు తత్వవేత్త కావచ్చునేమోగాని, సృజనాత్మక రచయితకాలేడు. రచనలద్వారా పాఠకులలో, వీలైనంత కదలిక, చలనం ఆలోచనలను రేకెత్తించాలంటే, తనతో ఎంతోకొంత ఆత్మవిశ్వాసపరమైన రజోగుణం ఉండాలి. రజోగుణం, సత్వగుణంతో, అనగా నిగ్రహంతో జోడిస్తే ఉత్తమ రచయిత అవుతాడు. దురదృష్టవశాత్తు చలం, రజోగుణాన్ని తమోగుణంతో జోడించాడు. ఫలితంగా ఆయన ఆశించిన మనశ్శాంతి కూడా ఆయనకు లభించలేదు.

రమణ మహర్షి, రామకృష్ణ పరమహంస, అరవిందలాంటి వారలతో తాత్విక మార్మికత ఉన్నా, సత్వగుణ ప్రధానులు. వారికి మనశ్శాంతి

లభించింది. చూసినవారికి మనశ్శాంతి కలుగుతుంది. తన మంచితనంతో, మానసిక ఔన్నత్యంతో పురుషుల వక్రమార్గాలను సరిచేయగల స్త్రీని అప్పారావుగారు ఊహించారు.

తీరని కోర్కెలతో, వాంఛలతో, అసంతృప్తితో జీవిస్తూ, తిరుగు జాటు తర్వాత తిరుగుజాటు అని ఎండమావులకు ఎదురుచూసే స్త్రీని చలం ఊహించారు. జాతి చరిత్రను తిరిగి నిర్మిస్తున్న శ్రీ అప్పారావుగారి 'స్త్రీ'. చలం ఊహించిన స్త్రీకాదు, కొందరు స్త్రీవాదులూహించే స్త్రీ అసలే కాదు.

'ఒక మనిషి జీవితకాలంలో చేయగలిగినంత ప్రయాణం చేసిన మహర్షి' అని ఒకరు అంటున్నారు. గతాన్ని కాదనలేక, భవిష్యత్తును చూడలేక నిరాశతో చిత్తశాంతికై ఆరాటపడుతూ తనువు చాలించిన భగ్న యోగి అని నేను అంటాను.

ముగింపుగా ఒకమాట. వివాహ వ్యవస్థలోని పురుషాధిక్యతా లక్షణాన్ని ప్రశ్నిస్తూ చలం అనేక ప్రశ్నలు లేవనెత్తాడు. అదే ఆయన గొప్పదనం.

అందుకు సూచించిన పరిష్కారమార్గం, స్త్రీలకుగాని, పురుషులకు గాని హానికరం.

స్త్రీ పురుషులను పురోగతి దశలోకాక, తిరోగతి దశలో స్తంభింప చేస్తుంది.

# చలం ఒక అచలం

డాక్టర్ ఎస్. రామచంద్ర
(ప్రొద్దుటూరు కళాశాలలో తెలుగు శాఖాధిపతులు)

గత శతాబ్ది చివర, ప్రస్తుత శతాబ్ది ప్రారంభం ఆంధ్ర సాహిత్య రంగాన్ని ప్రఖ్యాత రచయితలు, కవి పండితులు వివిధ సాహిత్య ప్రక్రియలతో తీర్చిదిద్దిన కాలం. ఇరుగుపొరుగు ప్రాంతాల సమకాలిక కవులు, సాహిత్య రంగంలో వివిధ ప్రయోగాలు చేస్తున్న పాశ్చాత్యులు, తెలుగు సాహితీ స్రష్టల్ని ఎంతగానో ప్రభావితం చేశారు. నవీన భావవినిమయానికి భాషలో వచ్చిన మార్పులు, అచ్చు యంత్రాలు, పత్రికలు దోహదం చేశాయి. దేశీయ మేధావుల చిత్తవృత్తుల్లో సంఘ సంస్కరణాసక్తి పెరిగింది. సంప్రదాయాల్లో, మత విశ్వాసాల్లో గొప్ప మార్పు వచ్చి మౌఢ్యం వదిలిపోయి హేతువాద ధోరణి ప్రబలింది. అన్ని రంగాలు సంస్కరణను ఆశిస్తున్నట్లు గుర్తించారు. సంఘ సంస్కరణ ఉద్యమంతో మెల్లమెల్లగా రగులుతున్న భావ విప్లవ విస్ఫులింగాలు ఆంగ్ల విద్యావ్యాప్తితో చండ ప్రచండమయ్యాయి. ఒకవైపు పత్రికల, మరొకవైపు ప్రచురణ సంస్థల ప్రోత్సాహంతో సాహిత్యరంగంలో నవల, కథానిక, వ్యాసం, ఖండకావ్యం, నాటిక, విమర్శలాంటి ప్రక్రియలు నిలదొక్కుకున్నాయి. ఈ ప్రక్రియల్లో పరాశ్రయత్వంపోయి వాస్తవికాంశ చిత్రణం, ఆత్మాశ్రయత్వం ప్రధాన గుణాలయ్యాయి. పద్యం కంటె వచనం ప్రచారం పొందడం, సాహిత్యం జమీందార్ల బాహుబంధాల నుండి సామాన్యుడి కౌగిట్లో ఒదిగిపోవటం యీనాటి ప్రత్యేకత.

సంఘ సంస్కరణ రంగంలో కందుకూరి, సాహిత్య రంగంలో గురజాడ, భాషా రంగంలో గిడుగు నవయుగ వైతాళికులుగా జన్మించడం ఆంధ్ర దేశం చేసుకున్న గొప్ప అదృష్టం. ఏక్య చైతన్యాన్ని తనలో నింపుకొని మానవతా వాదం పునాదిగా, వివాహ వ్యవస్థను దుష్టంగా భావించి స్త్రీ స్వేచ్ఛను ప్రచారం చేసిన వ్యక్తి గుడిపాటి వెంకటచలం (18-5-1894 – 5-5-1979).

## జీవితం

చలం తల్లిదండ్రులు వెంకట సుబ్బమ్మ, సాంబశివరావులు. బుద్ధ జన్మదినమే చలం జన్మదినం. ఇంటిపేరు 'గంగరాజు' వారు. స్వస్థలం కొమ్మూరు. ఆ తర్వాత 'కొమ్మూరు' ఇంటి పేరైంది. గుడిపాటి వెంకట్రామయ్యకు చలం దత్తత చేయబడ్డాడు. అందువల్ల చలం ఇంటిపేరు 'గుడిపాటి' అయింది. గుడిపాటి వారి నివాసస్థలం గుడివాడ తాలూకా వెంకటాపురం.

చలం జన్మతః వ్యాధిగ్రస్తుడు (MIGRANE) బద్ధకంగా, అర్భకంగా వుండేవాడు. చలం తప్పులకు తండ్రి కొట్టి, కొరత వేసి విపరీతంగా బాధించాడు. అందువల్ల తండ్రిపై విరోధం పెంచుకున్నాడు. "మా నాన్న అనేవాడు లేకపోతే It is not such a bad world at all" అంటాడు. తల్లిదండ్రులకు పోషించే బాధ్యతేగాని బాధించే అధికారం వుండకూడదంటాడు. బాల్యంలో పురాణ శ్రవణం చేసిననాడే 'సీత అగ్ని ప్రవేశం' చలం మనస్సును కదిలించింది. ఆయన ఆలోచనా ధోరణిని, తీవ్ర విమర్శల్ని గుర్తించిన శిష్టులు ఆయన్ని సంఘ బాహ్యుడిగా చూశారు. ఉపాధ్యాయుడుగా, ప్రధానోపాధ్యాయుడుగా, స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్‌గా ఆంధ్ర దేశం నలుమూలలూ తిరిగాడు. మాటర్ లింక్, బోస్, రవీంద్రుడు చలం భావజాలానికి పదును పెట్టారు. 1911లో రంగనాయకమ్మతో వివాహం జరిగింది. రవి, సౌరిస్, వసంత్, నిర్మల, చంపక చలం సంతానం. రాజ్యలక్ష్మి (నర్తకి) పెంపుడుబిడ్డ. రవి చనిపోయాడు, వసంత్ ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. సౌరిస్ తాపసి అయింది. రంగనాయకమ్మ స్వతంత్ర భావాలు గల వ్యక్తి. "ఏమిటి ఆ దరిద్రపు గొట్టు రాతలూ

నుష్వా" అని ఆమె విమర్శించినా "ఆమెకో వ్యక్తిత్వముంది" అని సరి పెట్టుకొని ఎవరి ఆలోచనల్లో వాళ్ళుంటూ త్వరలోనే అభిప్రాయభేదాలకు వచ్చేశారు. "నా కోసం తన ఆస్తిని, బంధువుల్ని, మర్యాదల్ని వొదులు కున్న ఆమెను నేనే బిట్రే (BITRAY) చేశాను. నా పుస్తకాలతో, నా స్త్రీతో, నా ఎదురు తిరగడాలలో, నా జీవితంవల్ల, నా ఆలోచనల వల్ల ఆమెకు చాలా నష్టం వాటిల్లింది" అని పశ్చాత్తాపడ్డాడు. తర్వాత ఆమె జీవిత భీమా ఏజెంట్‌గా వుంటూ జీవితంలో అన్ని విధాలైన కువిమర్శల్ని దిగమింగి తనువు చాలించింది. "అతను నా భర్త అని మరిచిపోండి. నన్ను నన్నుగా తీసుకోండి" అన్నా ఆమెను సంకుచిత లోకం స్వీకరించ లేదు. ఇంత స్థిరమైన వ్యక్తిత్వం గల స్త్రీని లోకం స్వీకరించనందుకు చలం మనస్సువైకల్యంతో గాయపడింది.

చలం తన సంతానానికి స్వేచ్ఛ నిచ్చాడు. "మీ జీవితాలు మీవి. మీరేం చేసుకున్నా మీ యిష్టం. నాకో ప్రిన్సిపుల్ వుంటే, నాకో గ్రౌండ్ వుంటే కదా ! నేనే చీకట్లో వెతుకుతూ బతుకుతున్నాను" అని ఎవరి అధి కారమూ లేని ఓ కుటుంబాన్ని క్రియేట్ చేయాలని తపనపడ్డ చలం ప్రజల దృష్టిలో అనేక విమర్శలకు గురి అయ్యాడు.

భార్య రంగనాయకమ్మ, వదినె డాక్టర్ రంగనాయకమ్మ, లీల- ఇలా ఎందరో ఆయన జీవితంలో ప్రవేశించినా ఆయన్ను మార్చలేకపోగా "నీవు స్త్రీ లోలుడవు కావు. లోకంలో ఏ జీవి బాధపడ్డా నీవు సహించ లేవు. నీ సుఖం కంటె యితరుల బాధా నివారణే నీకు అధికం" అని ఆయన గొప్పతనాన్ని ప్రశంసించారు. లీల దృష్టిలో చలం మానవులందరి కంటు అధికుడు. చలం జీవితంలో లీల ప్రవేశం ఒక అద్భుతం. ఏ జానపద కథలలోనో యిలాంటి అద్భుత సంఘటన సంభవం. ఆమె చని పోయినపుడు "మదురమైన సంకెళ్ళు ఒకటి తర్వాత ఒకటి ఇట్లా రాలి పోతున్నాయి" అంటూ స్మరించుకున్నాడు.

## ఆలోచనలు

సంఘ వివాహ వ్యవస్థలలోని కుళ్ళుపై విరుచుకుపడి సాహిత్యమే సాధనంగా, వ్యవస్థా నిరసనమే జీవితంగా సమాజంలో నలుమూలలా

జాగృతిని ప్రేరేపించి తాను నిద్రపోక, సమాజాన్ని నిద్రపోనీక వివాదాస్పదుడుగా మిగిలిపోవడానికి చలంలో ప్రధానంగా చెలరేగిన కల్లోలాంశాలు రెండు. రఘుపతి వెంకటరత్నం నాయుడు సాహచర్యంతో బ్రహ్మ సమాజంలో చేరి అక్కడున్న అనాథ శరణాలయ బాలికలకు నాయుడు ఏర్పరచిన అడ్డుగోడలు పనిచేయకపోగా అక్రమ సంబంధాలున్న యువతీ యువకులకు బలవంతంగా వివాహాలు చేయడం చూచి, అలాంటి ప్రేమ లేని పెళ్ళిళ్ళను చలం హర్షించలేకపోయాడు శృంగారవాంఛ, శృంగార క్రియలు బ్రహ్మసమాజ విరుద్ధ కార్యాలు. చలంఅందులో కంఠదఘ్నంగా మునిగితేలుతున్నవాడు. ఆయనలో మీమాంస వచ్చింది. "ఇది పాపమా ? ఇంత ఆనందకరమైనది పాపమా? భార్యతో లేని పాపం ఇంకో స్త్రీతో పాపమెట్లా అయింది? స్త్రీని తలుచుకుంటే పాపం! ఆమెనే పెళ్ళి చేసుకుంటే ఆ నిముషం నుంచి ఆలోచనలోనే కాదు. ఆమె దేహాన్ని ఏమి చేసుకున్నా పవిత్ర కార్యమయింది. దీన్నే పెళ్ళి అంటున్నారు. దీన్ని అంగీకరించాలా ? వద్దా ? అదొక అలజడి.

నైతిక సమస్యలు తలెత్తేటప్పటికి ఈశ్వరునిపై ప్రశ్నలు బయలుదేరాయి. ఈశ్వరుడు నిజంగా వున్నాడా? లేడా? ఈ సృష్టి ఆయనదేనా? ఇంతకంటే ఉన్నతంగా ఆయన లోకాన్ని సృజించలేక పోయాడా? పుట్టుకతోనే కొందరిని క్రూరంగా, వికారంగా ఎందుకు చేస్తున్నాడు? స్త్రీని బాధలతో ఎందుకు కాల్చుకు తింటున్నాడు? కరుణామయుడైన ఈశ్వరుడు నిష్కారుణుడుగా ప్రవర్తించడం చలంలో రేపిన రెండవ అలజడి. తన ప్రశ్నలకు సరైన సమాధానాలు దొరక్క భగవంతుడి మీద, బ్రహ్మ సమాజంమీద ఎదురు ప్రశ్నలు వేశాడు. బ్రహ్మ సమాజం వదిలివేశాడు. దీనితో చలం సాంఘిక వ్యవస్థలపై తిరుగుబాటు బావుటా ఎగురవేసినట్లయింది.

## ఇతరుల ప్రభావం

ప్రతిభావంతులైన నాటి సాహితీవేత్తలు భారతీయేతర సాహిత్య ప్రభావాలకు లోనైనట్లే చలం కూడా ప్రభావితుడయ్యాడు. కవిత్వం విషయంతో షెల్లి, కీట్స్, వర్డ్స్ వర్త్, బైరన్‌లు, రూపక విషయంలో షేక్స్పియర్, బెర్నార్డ్ షాలు, నవలా రచనలలో టాల్‌స్టాయ్, మపాసా, ఎడ్గార్

ఎలెన్ పో, వెల్స్, లారెన్స్‌లు, వేదాంత రంగంలో హాక్స్లే, సాత్రే, రస్సెల్‌లు ఆనాటి రచయితల మీద ప్రభావం నెరిపారు. చలం నవలలు 'శశిరేఖ, దైవమిచ్చిన భార్య' ఆంగ్ల నవలల నీడల్లో తలదాచుకొన్నవే. ఆయన సృజించిన అనేక కథలకు జాయిస్, ప్రెస్ట్, హెర్మెస్‌ల ప్రేరణ వుంది. తెలుగులో శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి, నండూరి అభిమాన కవులు. ఆత్రో చనల జాడ గురజాడది. చలాన్ని అమితంగా ఆకర్షించిన కథకుడు చింతా దీక్షితులు. టాగూర్ మానసిక గురువు.

దీక్షితుల ప్రోత్సాహంతో చలం రమణ మహర్షి భక్తుడయ్యాడు. ఆంధ్రు లకు ఒక కథకుణ్ణిగా చలాన్ని పరిచయం చేసినవాడు, ఆ కథకుణ్ణి పంపి అధ్యాత్మిక మార్గంలో నడిపించినవాడూ ఆయనే. నిరీశ్వరవాదిగా, బ్రహ్మ సామాజికుడుగా, రమణ భగవాన్ భక్తుడుగా, ఆత్మజ్ఞానిగా చలంలో యిన్ని కోణాలేర్పడటానికి దీక్షితులు, భగవాన్ ముఖ్యులు.

సాంఘికంగా బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నంనాయుడు చలం నైతిక జీవితాన్ని ప్రభావితం చేశాడు. నాయుడు దివ్యజీవనం గడిపిన మహా పురుషుడు. తన జీవితం నైతికంగా, ఆధ్యాత్మికంగా ఎంతో ప్రభావితమై నట్లు ఒప్పుకుంటూ "నాకు తెలిసినంతవరకు తన జీవితంలో స్త్రీని ఉన్న తంగా చూచింది ఒక్క నాయుడుగారే. ఆయనే నా మొదటి ఆధ్యాత్మిక గురువు" అంటాడు చలం.

చలం జీవితంలో రవీంద్రుని ప్రభావం మరువరానిది. గీతాంజలి చలం నిత్య పారాయణ గ్రంథం. "ఠాగూరు లేకపోతే ఎండల్లో, ఆకుల్లో నీడలు నిద్రపోవడం, మబ్బుల్లో కన్నీళ్ళు కరిగిపోవడం, అర్ధరాత్రి నక్ష త్రాల మిస్టరీ నాకెవరు చెప్పగలిగేవారు ?" అంటాడు. ఈ అభిమానంతో రవీంద్రుని గీతాంజలి, ఫ్రూట్ – గాథెరింగ్, క్రాసింగ్, గార్డెనర్, గిఫ్ట్ మొదలైన గ్రంథాల్ని అనువదించాడు.

## సాహిత్యతత్త్వం

సమాజంలో ముఖ్యులైన స్త్రీ, పురుషుల సాహచర్య జీవనంతో వున్న వైషమ్యాల్ని, వైవాహిక జీవితంలోని లోపాల్ని, మత విషయక మైన పురాతనాచారాల్ని, కుళ్ళు నీతుల్ని, సమాజాన్ని కలుషితం చేసే

అన్ని రుగ్మతల్ని చలం తన సాహిత్యం ద్వారా (1920 - 1950) తీవ్రంగా విమర్శించాడు. ఈ నేపథ్యంలో ఆయన ఎనిమిది నవలలు, తొంభై కథలు, పదకొండు వ్యాస సంకలన సంపుటాలు, ముప్పై ఆరు రూపకాలు నిర్మించాడు. ఇవికాక లేఖలు, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్; తాత్త్విక గ్రంథాలు, అనువాదాలు, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర, సినిమా కథ, వచన కవితలు - ఇలా అనేక ప్రక్రియల్ని చేపట్టి సమర్థవంతంగా నిర్వహించాడు. ఈ సాహిత్యంలో స్త్రీ స్వేచ్ఛా సాధనకైన తపన, ఆరాటం సానుభూతి ఓతప్రోతంగా ప్రతిబింబించింది. అయితే చలం సాహిత్యంగా ముద్రపడ్డవి ఆయన నవలలు, కథలు, నాటికలు, వ్యాసాలు, మ్యూజింగ్స్, ప్రేమలేఖలు మాత్రమే. ఈ సాహిత్యం ద్వారా యీ శతాబ్ది మధ్య భాగం వరకు సమాజంపై విశేష ప్రభావం నెరిపాడు. ఈనాడు ఒక యువకంఠం నుంచి ఉత్తేజపూర్ణమైన చురుకు పలుకు వినిపించిందంటే, ఒక యువతి ఉజ్జ్వల నేత్రం ఉరిమి చూచి నిప్పురవ్వల్ని చిందించిందంటే వాళ్ళ వెనుక చలం సాహిత్యం నూరిపోసిన వ్యక్తిత్వం తాలూకు తీక్షణత భగ్గుమంటు న్నదని భావించాలి. ఈనాటి 'స్త్రీ వాద కవిత' లాంటి కొంగ్రొత్త భావ జాలానికి ఆనాడు చలం వేసిన ప్రాతిపదికే తొలి పునాదిరాయి.

వంట ఇంటికి, పడకటింటికి పరిమితమై, తినడానికి కనడానికి తప్ప మరెందుకు పనికిరానిదిగా గుర్తింపబడ్డ "స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకు మెదడు వుంది. దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకు హృదయం వుంది. దానికి అనుభవం యివ్వాలి" అని గుర్తించి తత్సాధనకు ఆయన తపన పడ్డాడు.

సంఘం స్త్రీకి విధించిన కట్టుబాట్లు చాలా వికృతమైనవి. మనుపరా శరాది స్మృతులు, గౌతమ నారదాదుల ధర్మసూత్రాలు స్త్రీపట్ల ప్రదర్శిం చిన వివక్ష అమానుషమైంది. స్త్రీ, పురుషులకు సమ ప్రాతినిధ్యం కల్పించ బడకపోవడంలోని నైచ్యాన్ని చలం సూటిగా సూనృతంగా ప్రశ్నించాడు. యుగయుగాల స్త్రీ జాతి మూగవేదన, అంధకారంలో అన్వేషించే దిక్కు లేని దుర్బల జీర్ణ ఆవేశం, అధమ చరిత్రగల అబలల గర్భశోకం చలంనవల లకు యితివృత్తం. విప్లవం, తిరుగుబాటు, స్వేచ్ఛ మొదలైన సంస్కార ణాత్మక భావాలు చలం నవలల్లో, కథలో. వ్యాసాల్లో స్త్రీకి తెలియ

జెప్పాడు. సమాజం, సంప్రదాయం, పురుషుడి ఆధిక్యత – వీటి నుండి తొలగి స్వతంత్రంగా బ్రతకాలనుకొన్న స్త్రీని అవి యెలా లొంగదీస్తాయో ప్రదర్శించి, వివాహ వ్యవస్థలోని కామగతమైన సంబంధాన్ని, ప్రేమ రహితమైన జీవితాన్ని విమర్శించి స్త్రీ, పురుషులు స్వేచ్ఛగా, పరస్పరా కర్షణలతో శృంగార భావనలతో, అవగాహన గల హృదయాలతో నిష్కల్మషమైన జీవితాలు గడపాలని చలం ప్రతిపాదించాడు. దైవ శక్తిని యెరుగని తాను స్త్రీ శక్తినే దైవశక్తిగా ఆరాధించాడు. స్త్రీ ప్రేమ లోని ఔన్నత్యం, హృదయంలోని ఔదార్యం ప్రస్తరించి చూపాడు. ప్రాచీన వ్యవస్థను నిరసించే నవ్య సామాజిక దృక్పథాన్ని ప్రచారం చేశాడు. స్త్రీ, పురుషుల సంబంధం; ముఖ్యంగా ప్రణయం చాలా సున్నిత మైందని, అది నిత్య నూతనంగా కొంగ్రొత్త ఆకర్షణలతో గొప్ప సుఖాలకు దారితీయాలని అట్లాంటి ప్రణయాన్ని అహంకారంతో, వ్యవస్థాబలంతో, అధికారంతో, పాతివ్రత్యం లాంటి ఇరుకు వికృతాలోచనలతో లొంగదీసు కోవడం మూర్ఖమని నవలల్లో కథల్లో విశ్లేషించాడు. సాంఘిక న్యాయంలో స్త్రీకి ఆర్థిక స్వావలంబన లేమిని గర్హించాడు. సీతా, సావిత్రి, భానుమతి, ఊర్వశి మొదలైన పౌరాణిక పాత్రలకు సైతం నవ్యభావనల్ని నేర్పాడు.

## చలం శైలి

చలం ఆలోచనా విధానం ఎంత కరుకైనదో ఆయన రచనా శిల్పం, శైలి అంత పదునైనది. తనదే అయిన ఒక సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి ఆయన వేదికలెక్కి ఉపన్యసించలేదు. కాని సాహిత్యాయు ధంతో సంఘాన్ని ఉరిమి, చీల్చి, చెండాడి జవజీవాలు గల భాష ద్వారా సజీవమైన శైలిని నిర్మించుకొని దానికీ 'చలం శైలి' అనే ముద్రను సాధించి తన సాహిత్యాన్ని, శైలిని అనితర సాధ్యం చేశాడు. "సుఖంగా నిద్రపోయే మనుషుల్ని కదల్చకపోతే కాయితమూనూ, అచ్చు వృథా" అంటాడు చలం. తన రచనలకు అబలల ఆర్తి మూల సూత్రంగా చేసు కొని సమాజాన్ని తట్టిలేపాడు. చలం పదునైన శైలికి శ్రీశ్రీ మహాప్రస్థా నానికి వ్రాసిన యోగ్యతా పత్రం, 'ఓ పువ్వు పూసింది' కథానిక, 'అమీనా' నవల, 'ఊర్వశి' రూపకం గొప్ప ఉదాహరణలు.

## ముందు చూపు

పెళ్లిమేళాలు మోగని సమాజం, పిల్లల రోదన వినపడని కుటుంబం

స్వేచ్ఛగా విడిపోగల వివాహ వ్యవస్థ, అర్థవంతమైన విద్యావిధానం చలం ఆదర్శాలు. "గొప్ప కావ్యాలు వ్రాయాలంటే పదాలు కాదు, సమాసాలు కాదు, వ్యాకరణం కాదు కావల్సింది ఆత్మౌన్నత్యం, **Struggle, Rebellion** అని తన తత్త్వాన్ని తానే ప్రవచించుకొన్నాడు. ఒక్క తల వూపుతో సమకూరే ప్రయోజనాల్ని కాలదన్ని" ఎవడి ముందు తల వొంచడం నాకు నరకం" అనే దృక్పథంతో బ్రతికాడు. చలంలాగా రచయితల్లో ఇంటా బయటా యింతటి సంఘ బాహ్యతను, ప్రతిఘటనను ఎదుర్కొన్నవాళ్ళు అరుదు.

## మలి దశ

చలం రేపిన విప్లవ ఝంఝామారుతంలో కొట్టుకొని పోయి తల మున్కలుగా వున్న అభిమానులకు తన మలి దశలో ఒక తీరని ప్రశ్న అయ్యాడు. నిద్రపోతున్న సమాజాన్ని తట్టి లేపి అలజడి సృష్టించాడు. శరణాగతులకు యేదారి చూపించలేక పోయాడు. దైవాన్ని దూరంగా తరిమి దైవం ముందు ఆత్మార్పణ గావించుకున్నాడు. బైరాగుల్ని తిట్టి బైరాగుల్లో కలిసిపోయాడు. సంస్కరణమని ఘోష పెట్టి "ఈ లోకమింతే ఇదొక బొమ్మలాట" అని వేదాంతంలో పడిపోవడంతో అభిమానులకు దిక్కుతోచక "ఏమిటీ? ఎందుకు?" అని ప్రశ్నించుకొని సందిగ్ధ స్థితిలో వుండిపోయారు.

నడుస్తున్న సమాజానికి దూరంగా జరిగి ఎంతో క్రాంతిని, ముందు చూపును ఆవాహన చేశాడు. చలం ఆలోచన వైయక్తికం. ఆయనకేక విజ్ఞులు భావించినట్లుగా "**His life is a message to nation, but unfortunately his course has become a melody in wilderness**" అయిపోయింది. ఈ దశలో చలం సమాజానికి దూరుడైనా ఒక చారిత్రక సంధి యుగంలో పుట్టి విప్లవకర ఆర్థిక సాంఘిక శక్తులకు అవసరమైన భావజాలాన్ని సమకూర్చి ఆవేశం, భావుకత్వం, విర్భీకత, వాక్కులోని పదును, నిష్కాపట్యం అంతశ్శుద్ధి అలంకారాలుగా జీవితం సాగించిన చలం కాల్పనిక వాదిగా పుట్టి (**Romantic**) దార్శనికుడుగా (**Mystic**) ఎదిగి సమాధానం దొరకని ప్రశ్నగా మిగిలిపోయాడు. మేధావుల ఆలోచనల్లో కొరుకుడు పడని వ్యక్తిగా అంచనాలకు అందకుండా విమర్శ, ప్రతివిమర్శల్ని దిగమింగిన 'చలం ఒక అచలం'.

# ఫిల్టర్ చేయాలి

డాక్టర్ చందు సుబ్బారావు

పునర్ముద్రణే అయినా బలరామమూర్తిగారి వ్యాసం (విశాలాంధ్ర 21-7-94) లోని అంశాలన్నీ అంగీకరించ తగినవే. చలం రచనల్లో ఆధునిక సాంకేతిక సమాజం స్వీకరించతగిన, స్వీకరించలేని అంశాలున్నాయి. ఏటుకూరిగారన్నట్లుగా చలం సంస్కర్త కాడు. శాస్త్రకారుడూ కాదు. సంస్కర్త కుండవలసిన సహనమూ, శాస్త్రకారుని కుండవలసిన కార్యాకారణ ఫలితాల సమీక్షణా చలానికి లేవు. ఆయన కేవలం రచయిత, తీవ్రవాది. సాధారణ రచయితలకు 'కల్పన, అత్యుక్తి' ఎక్కువగా ఉంటాయి. సొంతబాధలు, అణగారిన వాంఛలూ, సొంత స్వప్నాలూ రచనల్లో దిగుమతవుతుంటాయి. కాల క్రమేణా సమాజం కావలసింది స్వీకరించి మిగతాది పరిహరిస్తుంది. చలం విషయంలో ఈ ఫిల్టర్‌కు ప్రాముఖ్యత ఎక్కువగా వుంది.

చలం రచనలకు కొన్ని విశిష్ట లక్షణాలున్నాయి.

1. స్త్రీ శారీరక సౌందర్యానికి పరవశించిన చలం, స్త్రీ - పురుష సంబంధాలను చూసి తీవ్రంగా ఆగ్రహించాడు. స్త్రీ పురుష స్వేచ్ఛా సమాగమంలోని మాధుర్యాన్ని తాను చవిచూసే కొద్దీ అది ఎరుగని వారిమీద, వారు చేసే నైతిక సూత్రీకరణలమీద అసహనం ఎక్కువయింది. చావుకు పెడితే లంఖణానికొచ్చినట్లు తన రచనల్లో విడ్డూరం ఎక్కువైతే కాని సమాజం (కనీసం కోపంగానైనా) ప్రతిస్పందించటంలేదని గ్రహించాడు.

"రండి. రండి.... యిక్కడ మీకు ఆబగా జుర్రుకోవాలని చూసే

సెక్సు ముక్కలు చలంలో దొరుకుతా యని వస్తారులెండి...." అంటూ పాఠకులను తరచు సంబోధించాడంటే అర్థం ఏమిటి? "రహస్యంగా నిగూఢంగా అందరూ కామవాంఛదగ్గులే. ఈ నీతులు, ఈ మర్యాదలు, యీ బంధాలు మిమ్మల్ని కట్టి పడేస్తున్నాయి. తెగేసుకుని, తెగించి బయ ల్పడండి".... అని కదా చలం పదే పదే చెప్పేమాట. అంటే మీరు కూడా యీ సుఖాన్ని అనుభవించండి.... అవధుల్లేకుండా అనుభవించండి.... అన్నంతవరకే. అది ప్రధాన లక్షణం. ఆచరించి కూడా చూపటంవలన యీ ప్రబోధానికి గౌరవం లభించింది.

2. చలం రచనల్లో వెక్కిరింపు రెండో లక్షణం. ఇది నెగిటివ్ ధోరణి. స్త్రీ పురుషుల ప్రణయ స్వేచ్ఛ విస్తరించాలని, (విక్టోరియన్ మొరాలిటీ అనే పాత నీతి సూత్ర ప్రబంధం అడుగంటాలని) ఆ సౌఖ్యం అందరూ అనుభవించాలని చలానికంటే ముందు ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచాల్లో చాలా మంది గుర్తించారు. ప్రణయ స్వేచ్ఛ చలం 'డిస్కవరీ' కాదు. భారత దేశస్థులకు అనేక సార్లు ఉగ్గుతో పెట్టిన విద్య. స్త్రీని సమాన స్థాయిలో గౌరవించి, ప్రేమించి అనుభవించే 'ఆనెస్టు' ధోరణి (తెలుగులో వరకు) ప్రతిపాదనకు మాత్రం చలం ప్రథముడే ననవచ్చును. ప్రణయ స్వేచ్ఛకోసం వేశ్యావృత్తిని నెలకొల్పి వారికో కులాన్ని సృష్టించి పెట్టిన దేశం మనది. స్త్రీకి ఆ స్వేచ్ఛ పూర్తిగా నిరాకరింపబడింది. పైగా స్త్రీని సర్వ విధాలా అణగత్రొక్కడం పవిత్ర సామాజిక ధర్మమై కూర్చుంది. దీన్ని బద్దలు కొట్టటానికే చలానికి ఉక్రోషం సాధనమై, వెక్కిరింపు రచనలు ఆద్యంతమూ ఎక్కువై పోయాయి. ఒక 'అన్నా కెరినీనా'ను సమాజంలో చూడ గలంగాని ఒక 'శశిరేఖ' కనపడదు. కనీసం ఒక 'రాజేశ్వరి' కూడా అసంభవమే. ఏ ఒక్కపాత్రా వేళ్లా, కాళ్ళా ఉన్నట్లు కనిపించదు. అంటే విషయానికి వక్రరూపం యివ్వటం చలానికి జీర్ణించుకు పోయింది. చెప్పవలసిన విషయం అత్యంత ప్రధానమైనదైనా సహనం లేక చలం రచనలు విడ్డూర స్వరూపాన్ని సంతరించుకున్నాయి. నిజంగా భర్త మీద రోసి రాజేశ్వరి లేచిపోవటం వరకూ సహజమే. ఆనక మైదానంలో స్వర్గం గోచరించదు సరికదా బ్రతకటానికి కుక్కపాట్లు పడటమే జరుగు

తుంటుంది. విడ్డూర స్వరూపాల చిత్రణ సమాజంలో అంగీకారాన్ని పెంచక తిరస్కారాన్ని పెంచసాగాయి.

3. మూడవ లక్షణం చలం ప్రతిపాదించిన 'అతి'. తల్లీ కొడుకుల మధ్య అనురాగానికి, తండ్రీ కూతుళ్ళ మధ్య పొడసూపే ఆప్యాయతకూ లైంగిక సహజాతం సమాధాన మన్నదాకా చలం వెళ్ళాడు. అవి ఎందుకు అసహజాలు, అవాంఛనీయాలు అయ్యాయో, ప్రపంచ యావత్తూ సమాజం ఎలా నిషిద్ధమని ప్రకటించిందో చలానికి తెలియదా! ఈడిపస్ కథ నుంచి రాహుల్ సాంకృత్యాయన్ "ఓల్గానే గంగా" వరకూ ఆ సంబంధాలు ఎందుకు ప్రోత్సహించటం లేదో చెప్పాయి. ఫ్రాయిడ్ శాస్త్రీయ విశ్లేషణ చేసి ఆ భావాలు జనించటం సహజమే. కాని పరిష్కరించుకోవాలి. లేకుంటే నాగరిక సమాజం వెనకడుగు వేస్తుంది. కూతురుపైన ఆకాంక్షకు నీతో నీ పెద్ద కుమారుడు పోటీ పడతాడు. తల్లిపైన నీ ఆకాంక్షకు నీ తండ్రి ప్రధాన శత్రువుగా పరిణమిస్తాడు. క్రియా సంబంధాలుగా విడిపోవటానికి మనుష్యులకూ జంతువులకూ తేడా వుంది. జంతువులకు జ్ఞాపక శక్తి స్వల్పం. మనిషికి అనల్పం. అందుకే ప్రతీకారవాంఛ ప్రబలుతుంది. నాగరికత నాశనమవుతుంది. ఆ పరిణామ క్రమమే కొన్ని సంబంధాలను ఐచ్ఛికంగా త్యజించి ముందుకు నడిచింది. ఈవేళ గడియారం వెనక్కి త్రిప్పటం సాధ్యంకాదు. ఈడిపస్, ఎలక్ట్రా కాంప్లెక్సుల దాకా అక్కర్లేదు. "స్వకుటుంబ వివాహాలే సామాజిక ఆరోగ్యానికి అభ్యంతరకరాలని" సోషియాలజిస్టులు ఘోషిస్తున్నారు. ఇంకా తీవ్ర స్వరూపాలైన కాంప్లెక్సులకు శాస్త్రం అనుమతించే ప్రశ్నే లేదు. అన్నట్లు శాస్త్రానికి చలం కోపగించుకునే నీతితో సంబంధం లేదు? ఈ విషయంలో చలం వెక్కిరింపును ప్రదర్శించలేదు. నిజం గానే భావించాడు. 'అతి'కి పెడితే 'మితి' గానైనా చలిస్తారనే చలం సహజ ధోరణి యీ విషయంలో నిజం కాదు. మిగతా సామాజిక నీతులపై దాడిలో మాత్రమే అది వాస్తవం. అంటే వెరసి సుఖాన్వేషణ, వెక్కిరింపు, అతి అనే మూడు ప్రధాన సూత్రాలు రచనల్లో చోటు చేసుకున్నాయి. వీటి మిశ్రమం మరికొన్ని రచనల్లో ఆవహించింది. మిశ్రమం పరమవికృతంగా వికటించిన సందర్భాలు కూడా ఉన్నాయి. మతాలపైన, దేవుడిపైన, ఆధ్యాత్మిక జీవనం

పైన, స్త్రీలపైన, దళితుల పైన, నిస్సహాయులపైన అపారమైన ప్రేమ కురిపించిన చలానికి సమాజం ఎలా వుంటుందో తెలియదా. ఎలా ప్రతి స్పందిస్తోందో తెలియదా ?

"సర్లేండి....మీరే రైటేమో....చలాన్ని వదిలేయండి .... మీరు సుఖంగా వుంటే చాలుకదా" అనే వాక్యం తరచు చలం రచనల్లో కనిపిస్తుంది. దీని భావమేమిటి ?

మీరు నన్ను విమర్శించటంలో చూపించే ఉత్సాహం, ఆవేశం, మీ సౌందర్యజీవనంపై జూపించరే "కనీసం ప్రక్కింటి అమ్మాయికి ప్రేమ లేఖకూడా రాయలేని మీరు, చలం మీద ఒంటికాలితో లేస్తారేం .... నన్ను వెంటాడి, వేధించి ఆంధ్రదేశం నుండి తరిమి కొట్టారు కదా. ఇప్పుడంతా కులాసాగా జీవించండి, నాతో ప్రమేయం దేనికి....మళ్ళీ నాకు ఉత్తరాలు దేనికి, మీకు కావలసినదేమిటి. అవసరంలేని దేమిటి ?" అని సాక్షాత్తు చలమే ప్రశ్నించాడంటే చలాన్ని అపార్థం చేసుకోవలసిన అవసరం లేదు. ఒక స్త్రీతో ఒక పురుషుని సమాగమ సౌఖ్యం చలానికి ఏం ఒరగబెడుతుంది. "ఇందులో అపురూప సౌఖ్యం ఉంది. నిజమే. నీవన్నది నిజమే" అని అనాలని చలం తాపత్రయం. ఈ ఒక్క అంశంలోనే యాభై సంవత్సరాలు పరితపించి, దగ్ధమై, వెలుగై, చుక్కలా నిలిచిపోయాడు చలం. ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి ?

చలం రచనల సారాన్ని, సారాంశాన్ని వడగట్టుకోవాలి. కనీసం చలాన్ని ఊరించటానికి, ఆయన అపరాధి అని నిందించటానికి ఆయన బ్రతికి లేడు కదా. వక్రభాష్యాలు, వక్ర రచనలూ చేశాడందామా. అవి లేని మహారచయితలెవరు ఫిలర్ లేకుండా ఏ రచయితని స్వీకరిసున్నాం. పరస్పర విరుద్ధ ధోరణి కించిత్తు కూడా కన్పించని రచయిత లెందరున్నారు....?

విశ్వనాథ ఆంధ్రప్రశస్తినీ, కోకిలమ్మ పెళ్ళినీ, బద్దన్న సేనానినీ మెచ్చుకునేవారు. వేయిపడగల్లోని ఏ పడగనీ అంగీకరించరుకదా. మరో ప్రపంచ కర్త శ్రీశ్రీ రాసిన 'ఇందిరమ్మ గేయం' బహిష్కరించకుండా స్వీకరిస్తున్నారా. రష్యా స్వర్గమని ఒకసారీ, నరకమని ఒకసారీ రాస్తే ఏది స్వీకరిస్తున్నారు. కొడవటిగంటి బుద్ధి కొలత వ్యాసాలవలన ఆయన సాహి

జీక హేతువాద దర్శనానికి ఏవంత ఆక్షేపణ కలుగుతోందా? సోమ సుందర్ శ్రావణ గీతికలను, సుందర కాండలను చూసి వజ్రాయుధ గీతాలు విస్మరించబడుతున్నాయా? రంగనాయకమ్మ తానే తన రచనలను కొన్నిం టిని సవిమర్శనాత్మకంగా తిరస్కరించుకుంది కదా. ఆదిలో పిచ్చి ప్రేమ కథలు రాసిన రావిశాస్త్రి సారాసారోల ప్రపంచ దర్శనాన్ని రాయతేదా? ఆయన జాస్మిన్ కథలు యిప్పుడెవరిక్కావాలి. కాళీపట్టణం మధ్య తరగతి అభిమాన పరంపరను ఆవలపెట్టి 'యజ్ఞ' ఫలాన్ని పాఠకులు స్వీకరించ లేదా? కమ్యూనిస్టులుగా చిరకాలం రచనలు చేసిన వారు వ్యతిరేక రచ నలు చేయలేదా. నడుడో భాస్కరుడో రాసిన సత్యమూర్తి తాను పాల్గొని వచ్చిన విప్లవానికి శాపనార్థాలు పెట్టలేదా! కాలానుగత ప్రతిస్పందన ప్రధాన ధ్యేయంగా సాగే రచయిత ఏకసూత్ర నిబద్ధుడుగా, వైరుధ్యరహిత సబ ద్ధుడుగా రచనలు చేయలేడు. ఏ మంచికి దోహదం చేశాడన్న ఫిల్టర్ సూత్రీకరణ తప్ప గత్యంతరం లేదు. అన్నింటినీ చర్చించి పరస్పర విరుద్ధ రచయిత క్రింద విడనాడుతూపోతే మహారచయితలు అంతర్ధానమై ఏకసూత్ర ప్రతిపాదకులైన సాధారణ రచయితలు మాత్రమే మిగులుతారు.

చలం సారాంశం ఏమిటన్న విషయం, చర్చకన్నాఎక్కువ గొప్పది. సామాజిక సౌందర్యాన్ని అనుభవించక అయోమయ ఈర్ష్యా ద్వేషాలతో కాలం వ్యర్థం చేసి 'తెలియని ఏ తీవ్రశక్తులో నడిపిస్తే నడిచి, తామే భువి కధినాధులమనీ, మహానుభావులమనీ భ్రమించి, తారట్లాడి, గతించి కాల గర్భంలో కలిసిపోకం'డన్నది చలం నినాదం. పుట్టినందుకు జన్మను అను భవించటం జంతువులను చూసైనా నేర్చుకోండన్నది చలం వాదం. ఈ సౌందర్యం పువ్వులో వుంటుంది, పండులో వుంటుంది, వెన్నెల్లో వుంటుంది, చెట్టులో వుంటుంది, చెరువుగట్టులో వుంటుంది. అన్నింటినీ మించి అపు రూపమైన స్త్రీ పురుష శరీరాల్లో ఉంటుంది. గ్రహించండన్నది చలం మేని ఫెస్టోలో ప్రథమ పాఠం.

స్త్రీని 'ఇన్ ఏక్టివ్ పార్టనర్' చేసి పురుషుడు అన్నింటినీ అనుభ వించటం దుర్మార్గం, చారిత్రక దురంతం, దారుణోదంతం అని చలం రెండో దశ సారాంశం. ఇక్కడే చలం విశ్వరూపం చూపించాడు. బహుళ వాంఛాదగ్ధులై, నిరంతర కామక్షోభపీడితులై రహస్యంగా అడ్డదారుల్లో

కుత్సితంగా కావలసినవి అనుభవిస్తూ పైకి నీతి సూత్రాలు వల్లించే 'ఆత్మ వంచనా పరాయణత్వం' మీద చలం ప్రధాన యుద్ధభేరి. నిజమైన ఏక పత్నీవ్రతుడు భార్య పతివ్రతగా ఉండాలనుకోవటాన్ని చలం ఎక్కడా ఆక్షేపించలేదు. అపారమైన ప్రేమతో జీవితాంతం 'మోనోగమీ' గడుప గల్గిన సీతారాముల దాంపత్యం వంటి ఆదర్శాన్ని తాను ఎక్కడా తిరస్కరించలేదు. కాని మానవ చరిత్ర యావత్తూ యిందుకు విరుద్ధంగా నడుస్తున్నది. భగవంతుళ్ళకే బహుళవాంఛాతత్వం ఉన్నట్లు గాథలు కన్పించటం జరుగుతుంది. ఆధునిక సామాన్యుల గతి వర్ణించేదేముంది. అందుకే అది హేతుబద్ధంగా, ఆరోగ్యకరంగా ఆలోచించగలగాలి. ఏ మేరకు ఏ సమాజానికి సాధ్యమో ఆ మేరకు స్త్రీ పురుష ప్రణయ స్వేచ్ఛ విస్తరించాలి. నిజానికి చలం చెప్పిన దానికీ, పాశ్చాత్య ప్రపంచంలో జరుగుతున్న దానికీ తేడా అతి స్వల్పం. అక్కడ చాలా మేరకు స్త్రీకి స్వాతంత్ర్యమూ లభించింది. స్త్రీ పురుష సమానతా ప్రాతిపదికపైన ప్రణయ స్వేచ్ఛా లభించింది. కుటుంబ వ్యవస్థ ఆటుపోటులు తట్టుకుంటూ కొనసాగుతూంది. ఈ దేశంలో యీ తెలుగునాట ఏ మేరకు స్వేచ్ఛా జీవనం సాధ్యమో ఆ మేరకు ముందడుగు వెయ్యాలన్నది ఆయన తాపత్రయం. భౌతిక పరిస్థితుల భూమిక సమకూరనిదే మార్పు అసంభవం. భౌతిక వాతావరణం సిద్ధమై, మార్పు పురుటి నొప్పులు పడుతూవున్నప్పుడు మాత్రమే రచయితలూ, సంస్కర్తలూ, తత్వవేత్తలూ మంత్రసానితనం వహించగలరు. శిశోదయానికి రవంత సాయం చేయగలరు. ఆ సాయం చలం రచనలనుండి స్వీకరించి జ్ఞానోదయానికి ప్రగతి శీలురుద్యుక్తులు కావటం మానవతావాదుల కర్తవ్యం. మానవజీవనం ఇంతకన్నా సౌఖ్యవంతం కావాలన్న ప్రతిపాదనలో చలం రచనలు అంతర్భాగం. ఎలా, ఏ మేరకు, ఏ దిశగా అన్నది మన అవగాహన!

# తిరుగుబాటు నుండి మార్మిక వాదానికి

శ్రీ ఏటుకూరు బలరామమూర్తి

చలం చనిపోయి మూడువారాలౌతున్నది. 25 సంవత్సరాలుగా ఆయనను మరచిపోయిన ఆంధ్రదేశం ఒక్కసారిగా అశ్రుతర్పణ కావించింది.

ఆంధ్రదేశం ఆయనను మరచిపోయింది అనటం కంటే, ఆయనే ఆంధ్రదేశాన్ని మరచిపోయాడనటం సబబు.

1952 ప్రాంతంలో, మిత్రులు, సహచరులు, తోటి రచయితలు ఎంత వారించినా వినకుండా, ఆయన బెజవాడ విడిచి, పిల్లా జెల్లా, పెట్టి బేడాతో రమణాశ్రమం చేరుకున్నాడు. చలం అరుణాచలం ఐనాడు. రచనలు చేస్తూనే వున్నాడు. బైబిలు, భగవద్గీత, రమణాశ్రమ లేఖలు ఇంకా ఎన్నో వస్తూనే వున్నాయి. ఐనా ఈ చలం వేరు, ఆంధ్రదేశంలో పుట్టి, పెరిగి, బాధలుపడి స్త్రీ సమస్య లోతుపాతులులోకి అసాంతం వెళ్ళి ఆ వ్యధలన్నింటినీ కథలుగా చిత్రించిన చలం వేరు.

మొదటి చలం 1952 లోనో, అంతకు ముందో చనిపోయాడు. రెండవ చలం ఇప్పుడు చనిపోయాడు.

ఇద్దరు చలంలకు ఇంత వ్యత్యాసమున్నదా! ఒకే మనిషి, రచయిత, తాత్వికుడు, ఇంతగా మారిపోగలడా !

నేను మారిపోలేదు. ఉన్నత పరిధిలోకి వెళ్ళాను అంటాడు చలం. తొలగడ రాసిన వాటికి విచారపడటం లేదు అనికూడా అంటాడు.

ఏ వ్యక్తి, ఎంతవాడైనా, తనను గూర్చి తాను వేసుకునే అంచనా

అంతిమ నిర్ణయం కాజాలదు. చలం మారిందీ లేందీ చెప్పవలసింది తెలుగు పాఠకులు.

నీతి అనేది స్త్రీ పురుషులిద్దరికి సంబంధించినది. అవినీతి ఐనా ఇద్దరికీ సమానమే. కాగా ఒకే నేరానికి పురుషుని క్షమించటమూ, స్త్రీని శిక్షించటమూనా ? ఈ ద్వంద్వ ప్రమాణాల దురన్యాయంపై కత్తిగట్టి స్త్రీ స్వేచ్ఛా నినాదం ఇచ్చిన వాడు మొదటి చలం.

స్వేచ్ఛ సామాజికమా, మానసికమా అనే ప్రశ్న వేసుకుని, పదేండ్ల పాటు మథనపడి, స్వేచ్ఛ కేవలం మానసికావస్థ. ఎవరికి వారు అన్వేషించి సాధించుకోవలసిండి. సంఘం మారదు. ఎవరి సుఖం, స్వేచ్ఛ, ఆనందం కొరకు వారు పాటుపడాలి, అనే నిర్ణయాని కొచ్చినది రెండో చలం.

ఇదేమీ చిన్న పరిణామం కాదు.

ఈ పరిణామానికి బీజాలు మొదటి నుంచీ ఆయనలో లేవా అంటే వున్నాయి.

## తొలి బీజాలు

1925లో రాసి 1930లో ప్రచురించిన 'స్త్రీ'లో మొదటి చలం కనిపిస్తాడు. ఈ వ్యాస సంపుటి 40, 45, 52, 56 సంవత్సరాలదాకా పునర్ముద్రణ మౌతూనే వుంది. ఆయన రచనలన్నింటిలోకి విస్తృత ప్రచారం పొందింది.

1894లో ఒక తెలుగు బ్రాహ్మణ కుటుంబంలో చలం జన్మించారు. ఛాందస సనాతన ఆచార శృంఖలాలలో స్త్రీలు ఎలా బాధ పడుతున్నారో, కన్నీరు గారుస్తున్నారో, ఆత్మహత్యలకు, భ్రూణ హత్యలకు పాల్పడుతున్నారో స్వయంగా చూశాడు. తన ఇద్దరు చెల్లెళ్ళకు, తండ్రి బలవంతంగా పెండ్లి చేయించాడు. ఒక్క చెల్లెలకు మాత్రం చలం బలవంతపు పెళ్ళి తప్పించగలిగాడు. తన పినతల్లిని, పినతండ్రి గొడ్డును బాదినట్లు, తెల్లవాళ్లూ బాదటం స్వయంగా చూశాడు.

కాకినాడ చదువుతో బ్రహ్మసమాజం వైపు మొగ్గాడు. కులం, మతం విసర్జించాడు. అంతటితో ఆగలేదు. "కులానికి కాలదోషం పట్టిందని బ్రహ్మ సమాజం అంటుంది. వివాహ వ్యవస్థకు కూడా కాలదోషం పట్టిందని నేనంటాను".

ఈ కొత్త అన్వేషణతో చలం రచనా రంగంలో కాలు పెట్టాడు. అసంఖ్యాకంగా కథలు, నవలలు, నాటకాలు వెలువరించాడు. బ్రాహ్మణీకం, మైదానం, అమీనా, అరుణ, చిత్రాంగి, భానుమతి ఇంకా ఎన్నో—

ట్రైనింగ్ స్కూలు టీచరుగా, హెడ్మాస్టరుగా, మనస్తత్వ శాస్త్రం అధ్యయనం చేశాడు. సమకాలీన, పాశ్చాత్యధోరణులతో ప్రభావితుడైనాడు.

కేవలం చెప్పడమేగాక, చెప్పింది చేయటమనే చిత్తశుద్ధి చలం ప్రత్యేకత. కులంలో వెలిపడ్డాడు. అనంతపురం, నెల్లూరు, ఏలూరు, బందరు, బెజవాడ, భీమిలి, కరీంనగర్ ఇలా ఆంధ్రప్రదేశ్‌లో పలుచోట్ల ట్రైనింగ్ స్కూలు టీచరుగా పనిచేశారు. ప్రతిచోటా ఊరిబైట ఏ పాడు బడ్డ ఇంట్లోనో, క్రిష్టియన్ లేక ముస్లిం పేటలలోనో కాపురం, బ్రాహ్మణ పేటలలో ప్రవేశం దొరికేదికాదు. ఉద్దేశ పూర్వకంగా మాంస భక్షణ అల వరచుకున్నాడు. భార్య రంగనాయకమ్మ, కుటుంబ సభ్యులందరు వేషంలో, భాషలో, తిండిలో, ఆచారాలలో ఏ కులస్తులు, ఏ మతస్తులూ అని తెలుసుకోలేని విధంగా జీవించారు.

1920 - 30 నాటి తెలుగు దేశంలో ఇదేమంత చిన్న విషయం కాదు. ఎంతో సాహసంతో కూడిన తిరుగుబాటు, పిల్లల పేర్లూ అంతే. పెద్ద కుమారుడు రవి, మిగతా వారిపేర్లు షౌ.చౌ. సంత్, తన వారసత్వ ప్రత్యే కతను ఉద్దేశపూర్వకంగా భస్మం చేసుకునే కృషి ఇది.

## ద్వంద్వ ప్రమాణాలపై దాడి

"స్త్రీ" ద్వారా వ్యక్తమయ్యే చలం భావాలు ఎలాంటివి ?

"స్త్రీ పురుషులిద్దరూ ఒకే పనిచేస్తే, చెడిపోయే వారొకరు, చెరిపే వారొకరు.

దుర్నీతికి స్వేచ్ఛ ఉన్నప్పుడే స్వేచ్ఛకి సోపానం.

ఈశ్వరుడైనా సరే ఆజ్ఞాపించరాదు చేతనైతే నచ్చచెప్పాలి.

పురుషునికి పెక్కుమంది స్త్రీలు. స్త్రీకి పెక్కుమంది పురుషులు ఎందుకుండరాదు ?

సంఘానికి పురుషుడు బానిస. అ బానిసకు స్త్రీ బానిస. స్త్రీకి మన దేశంలోనే కాదు ఏ దేశంలోనూ స్వేచ్ఛ లేదు...

కమ్యూనిజం వంటి విప్లవం వస్తేగాని స్త్రీ సమానత్వం ఏర్పడదు. కామాన్ని ఎందుకు అణచుకోవాలి? ఏకపత్నీవ్రతం ఆదర్శమే కాని నీతికాదు.

ముందు ఈ వివాహ వ్యవస్థ బద్ధలుకావాలి. ఐచ్ఛికంగా మానోగమీ అప్పుడు ఏర్పడుతుంది.

మనిషికి మనిషికి తేడావుంది. ఎవరినీతి వారిది. అందరికి ఒకేనీతి కుదరదు.

సంయోగంలో యోగం వుంది. కళలన్నిటిలోకి ఉన్నతం రతికళ. అదే ఆధ్యాత్మికానందం. తిని ఆనందంతో అనుభవించాలి. ఏదో కాల కృత్యం తీర్చుకోడం కాదు. సృష్టి కార్యం మహా ఉత్కృష్టమైంది. స్త్రీ పురుషునిపై తిరగబడాలి- ధైర్యం వుంటే లేచిపోవాలి."

## స్వేచ్ఛా ప్రేమ

స్వేచ్ఛా ప్రేమ సిద్ధాంతంలో మొదటి నుండి కొన్ని సుడిగుండా లున్నాయి.

ప్రేమలేని కామం కేవలం శారీరకం. వేలాది సంవత్సరాలుగా పెనవేసుకున్న సామాజిక భావాలు కుటుంబ వ్యవస్థలో పొరలు పొరలుగా పెనవేసుకుని ఉన్నాయి. అన్నా, చెల్లెలు, తల్లి, కొడుకు, తండ్రి, కూతురు ఈ బంధనాలలో దీర్ఘ సామాజిక పరిణామజనిత సహజాతాలున్నాయి. భౌతికసహజాతాలు ఎంతబలవత్తరమో ఇవి అంత బలవత్తరమైనవి. ఈ సహజాతాలను బద్దలు చేయలేము. చేయకూడదు. చేస్తే, ఆదిమ గుహావాసుల స్థితికి వెళతాము. హిప్పీలు, రజనీష్‌లాంటి కుహనా యోగులు ఆ పని చేస్తున్నారు. పూర్వకాలంలో శాక్తేయులు, వజ్రయాన శాఖవారు యిదేపని చేశారు.

చలం ఊహించాడో లేదో కాని ఆయన ఆలోచనలోని అంతిమస్థాయి అక్కడకే చేరుకుంటుంది.

వివాహ వ్యవస్థను సామాజికంగా, పరిణామాత్మకంగా చూడలేక పోవడం-చలం బలహీనత కాగా నేటి ఫ్యూడల్ వివాహ వ్యవస్థను బద్దలు

చేయటానికి ఆయన చేసిన కృషి ప్రాధాన్యతను తక్కువ అంచనా వేయ లేము.

రచయిత సమస్యకు పరిష్కారం చెప్పలేడు. సమస్య తీవ్రతను, అందులోని అమానుషత్వాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రిస్తాడు. అట్టి చిత్రణలో చలం అద్భుత ప్రతిభ సాధించాడు. కృతకృత్యుడయ్యాడు. ఆయన ప్రతి ఆలోచన ఒక పరిష్కారంగా భావించినవారు మాత్రం విషాద పరిణామా లకు లోనైనారు.

రచయితల పరిమితులు తెలుసుకోకుండా వారిని ప్రవక్తలుగా ఆరా ధించే గుడ్డి మనస్తత్వం ఇందుకు కారణం. పాఠకులలోని భ్రమలు, రచయితల అహంకారం ఇందుకు కారణం. చలం విషయంలోనే కాదు, అందరి రచయితల విషయంలోనూ, అన్ని దేశాలలోనూ, కాలాలలోనూ ఇదే జరుగుతున్నది.

చలం రచనలలో "స్త్రీ" లో సైతం అనేక వైరుధ్యాలున్నాయి.

## విశృంఖలత

పురుషుడు స్వేచ్ఛగా విశృంఖలంగా జీవిస్తున్నాడు. స్త్రీకి కూడా ఆ అవకాశం ఇవ్వాలి. భార్య నా ఆస్తి, స్వంతం అని భర్త భావించరాదు.

స్వేచ్ఛా ప్రేమలో జెలసీ లేదనుకోవటమే పెద్ద పొరపాటు. అసలు ఉన్నదే అక్కడ. ప్రపంచంలో స్త్రీ - పురుషుల మధ్య హింస, దౌర్జన్యం, హత్యలకు ఈ జెలసీయే కారణం. మానవ సంబంధాలను కూడా ఆ స్థాయికి దిగజార్చే ఆదర్శం స్వేచ్ఛా ప్రేమ. విశృంఖల ప్రేమ, విశృంఖల దౌర్జన్యం ఈనాడు కొన్ని పాశ్చాత్య దేశాలలో చెట్టాపట్టాలుగా సాగుతుండ టానికి కారణం అదే.

ఒకరి పట్ల ఒకరికి విశ్వాసం, విధేయత ప్రేమకు మూలం. ఏ క్షణానికే బుద్ధిపుడితే అలా వ్యవహరించటం కామానికి మూలం. ప్రేమకు, కామానికి ఎంతో తేడా వుందని చలం చర్చించాడేకాని, మౌలికమైన ఈ వ్యత్యాసాన్ని ప్రస్తావించలేదు. చలం భావాలలోనే ఒక వైరుధ్యం ఉంది.

పురుషుడు స్త్రీని దోపిడీ చేస్తున్నాడు. పురుషుని స్త్రీ ద్వేషించాలి, తిరగబడాలి- ఇది ఒక ఆలోచన.

Sex అత్యున్నతమైన బ్రహ్మానందం. దానిని అనుభవించడం గొప్ప కళ. జీవితపరమార్థం.

పురుషుని ద్వేషించే స్త్రీ Sex ను ఎలా అనుభవించగలదు ?

## ఫెమినిస్టు ఉద్యమ ఛాయలు

ఈ రోజులలో అమెరికా తదితర పాశ్చాత్య దేశాల్లో చెలరేగుతున్న Women's lib movement కు ఇవే చోదక శక్తులు. ఈ feminist ఉద్యమానికి ఆద్యుడు మన దేశంలో చలం.

ఈ వైరుధ్యం, చలం కుటుంబాన్ని కల్లోలపరచింది.

చలం సిద్ధాంతాలను పరమ సత్యాలుగా భావించిన సౌరీస్, చలం పెద్ద కూతురు.

ఆమెకు పెండ్లి ప్రయత్నం తండ్రి చేయలేదు. తల్లి విశ్వప్రయత్నాలు చేసినా ఫలించలేదు. పురుషుడు అంటేనే దుష్టుడు. వివాహం అంటేనే లొంగుబాటు, Surrender అనే భావాలు నరనరాల జీర్ణించిన సౌరీస్ వివాహం ఎలా చేసుకుంటుంది. అన్నిటినీ త్రోసిపుచ్చింది.

ఇక Sex అనుభవం ఏది ? Sex ను అణచుకోరాదు అని ప్రపంచానికి బోధించిన చలం తన కుమార్తెను అదే దుస్థితిలోకి నెట్టాడు. ఈ మానసిక సంఘరణ ఫలితంగా శాశ్విత తలనొప్పి Neurosis హిస్టీరియా Autosuggestion, Hallucination లాంటి మానసిక వ్యాధులకు గురై చివరకు రమణ మహర్షి శిష్యురాలైంది. తానే ఈశ్వరుడ్ని. భగవాన్ తన ద్వారా మాట్లాడుతున్నాడు అనే పూనకంలోకి దిగింది.

చలం కుటుంబ జీవితంలో ఇదొకగొప్ప tragedy.

## వ్యక్తిగా చలం

రచయిత వ్యక్తిగత జీవితాలను ప్రస్తావించడం ఉచితం కాదు. కాని వ్యక్తిగత జీవితంపై రచయిత ఆలోచనా ధోరణి తీవ్ర ప్రభావాన్ని కలిగించిన సందర్భంలో ప్రస్తావించక తప్పదు.

సౌరీస్ ప్రభావమే చలాన్ని రమణాశ్రమానికి చేర్చింది.

చలం భార్యకు ఇవేవీ నచ్చవు. ఆమె మతిస్థిమితం కోల్పోయింది. రమణాశ్రమం చేరింది. అక్కడే చనిపోయింది.

చలం రెండో కూతురు చౌ చిన్మయానంద శిష్యురాలయింది.

పెద్దకొడుకు రవి చిన్నప్పుడే గుండె జబ్బుతో చనిపోయాడు.

రెండో కొడుకు సంత్, చదువులేక, త్రాగుబోతై, ఆత్మహత్యకు పాల్పడి, చివరకు ఇల్లు వదలి శాశ్వతంగా వెళ్ళిపోయాడు. వదినగారు రంగనాయకమ్మ చలం కుటుంబాన్ని తన కుటుంబంగా ఆదుకున్న అపర్వ మహిళ. 1950లో తీవ్రమైన వ్యాధితో మరణించారు.

ఆమె మరణించటంతో చలం కుటుంబం ఆంధ్ర దేశం వదలి వెళ్ళి పోయింది.

సౌరీస్ జీవితం చదువుతుంటే జిల్లెళ్ళమూడి అమ్మ, ముమ్మడివరం బాలయోగి, ఇతర బాబాల జీవితం జ్ఞప్తికి వస్తుంది.

ఇలాంటి వారందరినీ తన రచనలో విమర్శించి, హేళన చేసి, Sex suppression ఈ వైపరీత్యాలకు కారణమని సూత్రీకరించిన చలం ఆ ప్రభావానికే లోనై భగవాన్ భక్తుడైనాడు.

మూఢనమ్మకాలను, మతాలను దుమ్మెత్తి పోసినవాడు మొదటి చలం. అష్టగ్రహ కూటమి, అరిష్టానికి సూచకమని ఆర్తనాదం చేసినవాడు రెండో చలం.

## చలం భావాలు

అన్ని దేశాలలోనూ స్త్రీ బానిసగానే ఉంది - అనే చలం మాటలు చూస్తే 'Man is born free but every where he is in chains, అనే రూసో వాక్యాలు స్ఫురిస్తాయి. ఒకటే తేడా. రూసో స్త్రీ పురుషులిదరిని దృష్టిలో పెట్టుకుని ఆ మాట అన్నారు. చలం స్త్రీని వేరుచేసి, పురుషునితో శాశ్వత వైరుధ్యాన్ని ఊహించుకున్నారు.

స్త్రీ సమస్య కమ్యూనిజంలో పరిష్కార మౌతుందనే భావం, "స్త్రీ" గ్రంథంలో మూడు నాలుగుచోట్ల కనిపిస్తుంది. ఒక చోట యిలా అంటాడు :

"మనుషులకు యీ లోకంలో మిగిలిన ఒక దూరపు కల కమ్యూనిజం".

స్వేచ్ఛ సామాజికం కాదు, వైయక్తికం. భౌతికం కాదు, మానసికం అనే మరోభావం - నీడలాగా చలాన్ని మొదటినుంచీ వెంటాడుతున్నాయి.

ఈ నీడ పెరిగిన కొద్దీ చలం ఆలోచనలో మార్పు రాసాగింది.

భవిష్యత్తుమీద ఆశ పోయింది. తాత్త్వికబలహీనతలతో పాటు, కుటుంబ జీవితంలోని విషాద ఘటనలు కూడా ఇందుకు కారణం. చలానికి పిల్లల మీద చాలా ప్రేమ. పిల్లలకు అరిష్టం కలుగుతుంది అని ఎవరో అంటే భయపడి, తనకు నమ్మకం లేకపోయినా దక్షిణ దేశయాత్ర చేసి, దేవాలయాలలో పూజలు చేయించాడు. జాతకాల పిచ్చి మొదటినుంచీ ఉంది.

తాను నిరీశ్వరవాదిని అని చాలాచోట్ల చలం చెప్పుకున్నాడు. లోతుగా పరిశీలిస్తే చలాన్ని ఆజ్ఞేయవాది Agnostie అస్తిత్వవాది Existentia-list అని చెప్పవలసి ఉంటుంది.

మనం ఎందుకు పుట్టామో పుట్టాము. ఎక్కడికిపోతామో తెలియదు. ఉన్న జీవితాన్ని అనుభవించడం మన విధి. త్యాగం, దేశ సేవలాంటి మాటలకు అర్థం లేదు.

జీవితంలో ద్వంద్వాల ఘర్షణ కీలకం.

సంఘం - వ్యక్తి

స్త్రీ – పురుషుడు

వ్యక్తి - మరోవ్యక్తి

ఘర్షణలో బలవంతుడిది పైచేయి అవుతుంది. అనివార్యం.

స్వేచ్ఛ కేవలం మానసికం. తుపానులో నుంచి శాంతికి పయనించాలి. మానసిక శాంతి ఎలా లభిస్తుంది.

ఈ ఘర్షణలోనే శాంతి వెతుక్కోవాలి. పాశ్చాత్య దేశాలలోని అస్తిత్వవాదులపై, నాస్తికవాద ప్రభావం హెచ్చు. కనుక వారు శాంతి కోసమై బాబాలను ఆశ్రయించలేదు. తాజాగా అమెరికాలో అలాంటి పరిణామం ప్రారంభమైనట్లు వింటున్నాం.

చలం మొదట్లో నాస్తికవాదం వైపు మొగ్గిన అస్తిత్వవాది. రెండో దశలో ఆస్తికవాదం వైపు మొగ్గిన అస్తిత్వవాది. శ్రీ వేగుంట మోహన ప్రసాద్‌గారి ఈ సూత్రీకరణ నిజమేననిపిస్తుంది.

రెండోదశ చలాన్ని తెలుసుకోవాలంటే 'మ్యూజింగ్స్' చూడాలి. చలం భావపరిణామం స్పష్టంగా కనిపిస్తుంది.

స్త్రీ సమానత్వం కొరకు గొంతెత్తిన చలం 'స్త్రీ' రచనలో కనిపిస్తాడు. సమానత్వాన్ని గాలికి వదలి, సెక్స్ సర్వస్వమనే భ్రమకు లోనైన చలం మ్యూజింగ్స్‌లో కనిపిస్తాడు. పాము మైకంలో తనగుడ్డును తానే తిన్నట్లు రెండవచలం, మొదటి చలాన్ని కబళించాడు.

మ్యూజింగ్స్‌లోని ఈ క్రింది ఉల్లేఖనలు చూద్దాం.

ప్రజా బాహుళ్యాన్ని వివేకంలో ఉంచటం ఇన్ని యుగాలలో ఎవరికీ చేతకాలేదు. భవిష్యత్తులో కమ్యూనిజంలో అది జరుగుతుందంటే అది ఎంత వాంఛనీయమైనా సందేహం కలుగుతున్నది.

కమ్యూనిజం వస్తే బాగుపడుతుంది అనుకున్నాను. ఆ నమ్మకం పోయింది. కమ్యూనిజంలో వ్యక్తి స్వేచ్ఛ లేదు. కమ్యూనిజం ఒక కొత్త మూఢత్వం. కమ్యూనిజంలో శ్రమకు విలువ వుంది. అనుభవానికి లేదు.

* * *

మ్యూజింగ్స్ రచన 1930-49లో సాగింది. ఈ రచనలో సైతం మొదట్లో కంటె చివర్లో మార్పు మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

భవిష్యత్తుపై ఆశ పోయిన తర్వాత ఇక మిగిలేదేముంది?

* * *

## వ్యక్తివాదం

సుఖాన్ని వదులుకోమని వేదాంతులు, గాంధీ, కమ్యూనిస్టులు చెబుతారు. Sex అన్నిటికీ ప్రోద్బలం. Sex వాంఛ తీరని వారే, రాజకీయ నాయకులు, మత ప్రవక్తలు అవుతారు.

"శక్తి అంతా స్త్రీ శక్తి. దానిని అధిగమించేది ఏదైనా ఉంటే అది దివ్యశక్తి. దివ్యశక్తి నెరుగని నేను స్త్రీ శక్తిని ఆరాధించాను".

"స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చింది. సెక్సు స్వాతంత్ర్యం రాలేదు. కళను అనుభవించగల అర్హత కొందరికే ఉంది. పోయిన యుద్ధంతోనే రీజన్ (హేతువాదం) ఆధిపత్యం ముగిసింది. చీల్చడంలో నుంచే వెలుగు వస్తుంది. ఉపనిషత్కారులు ఆత్మను చీల్చి అంతరార్థం వెతికారు. నేను సెక్సుని చీల్చి శోధిస్తున్నాను".

"నేను, నా అనుభవం తప్ప మిగిలేది ఏది లేదు."

* * *

స్త్రీ స్వాతంత్రం కొరకు ఇంతగా తపన పడిన చలం, భూస్వాములపై రైతులు, పెట్టుబడిదారులపై కార్మికులు, ధనికులపై పేదలు చేసే తిరుగుబాట్లను ఏమాత్రం సానుభూతితో చూడలేదు. ఇద్దరూ స్వార్థపరులే నంటాడు, ఇది చాలా తీవ్రమైన బలహీనత.

సమానత్వాన్ని స్త్రీకి మాత్రమే పరిమితం చేశారు. Sex సర్వస్వమనే మాయాజాలంలో పడ్డాడు. సమానత్వం గాలికెగిరి పోయింది.

## రమణాశ్రమం

1940లోనే ఒకసారి చలాన్ని రమణాశ్రమానికి తీసుకెళ్ళారు దీక్షితులుగారు. కాని తిరిగి వచ్చారు. భగవాన్ ఛాయలు పడ్డాయి గాని, తిరిగి మామూలు చలం ఐనాడు.

1945 ప్రాంతంలో ఉద్యోగం నుండి రిటైరైన తర్వాత ఒక ఘటన జరిగింది. భార్య మనస్తిమితంలేక వెళ్ళిపోయింది. చలం స్త్రీ ఆరాధకులలో ఒకరు చలాన్ని ఆకర్షించి తనతో తీసుకెళ్ళారు. పెత్తల్లి డాక్టరు రంగనాయకమ్మగారు సుస్తీగా ఉన్నారు. ఒక రోజున పిల్లలంతా కలిసి ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకున్నారు.

ఈ ఘటన చదువుతుంటే పాఠకుడు చలిసాడు. డాక్టరు రంగనాయకమ్మగారు అప్పటికి ఇంకా బతికి ఉండబట్టి ఆ ప్రమాదం తప్పింది.

కొద్ది రోజులకు డాక్టర్ రంగనాయకమ్మగారు చనిపోయారు. పిల్లలు వీధినబడే స్థితి వచ్చింది. చలంలో చలనం వచ్చింది. అంతా కలిసి రమణాశ్రమం చేరారు.

ఒకసారి చలం రెండవ కుమారుడు ఏ ఏండ్లవాడు, తీరికగా కూచుని చీమలను చంపుతున్నాడు. "అదేమిటండీ చూస్తూ కూచుంటారేమిటి నివారించక" అని ప్రక్కన ఉన్న మిత్రుడు అడిగాడు. చలం సమాధానం "అతని స్వేచ్ఛకు ఆటంకం ఎందుకు" ఆ కుర్రవాడే పెద్దవాడై తాగుబోతై శాశ్వతంగా అదృశ్యమయ్యాడు.

చలం సిద్ధాంతాల దుష్ప్రభావం అందరికంటె ఎక్కువగా ఆయన కుటుంబం, పిల్లలు అనుభవించారు. ఆయన కూడా అనుభవించాడు. తిరుగుబాటుదారుడు, విప్లవకారుడుగా మారక, మార్మికయోగిగా మారటంకంటే పతనం ఏమిటి?

చలం శిష్యులు ఈ మాట అంగీకరించకపోవచ్చు. కాని పాఠకులు ఈ నిర్ణయానికి రాక తప్పదు.

## రచయితగా

తాత్వికంగా ఎంత చెప్పినా, రచయితగా చలం స్థానం చాలా గొప్పది, శాశ్వతమైనది, ప్రతిభావంతమైనది.

చలం ప్రధానంగా రచయిత. మొదటినుండి చివరివరకూ అంతే. తాత్విక విశ్లేషణ పాఠకుల అవగాహన కొరకేగాని రచనా గౌరవాన్ని తగ్గించడానికి కాదు.

రచయితలలో రెండు రకాల వారున్నారు. తమ లక్ష్యమేదో నిర్ణయించుకుని, అందుకు స్థిరంగా కట్టుబడి ఉండేవారు ఒకరకం. వీరేశలింగం, గురజాడ, తదితరులు ఈ శాఖవారు.

మరొక శాఖుంది జీవితంలో ఏదో ఒక అంశం శక్తివంతంగా కదిలించటంతో వారు రచన ప్రారంభిసారు. పోను పోను భావాలతో మార్పు వస్తుంది. రచనలు, భావాలు పరస్పరం పెనవేసుకుపోతూ ఉంటాయి. చలం ఈ కోవకు చెందినవారు. భావావేశం, చిత్తశుద్ధి రచయితకు ప్రాణప్రదం. ఈ రెండూ పుష్కలంగా చలంలో ఉన్నాయి. ఈ రెంటితోపాటు అద్భుతమైన శైలి వుంది.

రచయిత తన మనస్సులోని Conscious, semi-Conscious, sub-conscious పొరల్లో అడుగునబడ్డ భావాలను పైకి తెచ్చి తన

ముందు నిలుపుకుంటాడు. వాటితో కొంత చర్చచేసి, పెట్టె మూసి వేస్తాడు. మరొక పెట్టె తెరుస్తాడు. మానసిక సముద్ర మధనం లాంటిది. ఈ రచనారూప నిర్వహణకు ఎంతో చిత్తశుద్ధి, ఆత్మావలోకనం, నిర్భీకతా అవసరం. చలంలో యివన్నీ ఉన్నాయి. ఇందులోని భావాలు మనకు నచ్చవచ్చు. నచ్చకపోవచ్చు. కాని ఈ రూపంలో, తన భావజాలాన్నంతా పాఠకుని ముందు విప్పిచెప్పిన రచయిత చిత్తశుద్ధి, నిజాయితీని శ్లాఘించకుండా ఉండలేము.

వ్యక్తి బౌద్ధిక జీవితాన్ని వీటన్నిభాగాల క్రింద విభజించి, వాటిని విడిగాను పరస్పరాశ్రయంగాను పరిశీలించటం పరిసరాల ప్రభావం వల్ల ఈ మొత్తం ఎలా పరిణామం చెందుతున్నదీ అధ్యయనం చేయటం సమగ్ర పరిశీలన, Horizontalగానూ, Verticalగానూ, Dialectical గానూ, Historical గాను పరిశీలించినపుడే, Integrated out look ఔతుంది.

మపాసా, మాం, హక్స్లీ రచనల పోలికలు చలంలో చాలా కనిపిస్తాయి. వారుకూడా చివరకిలా మార్మికులైనారేమో తెలియదు. హక్స్లీలో ఆ మార్పు వచ్చిందని తెలిసిన వారు చెబుతున్నారు.

## స్వేచ్ఛా ప్రేమ పర్యవసానం

చలం ఊహించిన స్వేచ్ఛా ప్రేమ వివాహ వ్యవస్థ విచ్ఛిత్తి నేడు ప్రపంచంలో ఎక్కడైనా ఉందా ? హాలండ్, డెన్మార్క్, బెల్జియంలోనూ కొంతవరకు పశ్చిమ జర్మనీలోనూ, వివాహం అనేది లేకుండా జీవించే స్త్రీ పురుషులు గణనీయంగా ఉన్నట్లు చెబుతారు. అమెరికాలోను ఈ ధోరణి పెరుగుతున్నది.

స్వేచ్ఛ అంటే అన్ని బంధనాలను ధ్వంసం చేసుకోవటం కాదు. పాత బంధనాలు తొలగించుకొని నూతనమైన బాధ్యతలను స్వీకరించటం. ఇచ్ఛికంగా స్వీకరించే బాధ్యతలు వేరు, బలవంతంగా విధించబడే బంధనాలు వేరు. బాధ్యతలను స్వీకరించటమే బంధనాలుగా భావిస్తే అరాచకత్వంతో అంతంకాక తప్పదు.

చలం కూడా ఈ భావాన్ని మొదట్లో పేర్కొన్నాడు. కాని

విధ్వంసన మీద చేసిన కేంద్రీకరణతో పోను పోను ఈ రెంటికీ మధ్య శాశ్వత అగాధం ఏర్పడ్డది.

ఇందులో ఫ్యూడల్ వ్యతిరేక భావాలూ ఉన్నాయి. అరాచక, విశృంఖల ధోరణులూ ఉన్నాయి.

సమాజంలోని అందరినీ ఒకే నైతిక చట్టంలో బిగించలేము. ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క నీతి ఉంటుంది. ఆ సంబంధాలు కుటుంబంలోని ఇతర సభ్యులకు సమాజానికి హానికలిగించనంతవరకూ ఇతరులు అందులో వేలు పెట్టరాదు. వివాహానికి ముందు యువకుల గతాన్ని తెలకము. బాలికల గతాన్ని తెలుకుతూనే వుంటాము. ఇది ద్వంద్వ నీతికి చిహ్నం.

తప్పో? ఒప్పో? స్త్రీ పురుషుల కిద్దరికీ ఒకే నైతిక ప్రమాణాన్ని వర్తింప చేయండి అని ఎలుగెత్తి చాటడం చలం ప్రత్యేకత. ఈ మేరకు చలం సాహిత్యం తెలుగు సాహితీ జీవితంలో ఆరోగ్యకర అంశాన్ని ప్రవేశ పెట్టింది. సాంస్కృతిక పరివర్తనకు తోడ్పడ్డది. ఇంకా తోడ్పడుతూనే వుంది.

కాగా శృంగారమే సర్వస్వం, అదే బ్రహ్మానందం అనే ఆవేశానికి లోనై చేసిన రచనలు, వివాహ వ్యవస్థ ధ్వంసం కావాలనే రచనలు విశృంఖలతకు తోవతీసి, క్షీణ సంస్కృతికి బీజాలు వేశాయి.

చలం రచనలలో ఈ రెండు లక్షణాలు ఉన్నాయి. ఆయా సందర్భాలను బట్టి నిష్పత్తి మారుతూ వచ్చింది.

# చలం - స్త్రీవాద సాహిత్యం

డా॥ పి. సంజీవమ్మ

ఈ సంవత్సరం చలం శతజయంతి సంవత్సరం. ఆధునికాంధ్ర సాహిత్యంలో చరిత్రను సృష్టించిన యుగ పురుషుడు చలం. అందుకే స్త్రీల పక్షంలో భావదాసమాజం మీద తిరుగుబాటు చేసిన కలం వీరుడు చలం. ఆయన సాహితీ సృజన సర్వస్వం స్త్రీ విముక్తి కోసమే. అందువల్లనే చలం సాహిత్యాన్ని స్త్రీవాద దృక్పథంతో పరిశీలన చేయవలసిన అవసరం వుంది.

అయితే 'స్త్రీవాదం'. 'స్త్రీవాద సాహిత్యం' అనేవి ఇటీవల నాలుగైదు సంవత్సరాల నుండి ప్రముఖంగా ముందుకొచ్చాయి. స్త్రీల సమస్యల మీద, స్త్రీ విముక్తికోసమూ సాహిత్యం చలం కంటె ముందు నుండే తెలుగు భాషలో వుంది. గురజాడ అప్పారావు, కందుకూరి వీరేశలింగం పంతులు అలాంటి సాహితీ సృజనకు ఆద్యులు. అయితే చలం ధోరణివేరు. స్త్రీల విముక్తి కోసమే కలం పట్టిన రచయితగా చలానికి ఖ్యాతి ఉంది. ఆ తర్వాత 'స్త్రీ విముక్తి' ప్రధాన విషయంగా సాహితీ సృజన కావించినవారు మార్క్సిస్టు రచయిత కొడవటిగంటి కుటుంబరావుగారు.

చలం సాహిత్యానికి నేటి స్త్రీవాద సాహిత్యానికి వున్న సంబంధం ఏమిటో పరిశీలించాలి. ఈనాడు తొంభయ్యవ దశకంలో ఆంధ్ర సాహిత్యంలో ప్రబలిన ప్రధాన ధోరణి స్త్రీవాద ధోరణి. దీని గురించి ముందుగా కొంత తెలుసుకుందాం.

సమాజ పరిణామ క్రమంలో వర్గ వ్యవస్థలు నెలకొన్నాయి. రాచరిక వ్యవస్థలో, ఆ సంస్కృతిలో పురుషాధిక్య భావన పాతుకుంది. అది రాను రాను పురుష దురహంకారాన్ని పెంచింది. దాంతో వివాహ వ్యవస్థ స్త్రీ పురుష సంబంధాలు వికృత రూపం ధరించాయి. కుటుంబం అంటే పురుషాధికారమే. స్త్రీ అంటే పిల్లల్ని కనే యంత్రంగా, వంటయింటి కుందేలుగా, ఇంటి దాసీగా ముద్రపడింది.

రాచరిక వ్యవస్థ కూలిపోయి, పెట్టుబడిదారీ వ్యవస్థ ఆవిర్భావంతో ఆధునిక భావాలు, నూతన సంస్కృతీ చోటుచేసుకోవటం ప్రారంభం అయింది.

అందులో భాగంగానే ప్రపంచ దేశాల్లో 'స్త్రీ విముక్తి' చైతన్యం స్త్రీ స్వేచ్ఛ కోసం తిరుగుబాటు, పోరాటం ప్రారంభమైనాయి. 'ఫెమినిజం' పాశ్చాత్య దేశాల్లో రకరకాల పద్ధతుల్లో పోరాటం సాగిస్తూంది. భారతదేశంలో కూడా సంస్కరణ యుగంలో ముఖ్యంగా స్త్రీల సమస్యల మీదనే కేంద్రీకరించి ఉద్యమం సాగింది. ఆ విధమైన సాహితీ సృజన కూడా కొనసాగింది. సమాజంలో సాంస్కృతిక మార్పులకు దోహదం చేసేవి కళలు, సాహిత్యమూ. ఈ ఆధునిక యుగంలో ప్రపంచ వ్యాప్తంగా స్త్రీవాద సాహిత్యం బయలుదేరింది. 1975 నుంచి యు.ఎన్.ఓ మహిళా దశాబ్దాన్ని ప్రకటించింది. ఆ దశకంలో ప్రపంచ దేశాల్లో స్త్రీ స్వాతంత్ర్యం, "స్త్రీ హక్కులు, స్త్రీల అభ్యుదయం" అనే అంశాల మీద చైతన్యం తల ఎత్తింది. ఈ చైతన్యం సాహిత్యంలో ప్రతిబింబించింది.

ఇటీవల ఆంధ్ర సాహిత్యంలో రచయిత్రులు కవయిత్రులు ప్రధానంగా స్త్రీవాద సాహిత్యాన్ని సృజిస్తూ స్త్రీవాద సాహిత్య ధోరణిని పెంపొందిస్తూ వుండటం విశేషం. "నీలి మేఘాలు" అనే కవితా సంకలనం ఇటీవతే వెలువడింది. ఇది కేవలం స్త్రీల కవితా సంకలనమే కావటం విశేషం. ముప్పైమంది కవయిత్రులు స్త్రీవాద ధోరణిలో తమ అద్భుతమైన కవితాకళను ఇందులో ప్రదర్శించారు. స్త్రీలుగా తమ ఆర్తిని, ఆవేదనను, స్వేచ్ఛా భావాన్ని, తిరుగుబాటు ధోరణిని, పురుష దురహంకారంపట్ల అసహ్యాన్ని తమతమ కవితల్లో ప్రబలంగా వ్యక్తం చేశారు. స్త్రీ జాతికి జరుగుతున్న అన్యాయాన్ని, అవమానాల్ని ప్రతిఘటిస్తూ, స్త్రీ పురుష సమా

నత్వం సమాన హక్కులు ఆచరణ సాఫల్యం కావాలనీ, అందుకోసం పోరాటం, ఉద్యమం సాగాలనే చైతన్యం కలిగించడమూ, స్త్రీవాద సాహిత్యం యొక్క ప్రధాన లక్ష్యం. ఈ వాదానికి పురుషులు కూడా తోడ్పాటునిస్తూ రచనలు చేస్తున్నారు. కవితలేకాదు, కథలు, నవలలూ కూడా ఈ ధోరణిలో ఇటీవల వెలువడుతున్నాయి. ఈ రకమైన సాహిత్యాన్ని స్త్రీవాద సాహిత్యం అంటున్నాం.

చలం సాహిత్యానికీ, మరి ఈ రకమైన స్త్రీ వాద సాహిత్యానికీ వున్న సంబంధాన్ని ఇప్పుడు కొంత వరకు పరిశీలన చేయవచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే చలం స్త్రీ పక్షపాతి, భావుకుడు, సంవేదనాశీలి. సంప్రదాయం పేరుతో ఛాందస సమాజం పురుష దౌష్ట్యం స్త్రీలను నికృష్టంగా అణచి వుంచిన పరిస్థితికి ఆగ్రహించిన నిజాయితీపరుడు చలం. ఆ సమాజానికి బుద్ధి చెప్పడానికి, చెంపదెబ్బ కొట్టడానికి తన సాహిత్యం ద్వారా ప్రయత్నించిన మహానుభావుడు చలం. చలం హృదయ మంతటి లోనూ పరితపించే సమస్య స్త్రీసమస్య. ఆయన స్వయంగా ఇలా అన్నాడు- "నా జీవితంలో ఈ సమస్య వొచ్చి, నా హృదయంలో రక్తాన్ని ఉడికించిందాకా ఈ విషయమై స్త్రీ అని అర్థం చేసుకోక, సంఘం పెట్టే బాధల్ని నేను తెలుసుకొని మండి పడ్డదాకా నేను వ్రాయగలననీ నాకు తెలీదు. ఇప్పటికీ ఆ విషయమై తప్ప ఇంకేదీ వ్రాయడం నా చేత కాదనీ ఎట్లా తెలియ చెప్పను ?" అని సమకాలీన రచయితల కంటె భిన్నంగా, ముందు చూపుతో స్త్రీల సమస్యని ఆలోచించాడు చలం. అందుకే నేటి స్త్రీవాద సాహిత్యానికి చైతన్యపు పునాది చలం వేసినదేనని ఖచ్చితంగా చెప్పవచ్చు.

చలం దాదాపు వంద కథలూ, ఎన్నో నవలికలు, 'స్త్రీ' అనే పేరుతో వ్యాసాల సంకలనం, 'ప్రేమలేఖలు' అనే భావుకమైన రచనా, 'మ్యూజింగ్స్' అనే పేరుతో ఎన్నో విషయాల మీద అద్భుతమైన వూహాత్మక ఆలోచనాధార కలిగిన నూతన రచనా చేశాడు. ఈ అన్ని రచనల్లో ప్రధానమైన అంశం స్త్రీ స్వేచ్ఛ. అయితే ఆ స్వేచ్ఛ ప్రధానంగా సెక్స్‌కు సంబంధించిన కోణం నుండే చిత్రించబడింది. ఇది ఒక రకంగా చలం రచనలకు బలమూ, మరో రకంగా బలహీనత కూడా. ఆయన అద్భుతమైన వచన రచనా విన్యాసం ఆయన సాహిత్యంలో మరో విశేషం.

ఆధునికుల్ని ఆయన సాహిత్యంలోని స్వేచ్ఛా ప్రణయం ఆకర్షిస్తే, ఛాందస వాదుల్ని అదే అంశం విమర్శింప చేసింది. ఇక్కడ మనం ఒక్క విషయం స్పష్టం చేసుకోవాల్సి వుంది. చలం మాటల్లోనే చెప్పాలంటే- "ఈ సనాతన ఆర్య భూమి ఈ ఆధ్యాత్మిక దేశం పవిత్ర భారతదేశం ధర్మపత్నుల దేశం- స్త్రీలను పాతివ్రత్యం పేరుతో వేనోళ్ళ బంధించి వారి వ్యక్తిత్వాన్ని రూపుమాపింది". ఈ పరిస్థితికి క్రుద్ధుడై చలం అంటారు- "ఈ దేశంలో ఆడపిల్ల కావటం ఎంతటి నీచం? స్త్రీ పురుషుని సొమ్మా? ఒక మనిషి ఇంకొక మనిషి ఆస్తి ఎలా అవుతుంది? అనాగరికులదీ, మూర్ఖులదీ ఈ అభిప్రాయం...." అని. ఈ రకమైన స్త్రీ పురుష సంబంధాల్ని పెంచిన సంప్రదాయ వ్యవస మీద తిరగబడటం చలం యొక్క ఆశయం అయింది. పాతివ్రత్యం పేరుతో ఆడవాళ్ళను అగ్నికి ఆహుతి చేసే వరకు వెళ్ళింది సంప్రదాయం. దానికే ముచ్చటైన పేరు "సతీసహగమనం". సంప్రదాయం పేరున కొనసాగిన క్రూరత్వానికి నీచత్వానికి నిదర్శనం ఈ దురాచారం. ఈ ఆధునిక సమాజంలో ఇప్పుడు మాత్రం స్త్రీలకు ఏం న్యాయం జరుగుతూంది? కట్నదాహంతో కాల్చి చంపుతున్నారు. ఇది మరో దురవస్థ.

చలం పాతివ్రత్య భావాన్ని దెబ్బతీయడానికి తన సాహిత్యంలో స్వేచ్ఛా ప్రణయం చిత్రిస్తే; నేటి స్త్రీవాద సాహిత్యం సెక్స్ సమస్యను చిత్రించటంతో ఆగలేదు. లింగ వివక్ష (gender bias) ప్రధానమైన సమస్యగా గుర్తించి చిత్రిస్తున్నది. జనాభాలో సగభాగమైన స్త్రీ జాతి లింగ వివక్షకు గురి అవుతూ, వ్యక్తిత్వమనేదే రూపుకట్టకుండ నలిగి పోతూ బతుకులు లాగుతున్నారు. లింగ వివక్ష మరెన్నో సమస్యలకు మూలం అవుతూంది.

దీనికితోడు ఈ కాలంలో స్త్రీ పురుష సంబంధాలలో, వివాహ వ్యవస్థలో ప్రధానంగా చోటు చేసుకుంటూన్నది డబ్బు. డబ్బుకు ప్రాధాన్యం వున్న చోట స్త్రీ పురుషుల మధ్య ప్రేమ భావన ఎలా రూపొంద గలదు? ఈ నాటి స్త్రీవాద రచయితలు ప్రశ్నిస్తూన్నది ఈ అంశాన్ని కూడా. చలం పరితపించిందీ ఈ ప్రేమ భావన కోసమే. చలం కాలంలో ప్రేమ భావం పాతివ్రత్యం కారణంగా ఎండిపోయింది. ఈ నాడు డబ్బు

కారణంగా ప్రేమ భావం దహించి వేయబడుతూంది. అంతే తేడా ?

అప్పటికీ ఇప్పటికీ, స్త్రీల పరిస్థితుల్లో మార్పులు వచ్చినా, కొన్ని సమస్యలు పరిష్కారం అయినా ప్రధానమైన మార్పులు మాత్రం రాలేదు. దానికితోడు నూతనమైన సమస్యలూ తలెత్తినాయి. వికృత రూపం ధరించినాయి - అదే కట్నం సమస్య. పురుషాహంకారం, పురుషదాష్టీకం చావలేదు. చదువుకున్నా ఉద్యోగాలు చేస్తున్నా ఆర్థికంగా సామాజికంగా కొంత అభ్యుదయం సాధించినా, శాసనపరంగా కొన్ని చట్టాలు స్త్రీలకు అనుకూలంగా చేయబడినప్పటికీ, వారు పురుషులతో సమానమైన గౌరవ ఆదరాలు పొందుతూ నిండు వ్యక్తిత్వంలో బ్రతికే బంగారు కాలం ఇంకా రాలేదు అది ఎంత దూరంలో వుందో అనే ఆలోచన సాగుతుంది. ఈ సందర్భంగా కొడవటిగంటి కుటుంబరావుగారు అన్నమాటలు గుర్తు చేసుకుంటే ('ఆడజన్మ' నవలలో) ఎంత ఆవేశనా భరితంగా వున్నాయో గమనించవచ్చు. "మన సమాజంలో కొందరు తక్కువ కులాలలో పుడతారు. కొందరు బీదల కడుపున పడతారు మరికొందరు ఆడజన్మగ పుడతారు." ఆవేశం ఒక ప్రత్యేక తరహా తత్వం. దానికదే సాటి. ఈ నికృష్ట పరిస్థితి మీదనే స్త్రీవాద సాహిత్య సృష్టికర్తలు మండిపడుతున్నారు చలం ఈనాటి స్త్రీవాద సాహిత్యకారులవలె అంతలోతుగ అన్ని కోణాల నుండి ఆలోచించలేదు. స్త్రీల సమస్యలకి మూల కారణం ఎక్కడ వుందో ఆయన అంతగ ఆలోచించలేదు. ఆయనది ఈ విషయంలో ఎక్కువగా ఆత్మాశ్రయ ధోరణి. కాని ఆయన ఎలా ఆలోచించినా ఆయన సాహిత్యం మాత్రం తెలుగు నాట ఒక చారిత్రక కర్తవ్యం నిర్వహించింది. చలం మాటల్లోనే చెప్పాలంటే "స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం యివ్వాలి. ఆమెకు మెదడు వుంది. దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకి హృదయం వుంది. దానికి అనుభవం యివ్వాలి"

అని పురుష స్వామ్య సమాజాన్ని తట్టి లేపినాడు. అదిలించి చెప్పినాడు. ఈనాడు ఎన్నో కోణాల నుండి మరెన్నో సమస్యల గురించి స్త్రీవాద సాహిత్యం ఈ సమాజాన్ని ప్రశ్నిస్తూంది. నిలదీస్తూవుంది. ఈ వారసత్వం వారు చలం నుంచి అందుకున్నారు. ఇదే చలానికి స్త్రీవాద సాహిత్యానికి వున్న బాంధవ్యం. (కడప ఆకాశవాణి, సౌజన్యంతో)

# స్త్రీవాదం కేవలం "కాగితం పులి" కారాదు!

డా॥ ఆలూరి విజయలక్ష్మి

స్త్రీ పుట్టడం సమస్య, పెరగడం సమస్య, బ్రతకడం సమస్యగా వున్న నేటి సమాజంలో స్త్రీ ఎన్ని రకాల వివక్షలకు లోనవుతూంది ఎన్ని విధాలుగా హింసకు గురవుతూంది, ఎంతగా అణచబడుతూంది అనేది చర్వితచర్వణంగా ఏకరువు పెట్టవలసిన అవసరం లేదు. కన్ను తెరిస్తే, కన్నుమూస్తే, చెవులు గిడిస్తే కనిపించేది, వినిపించేది స్త్రీవ్యధాభరిత జీవితం, హృదయాలను కలచివేసే స్త్రీ వ్యాగ్రరోదన.

ఏ దేశంలో, ఏ వ్యవస్థలో, ఏ జాతిలో, ఏ మతంలో స్త్రీలకు సమస్యలు లేవు? భోగ భాగ్యాలతో తులతూగుతూ, శాస్త్ర, సాంకేతిక రంగాల్లో శిఖరాల్ని చేరి, తనకు తానే ప్రపంచాధినేతగా కిరీటాన్ని పెటుకుని మానవహక్కులపై ఇతరులకు శ్రీరంగనీతులు చెప్పే అమెరికాలోనా? స్త్రీలు భర్తలతో తన్నులు తిని, నానారకాల హింసలకు గురయి ఎమర్జన్సీకి రావడం ఒక మెడికల్ ఎపిడిమిక్‌గా తయారయిందని స్వయంగా అమెరికా సర్జన్ జనరల్ గణాంక వివరాలతో సహా వెల్లడించిన తాజా సమాచారం. ఈ లెక్కల్లో బయట జీవితంలో ఆమె పొందే అవమానాల్ని, వేధింపుల్ని, హింసను చేర్చలేదు.

మానవులంతా సమానులే అనే విశాల భావప్రాతిపదికగా, అంతటా సుఖశాంతులతో తులతూగే వ్యవస్థకోసం స్థాపించి, ఆ వ్యవస్థ సాధనలో

నిర్మాణంలో పురుషునితో భుజం భుజం కలిపి శ్రమించిన స్త్రీలకు సమాజంలో పూర్తిగా సమాన హోదా యివ్వడానికి ప్రప్రథమ సోవియట్ వ్యవస్థ మార్గాన్ని సుగమం చేసినప్పటికి ఆచరణలో స్త్రీపురుష సంబంధాల్లో పెనుమార్పులేమీ సంభవించలేదని, రాచరిక వ్యవస్థలో అనుభవించిన కొన్ని బాధలకుతోడు స్త్రీ పురుష సంబంధాల పరంగా స్త్రీలు క్రొత్త ఇక్కట్లను అనుభవిస్తున్నారని ఒక దశాబ్దం క్రితం సోవియట్ యూనియన్‌ని సందర్శించిన యీ వ్యాసకర్తకు సోవియట్ స్త్రీలు చెప్పారు.

ఇంక మత మౌఢ్యాలతో, జాత్యహంకారంతో, శతాబ్దాల దాస్యంతో అంధకారంలో మగ్గుతున్న అనేకానేక దేశాల్లోని స్త్రీల సమస్యల గురించి, వారి హీన ప్రతిపత్తి గురించి ఎంత చెప్పినా తరగదు. ప్రపంచంలోని అన్ని దేశాల స్త్రీల సమస్యల ఆకృతిలో తేడాలుండొచ్చు కాని సారాంశం ఒకటే.

## స్త్రీవాదం

స్త్రీ, పురుష సమానత్వం కొరకు స్త్రీ తన జీవితాన్ని తాను నిర్మించుకునే హక్కు కొరకు పోరాడేది, జీవితంలోని ప్రతి అంశంలోనూ సమాజంలోని ప్రతి రంగంలోనూ, స్త్రీ పట్ల అమలులోవున్న వివక్షతల్ని వ్యతిరేకించేది స్త్రీవాదం.

సృష్టిలో స్త్రీ కంటే పురుషుడు అధికుడు అని నమ్ముతూ అతని అధికారాన్ని, ఆధిక్యాన్ని, దౌర్జన్యాన్ని సహజమైన అంశాలుగా స్వీకరించే స్థితి నుండి క్రమేపీ ఆలోచించడం, తనకు జరుగుతున్న అన్యాయాల్ని గుర్తించడం నేర్చుకున్న స్త్రీ, తనను బంధిస్తున్న అనేకానేక సంకెళ్ళను కూడా గుర్తిస్తూంది. సంకెళ్ళను తెంచుకుని వెలుగుదారుల్లోకి పయనించాలనే చైతన్యాన్ని పొందుతున్న స్త్రీ తన సంకెళ్ళను ఛేదించుకునే మార్గాల కొరకు అన్వేషిస్తూంది. స్వేచ్ఛ కోసం, గౌరవంగా జీవించడం కోసం పరితపిస్తున్న స్త్రీకి భిన్న సిద్ధాంతాల్ని నమ్మేవారు. విభిన్న పథాల్ని నిర్దేశిస్తున్నారు. స్త్రీల సమస్యలకు మూల కారణమైన చారిత్రిక, సాంఘిక, ఆర్థిక రాజకీయకారణాల్ని విశ్లేషిస్తూ స్త్రీవాద గమ్యాన్ని నిర్ధారిస్తున్నారు.

# స్త్రీ స్వేచ్ఛకు పరిమితులు

స్వేచ్ఛకు పరిమితులు తప్పనిసరి. కాని ఆ పరిమితులు పురుషుని స్వేచ్ఛకు వర్తించిన విధంగానే స్త్రీ స్వేచ్ఛకూ వర్తించాలనడంలో అనౌచిత్యమేమీలేదు. ఆడపనులు, మగపనులు అని పనుల్ని విభజించి స్త్రీల పనుల్ని నీచంగా చూస్తూ, ఆడపనుల్ని స్త్రీలు, మగపనుల్ని పురుషులు మాత్రమే చెయ్యాలి. పురుషుడు ఆడంగి పనులు చెయ్యగూడదు, స్త్రీ మగరాయునిలా తిరగకూడదని యీ ఆధునిక కాలంలో యింకా భావిస్తూనే వున్నారు. స్త్రీ ఒక వస్తువు, నా యిష్టం వచ్చినట్లు వాడుకుంటాను, స్త్రీ ఒక బానిస, నా యిష్టం వచ్చినట్టు చాకిరి చేయించుకుంటాను, నా యిష్టం వచ్చినట్లు హింసిస్తాను, అనే పురుషస్వామ్య భావజాలాన్ని తుడిచి పెట్టడానికి అవసరమైన చైతన్యాన్ని ధైర్యాన్ని, శక్తిని స్త్రీవాదం యివ్వ గలగాలి. స్త్రీ స్వేచ్ఛకు ప్రతిబంధకంగా వున్న వాటిని గుర్తిస్తూ స్త్రీ చైతన్యాన్ని కించపరచే లేక నాశనం చేసే శక్తులపట్ల జాగ్రత్త వహించాలి.

ఈనాటి సామాజిక వ్యవస్థలో స్త్రీ పురుషులిద్దరూ అణచివేతకు, దోపిడీకి గురవుతున్నారు. పురుషాధిక్యత ఈ దోపిడీ వ్యవస్థకు పుట్టిన వికృత శిశువు. ఈ దోపిడీ సమాజానికి వ్యతిరేకంగా పురుషునితో కలిసి స్త్రీ కూడా పోరాడవలసిన సమయంలో స్త్రీవాదం పేరిట తమ ఆయుధాల్ని పురుషుడిపై ఎక్కుపెట్టడం తగదు. అనేకమంది శ్రమ, స్వేదం, రక్తం కొద్ది మంది భోగాలకు, సౌఖ్యాలకు కారణమైన వ్యవస్థ వట వృక్షాన్ని కూల్చడంలో తమ చేతుల్ని పురుషుల చేతుల్తో కలపకుండా పురుషాధిక్యత అనే కొమ్మను నరకడంలో స్త్రీలు తమ శక్తిని వృధా పరచడం భావ్యంకాదు. వర్గపోరాటంలో భాగంగా మాత్రమే స్త్రీవాద పోరాటం సాగాలి అనే వాదన సిద్ధాంతపరంగా కరెక్టేకావచ్చు. స్త్రీకి పురుషుడు ప్రధాన శత్రువు కాకపోవచ్చు.

కాని, పురుషుని వల్ల అనేక బాధలుపడుతున్న స్త్రీతో, తననుభవిస్తున్న శారీరక, మానసిక హింసకు పురుషుడు కారణం అని ప్రత్యక్షంగా చూస్తున్న స్త్రీతో 'వ్యవస్థ మారితే నీ బాధలు తీరిపోతాయి. నీ యుద్ధం

ప్రధానంగా వ్యవస్థతో, పురుషునితో కాదు' అని చెప్తే ఆమె వెంటనే 'కాదు, నా యుద్ధం ప్రధానంగా పురుషస్వామ్యంతో, ఆ తరువాతే వ్యవస్థతో' అనడంలో ఆశ్చర్యమేమీ లేదు.

దోపిడీ వ్యవస, పురుషస్వామ్యాలను వృక్షం, కొమ్మలుగా అన్వయించకుండా దోపిడీ వ్యవస్థను 'డయాబిటిస్ వ్యాధి' గానూ పురుషస్వామ్యాన్ని ఆ వ్యాధి ఫలితంగా కాలిగ్రేళ్ళకు వచ్చిన 'గాంగ్రిన్'గానూ అన్వయిస్తే సబబుగా వుంటుంది. డయాబిటిస్‌వల్ల అనేక బాధలొస్తాయి. కాని గాంగ్రిన్ వుంటే అది ప్రాణానికి, ఉనికికే ముప్పు తెస్తుంది. కనుక డయాబిటిస్‌ని కంట్రోలు చేస్తూనే గాంగ్రినస్ భాగాన్ని తక్షణం తొలగించాలి.

# వివాహం, కుటుంబం, మాతృత్వం

స్త్రీవాద లక్ష్యం వివాహంనుండి, కుటుంబంనుండి, మాతృత్వంనుండి పారిపోవడంకాదు, కాకూడదు. స్త్రీవాద లక్ష్యం పురుషస్వామ్యాన్ని బద్దలుకొట్టడమే కాని పురుషుడికి దూరంగా బ్రతకడంకాదు. వివాహం, కుటుంబం, మాతృత్వం తన సహజ వికసనానికి భంగం కలిగించడంవల్ల, తనను హీనపరచడంవల్ల, గుండెనుకోసే దుఃఖాన్ని పంచడంవల్ల వాటిని వ్యతిరేకిస్తున్న కొంతమంది స్త్రీలు వారు ఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినా వివాహం, కుటుంబం వెలుపల కూడా ఆనందప్రదంగా జీవించలేకపోతున్నారు. అందుచేత తమకు దుఃఖభాజనంగా వున్న యీ వ్యవస్థల్ని విశాలంచేసి అందులో తాము గౌరవంగా, హుందాగా, సమాన హోదాతో, ఆనందంగా జీవించగల పరిస్థితులకై పోరాడడం స్త్రీవాద లక్ష్యంకావాలి. ఈ సమాజం దోపిడీ సమాజమయినప్పటికీ యీ సమాజంలోనే వుంటూ యీ సమాజ దౌష్ట్యాలపై తిరగబడి మనం సుఖంగా జీవించే పరిస్థితులకై పోరాడడం లేదా?! అదేవిధంగా కుటుంబం, వివాహం తనపై నెట్టుతున్న ఒత్తిడుల్ని, తనపై పెడుతున్న ఆంక్షల్ని ప్రతిఘటిస్తూ సమూలమైన మార్పులకోసం ప్రయత్నించాలే తప్ప యీ వ్యవస్థల్నే వ్యతిరేకిస్తూ సామాజిక అవ్యవస్థకు దోహదం చెయ్యగూడదు.

స్త్రీవాదులనగానే వీరు వివాహం, కుటుంబం, మాతృత్వానికి వ్యతిరేకులని ముద్రవేయడం ఒక విధమయిన అసహనానికి ప్రతీక. మరో ప్రత్యామ్నాయం లేకపోతే తప్ప, మరో గత్యంతరం లేకపోతే తప్ప వివాహాన్ని, కుటుంబాన్ని, మాతృత్వాన్ని ఏ స్త్రీ కూడా వదులుకోదు. వ్యక్తిగా తనను గౌరవిస్తూ తన సహచరిగా భావిస్తున్న భర్త సహచర్యాన్ని ఏ భార్యా వదులుకోదు. భర్తతోపాటు తనకూ సమాన స్థానం, సమాన హక్కు, సమాన గౌరవం, సమాన స్వేచ్ఛని అనుమతించే కుటుంబాన్ని ఏ స్త్రీ వదులుకోదు. నలువైపుల దిగ్బంధంచేసి ఊపిరి సలపనివ్వకపోతే తప్ప బాధ్యతల్నుండి తప్పించుకోదు.

## బ్లాక్‌మెయిలింగ్‌ని ప్రతిఘటించాలి

వివాహం, కుటుంబం, మాతృత్వం పేరిట స్త్రీని బ్లాక్‌మెయిల్ చేస్తూ ఆమెను సామాజిక జీవితాన్నుండి వెనక్కు మళ్ళించి ఇంటికే పరిమితం చెయ్యాలని లక్ష్యంచేసే భావజాలపు ప్రచారాన్ని అడ్డుకోవాలి. నాకు వివాహం, పిల్లలు, కుటుంబంతోపాటు సామాజిక జీవితం, ఉద్యోగం లేక వృత్తిని నిర్వహించడంకూడా కావాలి అనే స్త్రీ ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతీసే బెదిరింపుల్ని, వాదనల్ని ప్రతిఘటించాలి. స్త్రీ సాంఘిక జీవనాన్ని కోరుకోవడంవల్ల, 'కెరీర్'కి ప్రాధాన్యత నివ్వడంవల్ల, ఆర్థిక స్వేచ్ఛ యిచ్చిన దన్నుతో పురుషుని ఎదిరించడంవల్ల కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమయిపోతూందని లబలబలాడేవారు, పాశ్చాత్య దేశాల్లో కుటుంబాలు ఇవే కారణాలవల్ల, విచ్ఛిన్నమవుతున్నాయి. వాళ్ళ అనుభవాల్నుండి పాఠాలు నేర్చుకొని ఆ ప్రమాదం మనకూ ముంచుకు రాకుండా చూచుకోవాలని హెచ్చరించే జాగ్రత్తపరులు ఒక ప్రధాన విషయాన్ని మరుగున పెట్టేస్తున్నారు.

కుటుంబాలు విచ్ఛిన్నమవడానికి కారణం స్త్రీ సామాజిక జీవితాన్ని కోరుకోవడం కాదు. మారుతున్న అవసరాలకు, పరిస్థితులకు అనుగుణంగా గృహ జీవితంలో బాధ్యతల్ని స్వీకరించవలసిన పురుషుడు అందుకు నిరాకరిస్తూ వుండటంవల్ల కుటుంబ విచ్ఛిత్తికి బీజం పడుతూంది. స్త్రీ బయటకు వెళ్ళకుండా, వృత్తిలో ఉద్యోగంలో ప్రవేశించకుండా పెట్టే ఆంక్షలవల్ల,

ఒకవేళ డబ్బుకోసం ఉద్యోగం చెయ్యడానికి అనుమతించినా ఆమె అందులో రాణించకుండా పెట్టే అడ్డుపుల్లలవల్ల, ఒకవేళ వీటన్నిటినీ అధిగమించి రాణించినా తన ఆధిక్యాన్ని, అహంకారాన్ని నోరెత్తకుండా సహించాలన్న పురుషుని దుర్మార్గపు కోరికవల్ల కుటుంబాలు విచ్ఛిన్న మవుతున్నాయి.

## బిడ్డల పెంపకంలో పురుషునికి భాగస్వామ్యం

బిడ్డల్ని పెంచడం, వారిని కనురెప్పలా సాకడం, వారి ఆట పాటల్ని, ముద్దు మురిపాల్ని ఆనందించడం, తమ బిడ్డలు తమ అందమైన బాల్యాన్ని అనుభవించగల పరిస్థితుల్ని సమకూర్చడం, వారి భావోద్రేకాల్ని, మనస్తత్వాన్ని ఆశల్ని, అనుభూతుల్ని, ఆలోచనల్ని సమాజానికి ఉపయుక్తంగా మలచడం.... యివన్నీ చెయ్యగలిగింది. తల్లి ఒక్కతేనా? బిడ్డకు గోరుముద్దల్ని తినిపించగలిగింది, బట్టలు తడుపుకుంటే మార్చి శుభ్రం చెయ్యగలిగింది, ఏడిస్తే బుజ్జగించగలిగింది, బిడ్డ పక్కలు వెచ్చబడితే తన రెక్కల మధ్య పొదువుకుని ఓదార్చ గలిగింది తల్లి ఒక్కతేనా? ఈ పనులన్నిటినీ ప్రయత్నిస్తే తండ్రి చెయ్యడం అసాధ్యమా? ఈ పనులన్నిటినీ చెయ్యడంలో అలౌకికమైన ఆనందం లభిస్తుందని ప్రవచించే పురుషుడెందుకా ఆనందానికి దూరంగా వుంటున్నాడు? పిల్లల్ని కనడం, పాలివ్వడం తప్ప మిగతా పనులన్నిటినీ స్త్రీతోపాటు చెయ్యగలిగిన పురుషుడికి ఆ పనుల బాధ్యతను పంచుకునే సంసిద్ధత లేకపోవడం వల్ల వివాహం, పిల్లల విషయంలో హక్కుల్నే తప్ప బాధ్యతల్ని స్వీకరించే ఆలోచనే పురుషుడికి లేకపోవడంవల్ల, తన కనుసన్నల్లో మెలగుతూ తనకు అన్ని సౌకర్యాల్ని సమకూర్చి పెట్టాల్సిన భార్య బయటి జీవితాన్ని కోరుకుంటే మండిపడుతున్నాడు. భార్య సంపాదించే డబ్బు కావాలి, ఆ డబ్బుమీద పెత్తనం కావాలి, యిటు యింట్లో తన అడుగులకు మడుగులొత్తుతూ తనకు సకల సౌకర్యాల్ని ఏర్పర్చాలి అని భావించే పురుషుడివల్ల, బయటి జీవితంలో తనతోపాటు, అనేకసార్లు తనకంటే ఎక్కువగా రాణించగల భార్యపట్ల అసూయతో వ్యవహరించే పురుషుడి వల్ల స్త్రీ బ్రతుకు భారంగా తయారయి, సంఘర్షణ మొదలై కుటుంబ విచ్ఛిత్తికి దారితీస్తూంది. తన భార్య తనతో సమానురాలు అనే స్పృహతో,

తన అహంకారాన్ని, సోమరితనాన్ని, ఆధిక్యభావాన్ని వదిలించుకుని హక్కులతోపాటు అన్ని బాధ్యతల్ని పురుషుడు స్వీకరించిననాడు కుటుంబాలు విచ్ఛిన్నమయ్యే పరిస్థితిరాదు. ఆర్థిక సమానత్వంతోపాటు అన్యోన్య దాంపత్యం, ఆనందప్రదమైన కుటుంబ జీవనం, తల్లిదండ్రులు, పిల్లల మధ్య ఆరోగ్యకరమైన అనుబంధాలు సమాజాన్ని హింసనుండి, నైతిక పతనం నుండి శాంతివైపుకు, మంచివైపుకు మళ్ళిస్తాయి. దీనిని సాధించే దిశలో స్త్రీవాద లక్ష్యం వుండాలి.

ఐతే స్త్రీల చివరి గమ్యం వివాహం, పిల్లలు అనే ప్రచారాన్ని కూడా అడ్డుకోవాలి. వివాహం, పిల్లలు పురుషుడికి లాగానే స్త్రీకి కూడా జీవితంలో ఒక భాగం. అదే జీవితం కాదు. సామాజిక జీవితంలో పురుషుడు చేస్తున్న పనులన్నిటినీ తామూ ప్రతిభావంతంగా చెయ్యగలమని, అవకాశాలుండి, అడ్డుపుల్లలు వెయ్యకుండా వుంటే తాము పురుషునితో సమానంగానూ, అతనికంటే ఎక్కువగానూ రాణించగలమని స్త్రీలు నిరూపిస్తున్నారు. స్త్రీల తాలూకు యీ ప్రతిభా సామర్థ్యాలు నిరుపయోగంగా నాలుగు గోడలమధ్య పడివుండకుండా సామాజిక ప్రగతికి వినియోగపడాలి.

## లైంగికత్వం

ప్రకృతి సహజమైన స్త్రీ, పురుషుల శారీరక కలయికకు సంబంధించిన బాంధవ్యాల్ని లైంగిక సంబంధాలని, వీటిని గురించిన ఆలోచనల్ని లైంగికత్వం అని అంటారు. స్త్రీ, పురుషులు ఇష్టంవచ్చిన రీతిలో లైంగిక సంబంధాలేర్పరచుకున్న ఆదిమ సమాజస్థితి నుండి ఒక పురుషుడు, ఒక స్త్రీ అనే నీతి ప్రాతిపదికగా అభివృద్ధికరమైన మార్పుకు లోనయి, భార్య–భర్త అనే పద్ధతి అమలులోకి వచ్చి యిన్ని శతాబ్దాలు గడిచాక కూడా స్త్రీ చుట్టూ పాతివ్రత్యపు ఇనుపగోడను నిర్మించి పురుషుడు తాను మాత్రం వివాహేతర లైంగిక సంబంధాల్ని కొనసాగిస్తూనే వున్నాడు. సెక్స్ గురించి తెలుసుకుంటే, సెక్స్ గురించి ఆలోచిస్తే, సెక్స్ గురించి మాట్లాడితే స్త్రీని చెడిపోయినదానికింద జమకడుతున్నారు..

మాతృత్వం అనే భావనతో స్త్రీకి బ్రెయిన్ వాష్ చేసి అది తప్ప స్త్రీకి మరో జీవిత పరమార్థం వుండకూడదనే సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు.

సంతానోత్పత్తి విషయంలో శ్రమ, బాధ్యతలు స్త్రీవి, హక్కులు, పెత్తనం పురుషుడికి లభించాయి. స్త్రీ పిల్లల్నికనే యంత్రంగా మారింది. సంతానోత్పత్తికై ప్రసవించిన ప్రతిసారి పునర్జన్మించే స్త్రీకి తను ఎప్పుడు పిల్లల్ని కనాలి, ఎంతమంది పిల్లల్ని కనాలి, ఎప్పుడు పిల్లలు కలగకుండా ఆపరేషన్ చేయించుకోవాలి అనే విషయాల్ని నిర్ణయించుకునే అధికారం లేదు.

పురుషులు స్త్రీలను తమ ఆస్తిలో ఒక భాగంగా భావించడంవల్ల, తమ అధీనంలోవుండే ఉత్పత్తి పరికరాలతో సమానంగానే సంతానోత్పత్తిని చేసే స్త్రీని కూడా భావించడంవల్ల, స్త్రీపై సర్వహక్కులు తనవేననే నమ్మకంతో ఆ హక్కుల్ని కోల్పోకుండా వుండడానికి, స్త్రీకి తిరుగుబాటు చేసే చైతన్యం రాకుండా అణచి వుంచడానికి అనేక విధాలుగా ప్రయత్నిస్తున్నాడు. సంతానం లేకపోతే హింస, మగపిల్లల్ని కనకపోతే హింస, భర్త చనిపోతే, భర్త విడిచిపెడితే తిరిగి వివాహం చేసుకుని లైంగిక జీవితాన్ని గడిపేందుకు ప్రతికూలంగా వున్న సామాజిక పరిస్థితులు, కుల, మత, సంఘర్షణలో, రౌడీల కొట్లాటల్లో స్త్రీలపై జరిగే లైంగిక హింస, పొలాల్లో, కర్మాగారాల్లో, ఆఫీసుల్లో, ఇతర ప్రదేశాల్లో స్త్రీలపై జరిగే లైంగిక వేధింపులు స్త్రీ జీవితాన్ని నలిబలి చేస్తున్నాయి. అసమగ్ర చట్టాలు, చట్టాల్ని అమలు చెయ్యడంలోని లొసుగులు, అరాచక శక్తులకు, నేరస్థులకు మద్దతునిచ్చే రాజకీయ, సాంఘిక పరిస్థితులు దోషులు శిక్షలు పడకుండా తప్పించుకునే వీలుని కల్పిస్తున్నాయి.

## సంతానోత్పత్తిలో సమాన హక్కులు ఉండాలి

సంతానోత్పత్తికి సంబంధించిన ప్రతి నిర్ణయంలోనూ పురుషుడితో పాటు తనకూ అధికారం వుండే హక్కు గురించి స్త్రీలు పోరాడాలి. భర్త నిర్ణయించడం, భార్య చచ్చినట్లు దాన్ని శిరసావహించే పద్ధతిని వ్యతిరేకించాలి. స్త్రీల లైంగికత్వాన్ని పురుషుడు అదుపు చెయ్యడాన్ని, లైంగిక సంబంధాల విషయంలో పురుషునికో నీతి, స్త్రీకో నీతి చెల్లుబాటు కావ

డాన్ని, స్త్రీలపట్ల లైంగిక వివక్షను ప్రతిఘటించాలి. స్త్రీకి సెక్స్ సంబంధాలు కేవలం సంతానోత్పత్తి కోసమే అనే భావాన్ని కూడా వ్యతిరేకించాలి.

లైంగిక విశృంఖలత వ్యక్తులకు, సమాజానికి హానికరమని అంగీకరించినప్పుడు విశృంఖల మార్గంలో వున్న పురుషుడిని సరిచేయడానికి మార్గాల్ని అన్వేషించాలే తప్ప సమానత్వం పేరుతో స్త్రీలుకూడా అదే పెడదారి పట్టరాదు. పిల్లల్ని కనడానికి, సెక్స్ సంబంధాలు పెట్టుకోవడానికి వివాహమనే ముద్ర వుండనవసరం లేదు అనే వాదన సరైనదికాదు. అలాగే స్త్రీ పురుషులిరువురూ ఒకరిమీద మరొకరి పెత్తనం లేకుండా ఎవరికి వాళ్ళు స్వేచ్ఛగా జీవిస్తూ కోరిక కలిగినప్పుడు లైంగిక వాంఛను తీర్చుకోవచ్చు అనే ప్రతిపాదన కూడా సవ్యమైనదికాదు. స్వలింగ సంపర్కాల్ని బలపరుస్తూ పురుషుడు లేకుండా స్త్రీ బ్రతకగలదు అనడం కూడా విపరీత భావనే. ఇలాంటి ధోరణులు స్త్రీ విమోచనకు భంగం కలిగిస్తాయే తప్ప స్త్రీకి ప్రయోజనం చేకూర్చవు. సామాజిక అవ్యవస్థకు దారితీసే ఇలాంటి ధోరణుల్ని వ్యతిరేకించాలి.

## శ్రామిక మహిళలు

సమాజంలో అధిక భాగంగావున్న శ్రామిక మహిళల సమస్యల్ని పట్టించుకోని స్త్రీవాదంవల్ల, శ్రామిక మహిళల విముక్తి, అభ్యున్నతి, ఆనందం గురించి ఆలోచించని స్త్రీవాదం వల్ల స్త్రీ జాతికి ప్రయోజనం చేకూరదు.

పనిభద్రత లేకపోవడం, సమాన పనికి సమాన వేతనం లేకపోవడం, నైపుణ్యం అవసరమైన పనులకు ప్రవేశం లేకపోవడం, అనువైన పని పరిస్థితులు లేకపోవడం, దారిద్ర్యం, ఆకలి, నిరుద్యోగం, పన్నుల భారం మొదలైన శ్రామిక మహిళల సమస్యల పరిష్కారానికై పోరాడాలి. స్త్రీ అనే చులకనతో, పేదరాలు అనే చులకనతో, నిరక్షరాస్యురాలు, అజ్ఞాని అనే చులకనతో, శ్రామిక మహిళలపై జరిగే సాంఘిక అత్యాచారాలు నానాటికి పెచ్చు పెరిగిపోతున్నాయి. వీటన్నిటికీ వ్యతిరేకంగా స్త్రీ జాతి ఐక్యంగా పోరాడాలి.

# స్త్రీవాదం కేవలం కాగితంపులి కారాదు

స్త్రీవాద సాహిత్యాన్ని రచించేవారే కాక స్త్రీ జనాభ్యుదయాన్ని కోరి అందుకు కృషి చేసే స్త్రీ, పురుషులందరూ స్త్రీవాదులే. విభిన్న గ్రూపులకు చెందిన స్త్రీవాదులు భిన్న సిద్ధాంతాలతో వేర్వేరు లక్ష్యాలను, వేర్వేరు మార్గాలను ఎన్నుకుంటే స్త్రీకి ఒనగూడే ప్రయోజనం శూన్యం. స్త్రీవాద చైతన్యం అన్నివర్గాల, అన్ని మతాల స్త్రీలకు సోకాలంటే ఉమ్మడి లక్ష్యాలు, ఉమ్మడి మార్గాలు తప్పనిసరి. ఊపిరి పోసుకుంటున్న ఉద్యమానికి ఐక్యంగా, సంఘటితంగా ఊపిరులూదితే తప్ప అది జ్వలించి జ్వలించి అగ్నిశిఖయై శతాబ్దాల అంధకారంపై కాంతి ధనుస్సును ఎక్కుపెట్టలేదు. ఉద్యమాలు విజయవంతమవ్వాలంటే సైద్ధాంతిక ఆధారం, ఆలోచనల స్పష్టత, నిజాయితీ, అంకితభావం, కార్యదక్షత వున్న కార్యకర్తలు, గతంలోని మంచిని స్వీకరిస్తూ, వర్తమానాన్ని సరిదిద్దుతూ, భవిష్యత్తుకు బంగారు బాటవేసే విజ్ఞత, సమర్థత వున్నవారి మార్గదర్శకత్వం అవసరం.

# పురుషులలో సంస్కారం కల్గించే ప్రయత్నం అవసరం

డాక్టర్ అల్లూరి రాజకుమారి
ఎం. బి. బి. ఎస్.

'పాశ్చాత్య సామాజిక నీతులను విచక్షణారహితంగా అనుసరించడం వల్ల జనానీకానికంతకూ మేలు జరుగుతుందా?'

'ఇన్నాళ్లూ పురుషుల ఉక్కుపాదాల క్రింద స్త్రీ జాతి నలిగి పోయింది కనుక, ఇటుపైన పురుషుని శిరస్సుపైనే శ్రీమతి స్త్రీ తన పాదాలను నిలిపితీరాలన్న కక్షా విజృంభణ జాతికి మేలు చేయగలుగుతుందా?'

'తొందరపాటుతో పడమటిగాలులు ప్రసరించే వెర్రి సిద్ధాంతాలలో కొట్టుకుపోతే దుష్ఫలితాలు కలుగక తప్పవు.'

ఇవి మార్చి, ఏప్రియల్ 'కమ్యూనిజం' పత్రికలలో స్త్రీవాదంపై అభ్యుదయకవి శ్రీ సోమసుందర్‌గారి వ్యాసాలలోని అభిప్రాయాలలో కొన్ని.

"ఏ పనీపాటా లేని ఆడవాళ్ళ సమాన 'హక్కులగోల' 'కవిత్వం రాసే ఆడవాళ్ళంతా గయ్యాళులనీ', వారి కవితలను 'నీలికవితలనీ, వార కవితలనీ' విమర్శలు వినిపించిన తరువాత వచ్చిన సోమసుందర్‌గారి వ్యాసాలను ఒక్కసారి ఆలోచించవలసిందే.

'మా పోరాటం పురుషులమీదకాదు. పురుషాధిక్య సమాజంమీద, పురుష దురహంకారంమీద' అని స్త్రీవాదులు అనేకసార్లు, (అనేక వేదిక

లపై నుండి) స్పష్టం చేసిన తరువాత కూడా "పురుషాధిక్య స్వభావాన్ని ద్వేషించడానికి బదులు పురుషుల్నే ద్వేషించడం పెడమార్గమే" అని శ్రీ సోమసుందర్‌గారు అనడం విచిత్రమే. అలాగే మరో స్టేట్‌మెంటు-

'పాశ్చాత్య దేశాల సాంఘిక పరిస్థితులవైపు మనం దృష్టి సారిస్తే - మన దేశీయ స్త్రీ సమస్యల పరిష్కారానికి మార్గదర్శక సూత్రాలు లభించవు.

## అన్నీ విదేశాల నుండి దిగుమతి అయినవే

ఈ ఆధునిక యుగంలో మన సాహిత్యమూ, సంస్కృతీ, రాజకీయ సిద్ధాంతాలూ, సమస్తమూ మనం విదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నవే. ఒక్క స్త్రీవాదం మాత్రం అందుకు మినహాయింపు కాగలదా?

'స్త్రీవాద సాహిత్యం సాధించిన అపూర్వ విజయాలను అభినందించవలసిందే. దానితోపాటు సెక్టేరియన్ ప్రమాదంలో పడి కొట్టుకుపోకుండా ఆపుచేయవలసిన అవసరం, దాన్ని (స్త్రీవాదాన్ని) బలపరిచే అస్మదాదులపై వున్నది' అంటూ స్త్రీవాదులను రక్షించేభారం తమ భుజస్కంధాలపై వేసుకుంటున్నారు సోమసుందర్‌గారు. (సరిగ్గా, అలాగే స్త్రీలను రక్షించే ఉద్దేశంతోనే 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అన్నారు మనువు).

స్త్రీవాదులను అవహేళన చేసే స్థితి నుండి, స్త్రీవాదం ఉద్యమ రూపం ధరిస్తే, మన సమాజం, అస్తవ్యస్తమవుతుందని ఆందోళన చెందే స్థితికి వచ్చారు. కనీసం, ఆ కారణంగానైనా అభ్యుదయవాదుల దృష్టి 'మన భారతీయ సంస్కృతి వైపు, మన కుటుంబ వ్యవస్థవైపు' మళ్ళటం హర్షించదగిన పరిణామమే.

అయితే స్త్రీవాదంలోని లోటుపాట్లను వివరించి, వారిని సక్రమ మార్గంలోకి తీసుకురావాలని ఆరాటపడే రచయిత వ్యాసంలో 1930 నాటి స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతం, మొక్కపాటి రామ్మూర్తి ఆత్మహత్యోదంతం ఎలా చోటు చేసుకున్నాయి ?

'స్వలింగ సంపర్కాలు ఆధునిక నీతిగా, సంప్రదాయ విచ్ఛేదక సాహస చర్యగా ఆమోదించబడుతోంది. ఆ సహజ అనుబంధాల క్షతితంగా చివరికి **AIDS** వంటి భయంకర పర్యవసానాలు పెచ్చరిల్లుతున్నాయి.

(AIDS కేవలం అసహజ అనుబంధాల వల్ల మాత్రమే కాదు. మితిమీరిన వ్యభిచారం వల్ల కూడా వస్తుంది) అని సోమసుందర్‌గారూ, "మేము కూడా మీలా చేస్తే తప్ప, ఈ దౌర్భాగ్య లక్షణ సౌభాగ్యం మీకు నసాళానికి అంటదు, అని స్త్రీ వాదులు సూచిస్తున్నారని" శ్రీ చందు సుబ్బారావు గారు, (ఏప్రిల్ 'కమ్యూనిజం') అనడం చూస్తుంటే, స్త్రీవాదాన్ని పెడ మార్గం పట్టిస్తున్నారనే అనుమానం కలుగుతుంది.

## ఫెమినిస్టులు చెబుతున్నది ఏమిటి?

"అసలింతకూ ఫెమినిస్టులు చెబుతున్నదేమిటి ?"

ఒక ప్రాథమిక నిర్వచనం ప్రకారం "ఫెమినిస్టు" అంటే స్త్రీలు తమ సెక్స్‌వల్ల వివక్షతతో చూడబడుతున్నారనీ, స్త్రీలుగా వాళ్ళకున్న ప్రత్యేక అవసరాలు తిరస్కరించబడుతున్నాయనీ, తీరడంలేదనీ, ఆ అవసరాలు తీరాలంటే, ఇప్పుడున్న సాంఘిక, ఆర్థిక రాజకీయ విధానాలతో మౌలికమైన మార్పులు రావాలని కోరుకునేవారు.

(వసంతా కన్నాబిరాన్)

స్త్రీ యొక్క బాధలను, అవి ఏ రంగంలోనైనా నిర్మూలించడం, స్త్రీలమీద జరుగుతున్న అన్ని రకాల దాడులనూ, దోపిడీని తిప్పికొట్టడం, ఫెమినిస్టుల గమ్యం, ఒక పరిపూర్ణ మానవిగా స్త్రీని తీర్చిదిద్దడం వారి లక్ష్యం.

అసలు స్త్రీవాదుల ఉక్రోషం ఏమిటీ ? మన సమాజంలో 'పురుషునికి వున్న ప్రాధాన్యత స్త్రీకి లేదు' అని. అయితే ఆ అభిప్రాయంలో నిజమెంత ?

## అర్ధనారీశ్వర తత్వం

అనాదిగా మన సమాజం ప్రాధాన్యతనిచ్చింది కుటుంబ వ్యవస్థకే.

ఆ కుటుంబ వ్యవస్థలో స్త్రీకేకాదు పురుషునికీ ప్రాధాన్యత లేదు. ధర్మబద్ధంగా లేక చట్టబద్ధంగా వివాహమాడిన స్త్రీ పురుషులే కుటుంబం. బహుశా, అదే అర్థనారీశ్వర తత్త్వం. అయితే, మనం ఆ భావానికి దైవత్వాన్ని ఆపాదించి, గోడకు వ్రేలాడదీశాం;

కుటుంబ వ్యవస్థకు ప్రాధాన్యతనిచ్చే సమాజంలో, కుటుంబం వెలుపల పురుషుని ప్రవర్తన కుటుంబ పరిధిలోనికి రాదు.

అయితే, అదే అవకాశం స్త్రీకి వుందా? లేదు. ఉండే అవకాశం లేదు. దీనికి కారణమేమిటి? ఒక్క క్షణం మనం ఆవేశ, కావేషాలను ప్రక్కకు పెట్టి ఆలోచిస్తే-

చట్టబద్ధంగా వివాహమాడిన స్త్రీ, పురుషులు వారి సంతతి, అదే కుటుంబం. పురుషుడు వ్యసనపరుడైతే, అతని వల్ల పరాయి స్త్రీ తల్లి అయితే, అతని 'జీన్స్' బయటకు పోతాయి. కుటుంబానికి నష్టంలేదు. కానీ, స్త్రీ పరాయి వ్యక్తి వల్ల తల్లి అయితే, ఆ కుటుంబానికి ఏ సంబంధమూలేని పరాయి వ్యక్తి ఆ కుటుంబ పరిధిలోకి వస్తాడు. ఆ యింటికి వారసుడు అవుతాడు. తన సంపద, తన సంప్రదాయం, తన ఇంటిపేరుతో సహా అవిచ్ఛిన్నంగా తన రక్త సంబంధీకులకే చెందాలని కోరుకోవడంలో అసహజమేమీ లేదు. ఆ కారణం వల్లనే పురుషుని కంటే, స్త్రీకి ఎక్కువ ఆంక్షలు విధించబడ్డాయి.

ఆంక్షల మాట ఎలా వున్నా భార్యాభర్తల మధ్య గల నిజమైన స్నేహ భావమే ఆరోగ్యకరమైన కుటుంబానికీ, సమాజానికీ మూలం.

సరియైన ఆలోచన గల స్త్రీ పురుషులు ఏకాత్మతతో తమ కుటుంబాన్ని చక్కదిద్దుకుంటారు.

"పురుషుడు ఏ మేరకు ప్రణయ స్వేచ్ఛ అనుభవిస్తున్నాడో, ఆ మేరకు స్త్రీని అనుమతించాలి" అని శ్రీ చందు సుబ్బారావుగారు విశాల హృదయంతో ఏప్రిల్ నెల 'కమ్యూనిజం'లో ఒక ప్రతిపాదన చేశారు. అయితే, స్త్రీకి ఆ అనుమతిని ఇచ్చేది ఎవరు, పురుషుడా? దేనికి అనుమతి? స్త్రీ సంతోషం కోసమా? లేక స్త్రీ ద్వారా తనకు ఉద్యోగమో, లేక ప్రమోషనో రావాలనా? (శ్రీశ్రీ 'అనంతం')

ఏది ఏమైనా స్త్రీ విషయానికి వచ్చేసరికి, సమర్థించేవారూ, వ్యతిరేకించేవారూ వారి వాదనలన్నీ ఒకే కోణంలోకి వెళ్ళడం హర్షణీయంకాదు. బహుశా ఆ దృష్టి మారాలనే స్త్రీవాదులు కోరుకుంటున్నారు.

'లెస్బియనిజం' వంటి అరాచకాలు తగునా?' అని ప్రశ్నిస్తున్నారు.

సోమసుందర్‌గారు. 'లెస్బియనిజమే కాదు, వివాహేతర స్త్రీ పురుష సంబంధాలు' కూడా ఆరోగ్యకరంగా వుండాలనే సమాజానికి తగవు.

## "అతి సర్వత్ర వర్జయేత్"

ఏది ఏమైనా, స్త్రీవాదులు కోరుకునేది తమకూ ఒక గుర్తింపు వుండాలనే. అయితే 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నట్లు స్త్రీవాదులు మితి మీరిన కసి, కక్ష చూపించడం వల్ల అసలు సమస్య మరుగున పడుతుంది. ప్రక్కదారి పడుతుంది.

సతీసహగమనాలూ, కన్యాశుల్కాలూ అంటూ గతానికి స్వస్తి చెప్పినా, వరకట్నపు జ్వాలలనూ ఆర్పివేయగలిగినా, ఈనాడు పట్టణాలలో ఈవ్ టీజింగ్ సంగతి ఏమిటి? – 'అవొకరకం ఊరకుక్కలు సార్! అదిలిస్తే పారిపోయేరకం. మరి పిచ్చికుక్కలు వెంటబడితే....? శరీరపు ఒంపుసొంపులు తప్ప ఏదీ కనిపించని సంస్కారం మగవాళ్ళలో వున్నంత కాలం, నా బాధలైనా, మీ బిడ్డల బాధలైనా, మరొకరివైనా, ఇంతేనో, ఇంతకన్నా ఘోరమో? (శ్రీ కేతు విశ్వనాధరెడ్డిగారి కధ 'రెక్కలు') అయితే, పురుషులను సంస్కారవంతులను చేయటం ఎలా?

## పురుషులలో చైతన్యం కల్గించే ప్రయత్నం అవసరం

స్త్రీవాదులు పురుషులలో చైతన్యాన్ని కలిగించే ప్రయత్నం చేయడం మంచిది. ఆ పని పురుష శిశువు తన ఒడిలో కళ్లు తెరిచిన నాటి నుండి జరగాలి.

స్త్రీ పురుషుడు అన్న భావం నుండి 'మనిషి' అన్న భావంలోకి ఎంత త్వరగా రాగలిగితే అంత మంచిది మనకూ, సమాజానికీ కూడా.

మాతృగర్భంలోని శిశువు లింగ నిర్ధారణ వివరించగల స్కానింగ్ యంత్రం (ఏమ్నియో సెంటిసిస్) ప్రవేశించడంతో, ముందు జాగ్రత్త చర్యగా గర్భస్థ స్త్రీ శిశు హత్య వివేక శూన్యంగా సాగిపోతోంది. ఫలితంగా 'ఆగామి శతాబ్దంలో ద్రౌపదీ వ్యవస్థకు తిరోగమించక తప్పదని'

ఆందోళన చెందుతున్నారు సోమసుందర్‌గారు. నిజమే, ఈ వార్త ఎందరి మనసులనో కలిచివేస్తోంది.

ఈనాడు స్త్రీ శిశువులను అమానుషంగా హత్య చేస్తున్నారని వాపో తున్న ఎందరో మేధావులు సరిగ్గా 20 సంవత్సరాల క్రితం ప్రభుత్వం గర్భస్రావాలను చట్టబద్ధం చేసినప్పుడు ఎందుకు వ్యతిరేకించలేకపోయారు. అసలే స్త్రీలను చిన్న చూపు చూసే సమాజంలో స్త్రీ శిశువుని 'మైనస్'గా పురుష శిశువును 'ప్లస్'గా భావిస్తున్న తల్లిదండ్రులు వున్న సమాజంలో 'గర్భస్రావాన్ని' చట్టబద్ధం చేసినప్పుడు ప్రధానంగా ఆవేటు స్త్రీ శిశువుపై పడుతుందని వూహించలేక పోయారా ?

## గర్భస్రావాల సంగతి ఏమిటి ?

అబార్షన్‌లు చేయించుకోవడం ఈనాటి నాగరికతగా మారిపోవడానికి కారణమేమిటి ?

స్త్రీకి తన శరీరంలోని అన్ని అవయవాలపైనా తనకు సంపూర్ణ అధికారం వున్నట్లే, 'యూటిరస్' (Uterus) పై కూడా ఆమెకే అధికారం వుండాలనీ, ఆమెకు ఇష్టంలేని శిశువును తొలగించుకోవడానికి ఆమెకే సంపూర్ణాధికారం (భర్త ప్రమేయం లేకుండా) వుండాలనీ, రచయిత్రులూ, స్త్రీ స్వేచ్ఛను కాంక్షించేవారూ రచనలు చేస్తున్నప్పుడు ఎవరూ వ్యతిరేకించలేదు ఎందుకని ?

'తల్లీ బిడ్డను చంపితే, నీతికి స్థానం వుంటుందా?' అని ఆవేదనతో ప్రశ్నించిన మదర్ థెరిస్సాను దారుణంగా విమర్శించిన శ్రీమతి మల్లాది సుబ్బమ్మగారికి ఎవరూ ఎందుకు సమాధానం చెప్పలేకపోయారు ?

'అబార్షన్స్' స్త్రీల జన్మ హక్కు అంటూనే, స్త్రీ శిశువులను అబార్షన్ ద్వారా హత్య చేయడం ఎంత అమానుషం? అనడం చూస్తుంటే గర్భస్రావాలను చట్టబద్ధం చేయడం కేవలం గర్భస్థ పురుష శిశువులను హత్య చేయడానికేనా అనే సందేహం మాలాంటి అజ్ఞానులకు కలగటంలో ఆశ్చర్యంలేదు.

అసలింతకూ ఒక్క సందేహం ?

నిజానికి గర్భస్రావాలను చట్టబద్ధం చేసిన తరువాత అబార్షన్స్

కోసం వచ్చిన స్త్రీలలో అవివాహితలు ఎంతమంది? (వారికి లింగ వివక్షత లేదు) వివాహిత స్త్రీలలో జరుగుతున్న అబార్షన్స్‌లో కేవలం స్త్రీ శిశువు అన్న కారణంగా చేయించుకుంటున్న అబార్షన్స్ శాతం ఎంత? స్త్రీ శిశువు అన్న కారణంగా గర్భస్రావం చేయించుకుంటున్న స్త్రీలు పుట్టబోయే ప్రతి స్త్రీ శిశువునీ హత్య చేయిస్తున్నారా? లేక, మొదటిసారి స్త్రీ పుట్టిన తరువాత, రెండవసారి పురుష శిశువు పుట్టాలనే (పుట్టి తమను నరకం నుండి తప్పిస్తారనీ) ఆలోచనతో అబార్షన్స్ చేయించుకుంటున్నారా? 'ఏమ్నియో సెంటిసిస్' ద్వారా లింగ నిర్ధారణ చేయించుకున్న సెంటర్స్‌కి వెళ్ళి ఎవరైనా అక్కడి రికార్డ్స్ పరిశీలించారా?

అబార్షన్‌కు సంబంధించినంతవరకూ, చదువుకున్నవారు, చదువుకోని వారూ అన్న భేదం లేదు. ఉన్నవాళ్ళు లేనివాళ్ళూ అన్న తారతమ్యం లేదు. అబార్షన్స్ చేయించుకోవడం ఈనాటి నాగరికత.

పెళ్ళి అయిన వెంటనే పిల్లలు పుడితే తమ ఆనందానికి అడ్డు వస్తారని అబార్షన్ కావాలి. మొదటి బిడ్డ పుట్టిన వెంటనే ప్రెగ్నెన్సీ వస్తే, మొదటి బిడ్డ ఆరోగ్యం దెబ్బతింటుంది కాబట్టి అబార్షన్ కావాలి. తమకు ఇద్దరే పిల్లలు చాలు కాబట్టి, ఇద్దరి పిల్లల తరువాత 'ప్రెగ్నెన్సీ' వస్తే అబార్షన్ కావాలి. (ఫామిలి ప్లానింగ్ టాబ్లెట్స్ లేక **Copper 'T' Loop**, వీటిని ఎందుకు వుపయోగించరని మనం అడగకూడదు. **Loop** పెట్టించుకుంటే రక్తస్రావంతో ప్రాణాపాయం కలుగుతుందని ప్రక్కింటి ముసలమ్మ చెబితే, టాబ్లెట్స్ వాడితే మరో కాంప్లికేషన్ వస్తుందని ఎదురింటి పిన్నిగారు చెబుతుంది.) భర్త వాసెక్టమీ చేయించుకోవాలో లేక భార్య ట్యూబెక్టమీ చేయించుకోవాలో నిర్ణయించుకునే లోపల ఆమెకు రెండుసార్లు అబార్షన్స్ జరుగుతాయి.

ప్రతిరోజూ ఒక మాత్ర వేసుకునే కంటే, **Loop** పెట్టించుకుని ప్రాణాపాయం తెచ్చుకునే కంటే, అంతగా ప్రెగ్నెన్సీ వస్తే అప్పుడే అబార్షన్ చేయించుకోవచ్చు అన్న ఆలోచన పెరుగుతోంది. (కనీసం గర్భస్రావ చట్టానికి వున్న పరిధులూ, పరిమితులూ చాలామందికి తెలియవు).

శిశు హత్య దారుణమన్న ఆలోచన మనతో పెరిగిననాడు స్త్రీ శిశువే కాదు పురుష శిశువూ బ్రతికి బట్టకడుతుంది.

'ప్రతిబిడ్డా
మానవజాతి మీద నాకున్న ఆశ
ఇంకా అంతరించిపోలేదని
దేవుడు పంపే
వాగ్దానం, భవితవ్యం'
అన్న కవితను మనం మార్చి రాసుకోవలసి వస్తుందేమో ?
అబార్షన్ కోసం వచ్చే
ప్రతి తల్లీ
మానవ జాతి మీద నాకున్న ఆశ
పూర్తిగా అంతరించిపోయిందని
దేవుడు చేస్తున్న
ఆక్రోశం.

# స్త్రీవాద సాహిత్యం - ఒక పరిశీలన

## డాక్టర్ శ్రీమతి రావి భారతి

ప్రపంచ జనాభాను ఆక్రమించే దాదాపు 50 శాతం స్త్రీలు ఏదో ఒక రూపంలో సాంఘిక ఆర్థిక రాజకీయ నైతిక సమస్యల్ని ఎదుర్కొంటు న్నారు. శ్రామిక వర్గ స్త్రీలు - మధ్యతరగతి స్త్రీలు - ఫ్యూడల్ సంస్కృ తికి సంబంధించిన స్త్రీలు - ఇలా వర్గ స్థాయి ననుసరించి భిన్న భిన్న సమస్యలకు లోనౌతున్నారు. గమనించవలసిన అంశమేమిటంటే సమస్యల యొక్క స్వరూపాలు భిన్నమైనా ప్రతీ సమస్యపై పురుషాధిక్యత యొక్క ముద్ర స్పష్టంగా కనిపించి తీరుతుంది.

## స్త్రీని నీచంగా చిత్రించిన మతగ్రంథాలు

అంతర్జాతీయంగా కూడా స్త్రీలు పురుషులతోపాటు మానవ హక్కుల కోసం, ఓటు హక్కు కోసం, వేతన క్రమంలో సమానత్వం కోసం పోరాటాలు చేశారు, చేస్తూ వున్నారు.

సాంఘికంగా కూడా ప్రపంచ వ్యాప్తంగా స్త్రీ వంచింపబడుతూనే వుంది. చట్టాలు చేసేది, మత గ్రంథాలు రాసేది మగవాళ్ళే కనుక క్రైస్తవ గ్రంథాలు, ఇస్లాం మత గ్రంథాలు స్త్రీని చాలా నీచంగా చిత్రిం చాయి. మన వాఙ్మయంలో మనుస్మృతి మొదలు మహాభారతం దాకా స్త్రీని తక్కువ చూపుతో చూసినట్లు సోదాహరణంగా చెప్పొచ్చు. ఒక గమనించ దగిన అంశమేమంటే స్త్రీలు ఈనాడు ఏ దేశంలో వున్నా సమస్యల స్వరూపాలు భిన్నమైనప్పటికి స్వభావాలు మాత్రం ఒకటిగానే ఉంటాయి.

ఎందుకంటే స్త్రీలయొక్క అనుభవాలు, అనుభూతులు, సెంటిమెంట్లు, స్పందనలు వీటిలో తేడాలుండవు. వివాహం, కుటుంబం, మాతృత్వం, ఆర్థికావసరాలు, సాంఘిక సంబంధాలు – ఇవి ఎక్కడ వుంటాయో అక్కడ సమస్యలు ఉత్పన్నమౌతాయి. సమస్యల పరిపక్వ పరాకాష్ఠ దశను సూచించే చైతన్యం ప్రతిఘటన ఈ రెండు ఎక్కడ ఉంటాయో అక్కడే ఉద్యమాలు ఊపిరిపోసుకుంటాయి. ఫెమినిస్టు ఉద్యమం అట్లా పుట్టిందే.

అయితే స్త్రీల సమస్యల్ని కేవలం సమస్యలుగానే చూడకుండా వాటి యొక్క మౌలిక రాజకీయ తత్వాన్ని విశ్లేషణాత్మకంగా గుర్తించి మౌలికమైన ప్రశ్నల్ని రేకెత్తించడమే తమ ధ్యేయంగా ఫెమినిస్టులు చెబుతూ వుంటారు. సమాజంలోని సాంఘిక సంబంధాలను ముఖ్యంగా స్త్రీ, పురుష సంబంధాలను కుటుంబంలో అమలులో ఉన్న పురుషాధికారాన్ని మౌలికంగా ప్రశ్నించడం ఈ వాదం యొక్క ముఖ్యోద్దేశం. విశ్లేషణ - విమర్శనాత్మకత ఈ రెండు ఫెమినిజానికి రెండు కళ్ళు. నిర్వచన రూపంలో చెప్పాలంటే "ఫెమినిజం ఒక విశ్లేషణా పద్ధతి. జీవితాన్ని రాజకీయాలను అర్థం చేసుకునే ఒక విధానం. స్త్రీ యొక్క వ్యక్తిగత అనుభవాల ద్వారా కలిగిన అవగాహనతో రాజకీయ పరిష్కారాల్ని సూచించే ఒక సాధనం ఈ విశ్లేషణ నింగినుంచి కాక నేలనుంచి మొదలౌతుంది. ఒకే ఒక వాక్యంలో చెప్పాలంటే సమాజంలో స్త్రీ పరంగా ఆర్థిక రాజకీయ నైతిక రంగాలలో మౌలికమైన మార్పుల్ని కోరడమే ఈ ఉద్యమం యొక్క పరమోద్దేశం."

ఎప్పుడైతే మనం సమస్యల మౌలికాంశాల్లోకి వెళతామో వాటికొక చారిత్రక నేపథ్యం తప్పనిసరిగా వుంటుంది. వాటికొక సిద్ధాంతమూ వుంటుంది. అది ఉద్యమానికి కరదీపికలాంటిది. ప్రపంచ వ్యాప్తమైన ఈ ఫెమినిస్టు ఉద్యమానికి మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, ఎల్. హెచ్. మార్గన్, షీలారోజోతమ్, ఎలిసన్, ఎమ్. జగ్గర్, గైల్ రూబిన్ వంటి ఆర్థిక సాంఘిక రాజకీయశాస్త్రవేత్తల సిద్ధాంతాలే ఆయువుపట్టులు. ఇవి సాంఘిక ఆర్థిక జీవితాన్ని నడిపించే శక్తుల్ని విశ్లేషించి తద్వారా ఒక కార్యక్రమాన్ని ఉద్యమాలకు అందిస్తాయి. ఇలాంటి చారిత్రక సిద్ధాంతాల

వెలుగులో శాస్త్రీయ అవగాహనతో సమస్యల్ని విశ్లేషించి విమర్శించే విధానంపై ఫెమినిజం యొక్క శక్తి ఆధారపడి వుంటుందని వాళ్ళు నమ్ముతారు.

## స్త్రీవాదం - ప్రధాన ఆలోచనలు

స్త్రీవాద ధోరణిలోని ప్రధానమైన ఆలోచనలు :

1. పితృస్వామ్య వ్యవస్థలోని స్త్రీ పతనాన్ని, పురుషాధిక్యతను నిర్మాణ పరంగానూ భావజాల పరంగానూ చారిత్రక నేపథ్యంలో గుర్తించిన ఫెమినిసులందరూ పురుషాధిపత్యాన్ని నిర్మూలించాలని కోరతారు. వారికి కసి పురుషులపైనకాదు, పురుషాధిక్య వ్యవస్థపైన. ఆ భావజాలం ద్వారా పెట్టుబడి మానవులను విభజించి పాలిస్తున్నది. సమాజ ఆర్థిక వ్యవస్థ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థగా మారినప్పుడు జరిగే సాంస్కృతిక విప్లవం ద్వారా పురుషాధిపత్యం పోతుందని మార్క్సిజం చెబుతుంది.

2. సెక్సుకూ జండర్‌కూ మధ్య ఉన్న తేడాను తేటతెల్లం చేయడం. సెక్స్ అన్నది శారీరకంగా ఆడ-మగ భేదాలను గుర్తించి చెబుతుంది కాబట్టి అది సహజమైనది. జండర్ అన్నది సాంఘికంగా, సాంస్కృతికంగా స్త్రీత్వ లక్షణాలనూ స్వభావాలనూ పురుషత్వ లక్షణాలనూ స్వభావాలనూ వేరువేరుగా ఏర్పరచి పురుషుల్ని పురుషులుగా, స్త్రీలను స్త్రీలుగా తయారు చేస్తుంది.

3. లైంగికత్వంయొక్క రాజకీయ స్వభావాన్ని నొక్కి చెప్పడం, రాజకీయ తత్త్వవేత్తలందరూ నిర్లక్ష్యం చేసిన సంతానోత్పత్తి లైంగికత్వం అన్న విషయాలను ఫెమినిస్టులు గుర్తించి పట్టించుకున్నారు. లైంగికత్వం, సంతానోత్పత్తి, ఇంటి చాకిరి - ఇవన్నీ స్త్రీల వ్యక్తిగత విషయాలు కావు. రాజకీయాలతో ముడిపడ్డ విషయాలు. లైంగిక సంబంధాలలోని అసమానతల యొక్క రాజకీయ స్వభావాన్ని గుర్తించి దానికి పోరాట రూపాన్నివ్వాలని రాడికల్ ఫెమినిస్టులంటారు. సమాజ రాజకీయ ఆర్థిక వ్యవస్థలో సంతానోత్పత్తి లైంగికత్వం అనేవి ముఖ్యమైన నిర్ణాయకాంశాలుగా గుర్తిస్తారు. "వ్యక్తిగతం కూడా రాజకీయమే" అన్న నినాదమే దీని సారాంశం.

4. కుటుంబాన్ని ఒక ప్రైవేటు యూనిట్‌గా కాకుండా సాంఘిక

పరమైన యూనిట్‌గా పరిగణించడం. భౌతికవాదం ప్రకారం ఉత్పత్తి అనగానే ఆహారం, బట్టలూ, ఇల్లూ మొదలైనవే గుర్తింపబడుతున్నాయి. కాని లైంగిక తృప్తి, సంతానోత్పత్తి, పిల్లల పెంపకం, ఇంటి చాకిరి మొదలైన వాటిని ఉత్పత్తిలో భాగంగా చేర్చడంలేదు. కనుక స్త్రీ విముక్తి అసాధ్య మౌతున్నది. స్వేచ్ఛా సమాజానికి ఉత్పత్తి మీద శ్రామికుల కంట్రోలు మాత్రమే సరిపోదు. సంతానోత్పత్తిలో కూడా ప్రజాతంత్ర విధానం ఉండాలి. పునరుత్పత్తి ప్రజాస్వామ్యం కావాలంటారు సోషలిస్టు ఫెమినిస్టులు.

## స్త్రీవాద సాహిత్య ఆవిర్భావం

ఇలాంటి ఆలోచనలు, సిద్ధాంతాలు ప్రజల్లోకి వెళ్ళడానికి సాహిత్యం ఒక శక్తివంతమైన సాధానంగా ఉపయోగపడుతుంది. ఒక వైపు సిద్ధాంత పరమైన సాహిత్యాన్ని ప్రచారం చేస్తూనే మరోవైపు తమ భావాభివ్యక్తీకరణకు, ప్రచారానికి ముఖ్యంగా కవిత్వాన్ని సాధనంగా గ్రహిస్తున్నారు. తమ కలాలనూ గళాలనూ విప్పుతున్నారు. పెన్నునే గన్నులాగా పురుషాధిక్య సమాజంపై గురిపెడుతున్నారు. స్త్రీల సమస్యలకు భిన్నమైన పద్ధతిలో ప్రతిస్పందిస్తూ కొందరు కవయిత్రులు ఒక నూతన దృక్కోణం నుండి కవిత్వాన్ని రాస్తున్నారు. స్త్రీ మాత్రమే చెప్పగలిగిన విషయాలను కవితావస్తువులుగా గ్రహించి స్త్రీ దృష్టి నుండి కనిపించే స్త్రీ ప్రపంచాన్ని ఏమీ దాపరికం లేకుండా ప్రదర్శిస్తున్నారు. చాలా కవితా ఖండికల్లో ఆర్తి ఉంది, ఆర్ద్రత ఉంది, ఆవేదన ఉంది. ఆవేశముంది. అన్నిటినిమించి సాంఘిక ప్రయోజనముంది. భాషాపరంగా చూస్తే శబ్ద ప్రయోగంలో శక్తి, భావవ్యక్తీకరణంలో యుక్తి, శబ్ద శిల్పం మీద రక్తి కన్పిస్తాయి.

మరొక్క విషయం కూడా మనం గమనించాలి. లోకంలో పురుష ఫెమినిస్టులు కూడా ఉన్నారన్న మాట మరిచిపోకూడదు. చాలా వరకు వీరంతా అభ్యుదయ వాదులు. జీవితంపట్ల ఒక శాస్త్రీయమైన అవగాహన కలవారు. అటు సామాజికంగానూ, ఇటు స్త్రీపరంగానూ మౌలికమైన మార్పుల్ని కోరేవారు. మొదటితరంలో ముఖ్యంగా చెప్పుకోతగిన వాళ్లు చలం, కొడవటిగంటి కుటుంబరావు. కుటుంబరావుగారి స్త్రీవాదం ఈనాటి

రచయిత్రుల్లో చాలామంది పుట్టకముందే పుట్టింది. వీరి స్త్రీవాదం చాలా మందికి మింగుడు పడదు. ఒక్క వ్యాసంలోని ఉదాహరణ మచ్చుకి చూపిస్తాను. "ఆడది తన భర్తమీద ప్రేమకొద్దీ తన పిల్లలమీద ప్రేమకొద్దీ వాళ్లకు చాకిరీ చేస్తుందనడం ఒక కుంటిసాకే. పైపెచ్చు చాలా వరకు అబద్ధం. తమ తల్లిదండ్రులను దివాళా ఎత్తించి కట్నం గుంజి తనను పెళ్లి చేసుకున్నవాడిని ఏ స్త్రీగాని ప్రేమించవలసిన అవసరం లేదు. పెళ్ళి చేసుకోకుండా స్త్రీ స్వేచ్ఛగా బ్రతికే అవకాశాలు దాదాపు శూన్యంగా ఉన్న ఈ వ్యవస్థలో స్త్రీ తన భర్తను హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నదీ అంటే పోలీసులు అనుమానితుల్ని చిత్రహింసలు పెట్టి తాను నేరం చేశానని ఒప్పించడం లాంటిది. ఆడది స్వేచ్ఛా వాతావరణంలోనే ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. పెళ్ళి అన్నది నిర్బంధంగా జరిగినంత కాలం ప్రేమ ప్రస్తావన అప్రస్తుతం" (1975 ఫిబ్రవరి - ఆంధ్రజ్యోతి మాస పత్రిక).

స్త్రీవాద కవిత్వాన్ని మనం పరిశీలించినప్పుడు అది వ్యక్తిగతంగా పురుషాధిపత్యాన్ని ప్రశ్నించే ధోరణి నుండి వ్యవస్థాగత రాజకీయాలతో సంఘర్షించేవరకూ విభిన్న దశల్లో ప్రతిబింబిస్తున్నది. అలాగే పసితనం మొదలు పండుబారిన వయసుదాకా వివిధ దశల్లో స్త్రీ పొందే అనుభూతులు, ఆవేదనలు వ్యక్తీకరింపబడుతున్నాయి.

## వివాహ వ్యవస్థ - ఒక కత్తుల బోను

ఒక ఆడపిల్ల జీవితంలో వివాహమనేది ఒక మధురభావన. అయితే ఈ పురుషాధిక్య వ్యవస్థలో అవన్నీ కల్లలని గ్రహిస్తుంది. వివాహమంటే ఒక విచ్చు కత్తులబోనులాగా, పెళ్ళంటే పెను మంటల్లో దూకడంలాగా ఊహించుకునే పరిస్థితులు చుట్టూరా ఉన్న సమాజం కల్పిస్తున్నది. ఒక ఆడపిల్ల స్వగతం సావిత్రి కవితలో ఇలా వినిపిస్తున్నది.

"పాఠం ఒప్పజెప్పకపోతే
పెళ్లి చేస్తానని
పంతులుగారన్నప్పుడే
భయం వేసింది

ఆఫీసులో నా మొగుడున్నాడు
అవసరమున్నా సెలవివ్వడని
అన్నయ్య అన్నప్పుడే
అనుమానం వేసింది
వాడికేం మహారాజని
ఆడామగా వాగినప్పుడే
అర్థమైపోయింది
పెళ్లంటే పెద్ద శిక్షని
మొగుడంటే స్వేచ్ఛాభక్షుడని
మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తుందని"

ఈ పురుషాధిక్యత సామాజిక పరిభాషలో "పెళ్ళి" "మొగుడు" పదాల అర్థాలు ఎలా వ్యాకోచం చెందాయో అర్థం చేసుకోవచ్చు.

తరతరాలుగా వంటయింటికే అంటుకొనిపోయి వండుతూ వారుస్తూ వడ్డిస్తూ ఏమాత్రం సామాజిక ఉత్పత్తిలో భాగం పంచుకోలేని యాంత్రిక జీవనం స్త్రీ గడిపింది. అయితే ఆధునిక యువతి మారుతున్న విలువలకు అనుగుణంగా ప్రతిస్పందిస్తూ తన స్థానం కేవలం వంటయింట్లో కాదనీ, సామాజిక- చైతన్యపు వెలుగులోకే తన ప్రయాణమని గుర్తించింది. విమల కవితలో వినాలంటే

"మా అమ్మొక ప్రేతంలా తేలుతూ ఉంటుందక్కడ!
అసలుమా అమ్మే నడుస్తున్న వంటగదిలా ఉంటుంది!

కనుక మన పిల్లలకోసం వంటరి వంటగదులు కూల్చేందుకు రండి" అంటూ వంటింటి సంస్కృతిపై యుద్ధం ప్రకటిస్తున్నది.

గజ్జల మల్లారెడ్డిగారు కూడా ఈ సమస్యకి స్పందించారు.

"వంటయిల్లే ఖైదుకొట్టయి
పడకటిల్లే పంజరమ్మై
అందరికి తలవంచి బతికే

అబల సబలగ మారినప్పుడే
స్త్రీ యొక్క బానిస సంస్కృతి బద్దలౌతుం"దన్నారు.

స్త్రీ వేధింపు చర్యలు ఈనాడు అనేక విధాలుగా సాగుతున్నాయి. సంఘ వ్యతిరేకశక్తులు, రౌడీలు, ఆకతాయి ముఠాలు ఈ దుశ్చర్యలకు పాల్పడుతున్నారు. దీనికి కారణం స్త్రీ కేవలం భోగ్య వస్తువనే అనారోగ్య భావన. ఈ వస్తువు ఆధారంగా కొన్ని కవితలు వెలువడ్డాయి. కొల్లూరి "స్త్రీ" అనే ఒక వచన కవితా ఖండితలో

"అడవి మృగాల మధ్య నుండీ
నిలువునా చూపులతో పొడుచుకుతినే కాకులనుండి

ఈ విషనాగరిక ప్రపంచపు అంచులపై బ్రతుకు" సాగిస్తూనే ఉంటుందని సమస్యను ఒక సమస్యగానే మన ముందుంచారు. అయితే కవయిత్రి జయప్రభ మరో అడుగు ముందుకు వేసి ఆ చూపుల్లోని వికృతిని భయంకృతిని అసహ్యాన్ని ఎదుర్కొని ఎలా ప్రతిఘటించాలో కూడా సూచించారు.

"ఇప్పుడు ఆ కళ్లని వెంటాడటానికి
కళ్లతోనే యుద్ధం చేస్తాను; కళ్లకే కాదు
ఈ దేశంలో ఆడదాని
వళ్లంతా ముళ్లుండే రోజు

ఎప్పుడొస్తుందా" అని ఎదురుచూస్తున్నానని తన ఆవేదనని వ్యక్తం చేశారు.

## వేదన - కసి రంగరించి...

లింగ నిర్ధారణ పరీక్షను మూలంగా చేసుకొని ఈ వ్యవస్థలోని స్త్రీయొక్క అస్తిత్వవేదనను ఈశ్వరి, పాటిబండ్ల రజని - వీరిద్దరూ భావించిన తీరు అద్భుతంగా ఉంది. ఒక మాతృమూర్తి నోట ఆవేదన ఇలా అక్షర రూపం దాల్చింది.

"నీకూ మంచి రోజులొస్తున్నాయిరా కన్నా
ఆడదిగా పుట్టానని
అడవిలో మానైనా కాలేనని
విలపించే రోజులు
పోతున్నాయిలే తల్లీ ఎందుకంటే
నీవు అమ్మ పొట్టలోంచి
బైటికేరావుగా (ఈశ్వరి)

కడుపు చుమ్మలు చుట్టించే ఆ మాతృమూర్తి ఆర్తి మన సంస్కృతిని ఆకాశానికెత్తే నాగరిక సమాజం సిగ్గుపడేటట్లు చేస్తున్నది. మాతృ హృదయాన్ని విలవిలలాడించే గర్భవిచ్ఛిత్తి గురించి పాటిబండ్ల రజని కవితలో ఆక్రోశం కనిపిస్తుంది.

"కంసుడి కత్తిలాంటి ప్లాసిక్ బకెట్ మింగిన
ప్లాసర్ ఆఫ్ పారిస్ ముద్దలాంటి నిన్ను చూసి
మళ్ళీ నా పొత్తిళ్ళలో పొదువుకోవాలనీ
పాలకై తడువుకునే పెదవులుగా
అమ్మకై వెదుక్కునే చూపులుగా చెక్కుకోవాలనీ
ఇంత సుఖంగా నిన్ను చంపుకునే మార్గం
కనిపెట్టిన వీళ్ళ ముఖాలపై
ఉమ్మనీళ్ళతో ఉమ్మియ్యాలనీ వెర్రి ఆవేశంగానూ ఉందిరా"

-ఒకే సన్నివేశానికి సంబంధించిన ఈ రెండు కవితల్లో మొదటి దాంట్లో ఆలోచనను ప్రేరేపించే శక్తి ఉంది. గాంభీర్యముంది. రెండో దాంట్లో ఆవేశమూ, దానితోపాటు ఈ వ్యవస్థపై కసి, ఆక్రోశం కనిపిస్తాయి.

## వ్యవస్థ యొక్క అనేక వికృత రూపాలు

ఈ వ్యవస్థయొక్క అనేక వికృత రూపాలో వేశ్యావృత్తి ఒకటి. ఈ సామాజిక రుగ్మతను అతిశక్తివంతంగా వ్యక్తీకరించగలిగిన కవయిత్రులు ఘంటసాల నిర్మల, ఓల్గా వీరిద్దరూ కూడా సజీవ సంఘటనలకు స్పందించి వాళ్ళ స్వగతాలకు అక్షర రూపాన్నిచ్చినవాళ్లే.

ఓ సాయంత్రం విజయవాడ సెంటర్లో మెతలో వేశ్యల బోర్డు కట్టి ప్రదర్శించిన సంఘటనకు బలంగా స్పందించిన నిర్మల ఇలా రాశారు.

"వేల వేల వీర్యాల వర్షాల్ని
కళ్ళుమూసుకునైనా భరిస్తున్నదాన్ని

రంగులు చిట్లిన రతి రోతకు జ్వలిస్తున్నదాన్ని" అంటూ ఒక పడుపు కత్తె తన బతుకులోని జుగుప్సతోపాటు తనపై తనకున్న విశ్వాసాన్ని కూడా ప్రకటిస్తుంది.

హైదరాబాద్‌లోని మెహందీ బజారులో ఒకనాడు ఒకడు ఒక అమ్మాయి వద్దకు వచ్చి పడిపోయి ఆ తరువాత ఆస్పత్రిలో మరణించాడు. ఆ నెపంతో పోలీసులు ఆ వాడలో భీభత్సాన్ని సృషించిన సందర్భంలో వాళ్ళను పరామర్శించడానికి వెళ్ళిన రచయిత్రి శ్రీమతి ఓల్గా ఆ స్త్రీల విజ్ఞప్తి మేరకు పత్రికలో ఆ వార్తకు కవితారూపాన్నిచ్చి ప్రకటించారు.

"ఓ మగమదమృగాల్లారా
మీరు మీ ఇళ్ళలో చావ డి
మీరు మీ భార్యల ఒళ్ళలో చావండి
మీ తల్లుల గుండెలపై చావండి
మీరు చావటానికి మా దగ్గరకు రాకండి
బతకటానికి నానా చావూ చస్తున్నవాళ్ళం"

ఈ కొసమెరుపు ఎంత శక్తివంతంగా ఉందో గమనించాలి. అలాగే శారీరకంగా, మానసికంగా గాయపడ్డ వేశ్యల గుండెల చప్పుళ్ళ స్వగతా లను బి. మల్లికార్జున్‌గారు వినిపించారు. ఈ యాంత్రిక యుగంలో ఆత్మీ యతలు అనుబంధాలు తలక్రిందులౌతున్న ఈ వ్యవస్థలో తల్లికున్న స్థానం ఎలాంటిది ? తన జీవితాన్నంతా మురిపాల బిడ్డల కోసం ముడుపుకట్టి కష్ట పడి పెంచి యోగ్యులుగా తీర్చిదిద్దాననుకుంటుంది. అయితే జీవిత సంధ్యా సమయంలో శారీరకంగా మానసికంగా అలసిపోయిన దశలో ఎవరికీ అక్కరలేని అమ్మ మానసిక క్షోభ సునీత కవితలో

## తల్లికున్న స్థానం ఏమైంది ?

"కడుపున కన్న వాళ్లు
కసురుకున్నందుకు
పేగు చించుకు పుట్టినవాళ్లు
ప్రేమ భిక్షరాల్చనందుకు
ఎదిగిన బిడ్డల మధ్య
ఏకాకి అయినందుకు
పసిపిల్ల చేష్టలా
అమ్మ అలిగింది".

ఒకనాడు విసుగూ విరామం లేకుండా వండి వడ్డించి తినిపించిన అమ్మ ఈనాడు తినక అలిగినా అడిగే నాధుడే లేడు. ఆ తల్లి ముఖాన్ని జయప్రభగారు 'పూర్తిగా ముడతలు పడిపోయిన తీపి ఖర్జూరపు పండు'తో పోల్చి, ఆ భావ చిత్రాన్ని మన మనసులో శాశ్వతంగా అచ్చొత్తించారు. త్యాగమూర్తి తల్లి ఉనికి విస్మరించే కృతఘ్నుల నుద్దేశించి చిత్రదీపాల కవి ఆచార్య గోపి.

"భ్రష్టుడా !
అమ్మ ఋణం తీరదురా
అమ్మకు అమ్మవై పుడితే తప్ప" అని హెచ్చరించాడు.

## ప్రజాసాహిత్యం : ఒక కొత్త వరవడి

సామాన్య ప్రజానీకంలో నుండి ఉద్యమమే ఊపిరిగా పుట్టిన కవిత్వం మహాశక్తివంతంగా వుంటుంది. ఉద్యమాల్లాగే ఉద్యమకవిత్వం కూడా అట్టడుగు వర్గాలనుంచే ఉబికి వస్తుంది. నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాట కాలం నుంచీ ఈనాటిదాకా ప్రజాసాహిత్యం ఒక కొత్త ఒరవడికి నాంది పలికింది. గ్రామీణ వ్యవస్థయొక్క విషపు కోరల్లో చిక్కుకున్న స్త్రీలు అటు మగవాళ్ళ ఆధిపత్యానికి, అత్యాచారాలకూ, ఇటు భూస్వామ్య దోపిడీకి ద్విముఖంగా బలైపోతున్న ఘట్టాలెన్నో

కవితా రూపాన్ని పొందాయి. ఇలాంటి పోరాట కవిత్వ రచనలో స్త్రీలు ఎక్కువగా పాలుపంచుకున్నట్లు కనిపించదు. వాటిలో శివసాగర్ రాసిన చెల్లీ చెంద్రమ్మా అన్నగీతం, గద్దర్ రాసిన పాటల్లోని "సిరిమల్లె చెట్టు కింద" అన్నగీతం ముఖ్యమైనవి. అత్యాచారాలు అవధిమించిపోయిన స్థితిలో పోరాటాలు పుట్టుకొస్తాయన్న నిజాన్ని చెల్లీ చెంద్రమ్మ నిరూపిస్తుంది. అలాగే గ్రామీణ జీవనంలో దుర్భర దారిద్ర్యం వల్ల స్త్రీ బ్రతుకు ఎలా భారంగా పరిణమిస్తుందో గద్దర్ రచన చెబుతుంది. ప్రజల గుండెల చప్పుళ్ళను డప్పులుగా మార్చి దండోరా వేసిన కవి గద్దర్.

అలాగే రాజకీయ పోరాట అవగాహనతో రాసిన కవిత అనామిక గీతం. ఇందులో సమిష్టి పోరాటాలకు ప్రాధాన్యం కనిపిస్తుంది. ఈ కవితలోని "కాంక్రీటు' పంజరాలకు కట్టిన కుట్ర" అన్న వాక్యంలో దోపిడీ స్వభావమంతా ఇమిడి ఉన్నది. ఇది శ్రామిక సంఘటిత శక్తి నాశ్రయించిన కవిత. అలాగే మార్క్సిస్టు పోరాట చైతన్యంతో విప్లవాత్మకమైన స్త్రీవాద కవితల్ని రాసిన వాళ్ళలో విమలను పేర్కొనవచ్చు. "అడవి ఉప్పొంగిన రాత్రి" కవితా సంపుటిలోని ప్రధాన విషయం వర్గపోరాటం.

ఈ స్త్రీవాద దృష్టి ఇతర ప్రక్రియల్లోకి కూడా విస్తరించింది. ఓల్గా రాసిన ఆకాశంలో సగం అన్న నవల, శ్రీమతి జయప్రభ రాసిన భావ కవిత్వంలో స్త్రీ అన్న సిద్ధాంత వ్యాసం, తెలుగులో ఆధునిక నాటకంపై విమర్శ ఈ దృక్పథంలో వెలువడ్డవే. భావకవిత్వం కూడా పురుషాధిక్య సమాజపు భావజాలం నుండి పుట్టిందేననీ, భావకవి స్త్రీపట్ల ఎంత ప్రేమను ఒలకబోసినా ఆమెను మార్చడంపట్ల ఆసక్తి చూపలేదన్న అంశాన్ని ఒక ఫెమినిస్టుగా ఒక కొత్త వెలుగులో స్త్రీని చూపడానికి సాహసించింది, "నాలుగో గోడ, తెలుగులో ఆధునిక నాటకం" అన్న విమర్శనా గ్రంథంలో తెలుగునాటక రంగం కప్పుకున్న బూటకపు ముసుగుల్ని నిర్మొహమాటంగా తొలగిస్తూ చేసిన రచన అంటున్నారు. సమీక్షకులు, "కథ 91" సంకలనంలో కూడా ఈ స్త్రీవాద ధోరణి కొన్ని కథానికల్లో కనిపిస్తుంది. ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి రెక్కలు, ఆర్. ఎం. ఉమామహేశ్వరరావు రాసిన "బిడ్డలుగల తల్లి", కవనశర్మ "విడాకులు" ఈ కోవకు చెందినవి.

ఈ మధ్య స్త్రీవాద సాహిత్యం ముఖ్యంగా కవిత్వంపై వార్తా పత్రికల్లో వస్తున్న అనుకూల ప్రతికూల విమర్శలు చాలామంది పాఠకుల్లో ఆసక్తిని పెంచుతున్న విషయం విదితమే.

## ప్రతికూల వాదుల సారాంశం

ప్రతికూల వాదాలు ఇలా ఉన్నాయి.

ఈ కవయిత్రులు పాఠకులకు చైతన్యం కలిగించడానికి రాస్తున్నారా? లేక సంచలనం సృష్టించడానికి రాస్తున్నారా ? స్త్రీల వర్గచైతన్యాన్ని దెబ్బ కొడుతూ కేవలం వైయుక్తిక వికారాలకు కవిత్వాన్ని పరిమితం చేస్తున్నారు. ఈ కవితలు మొత్తం స్త్రీ జాతికి ప్రాతినిధ్యం వహించడంలేదు. (ఎస్వీ) అవయవ ప్రతీకలు....శరీరధర్మాలు సృష్టి చర్యలు నీలి కవితల్ని సృష్టిస్తున్నాయి. ప్రపంచ క్రమాన్ని సెక్సుపరంగా చూచే ధోరణి ఆత్మ న్యూనతా భావం నుండి పుట్టిన వికృత ఆవేశానికీ నిరాశా నిస్పృహకు సంబంధించింది. శరీర దృష్టితో సామాజిక ధర్మాన్ని తిరస్కరిస్తున్నారు. సామాజిక స్పృహ కంటే శారీరక స్పృహ పెరుగుతున్నది. (జ్వాలా ముఖి) వీళ్లు తమ కవితల్లో సామూహిక సమస్యలకు ప్రాధాన్యమివ్వకుండా వైయుక్తికి అనుభవాలను జుగుప్సాకరమైన పదజాలంతో వర్ణిస్తున్నారు. సామాజిక భూమికకు దూరమౌతున్నారు.

ఈ ఉద్యమం లింగవివక్షకు పరిమితమౌతున్నది.

ఈ రచనలు స్త్రీల ఆర్థిక సామాజిక రాజకీయ దోపిడీని ప్రతిబింబించడం లేదు.

ఇక అనుకూల విమర్శల్ని చూద్దాం.

ఈనాడు కవయిత్రులు నిస్సంకోచంగా రాయడానికి కావలసిన సాహిత్య వాతావరణాన్ని ఎన్నడో దిగంబరకవులే సృజించారు (చేరా).

కవయిత్రుల గాఢమైన స్వానుభవపూర్వకమైన ఆర్తి, ఆక్రోశం, ఆగ్రహాలు నిర్భయత్వం, నిజాయితీలను అపార్థం చేసుకుంటున్నారు. (వరవరరావు) అనివార్యంగా ఉపయోగించబడే లైంగిక పరిభాష అశ్లీలం కాదు. లైంగిక ప్రేరణను కలిగించనంతవరకు, ఆ సమస్యపట్ల

సానుభూతి కలిగించినంత వరకు లైంగిక పరిభాష, ప్రతీకలు ప్రయోగించడంలో తప్పులేదు (పాపినేని శివశంకర్).

—మొత్తం మీద ఈ సాహిత్యంపై జరుగుతున్న చర్చ విమర్శ యొక్క ప్రమాణాలను పడగొట్టే దిశగా ప్రయాణం చేస్తున్నది. ఇది అంత ఆరోగ్యదాయకం కాదని కొందరు అభిప్రాయ పడుతున్నారు. (కాత్యాయిని)

## వ్యక్తిగత స్థాయికి దిగజారకూడదు

అయితే ఒక్కమాట మాత్రం నిజం. ఈ వాదోపవాదాలు పాఠకుల్లో ఎంతగా ఆసక్తిని పెంచుతున్నాయో అంతగా ఆలోచనల్ని రేకెత్తించడం లేదు. విమర్శ వ్యక్తిగత స్థాయికి దిగజారిపోయి గంభీరమైన స్త్రీ సమస్యనే పక్కదారి పట్టిస్తున్నాయి.

ఏ సాహిత్యం ఎంతకాలం నిలుస్తుంది. ఏ ఉద్యమం ఎంతకాలం జీవిస్తుంది అని జోస్యం చెప్పేది వ్యక్తులు కాదు. ప్రజలు నిర్ణయిస్తారు. ఒక్కమాటలో కాలం నిర్ణయిస్తుంది. కవితారంగంలో కొత్త ధోరణులు తలెత్తినప్పుడు విమర్శ ప్రతివిమర్శలు ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లాగ కవిత్వాన్ని చైతన్యవంతం చేస్తాయి. నిగ్గుతేలుస్తాయి.

అయితే ఆ విమర్శ వ్యక్తిగత స్థాయికి దిగజారకూడదు. స్త్రీలు కవిత్వం రాస్తున్నారంటేనే "ఏ పనీ పాటాలేని ఆడవాళ్ళ సమాన హక్కుల గోల" అని ప్రవచించడం, తిరోగమనమార్గంలో ప్రయాణం చెయ్యడమే ఔతుంది. కవిత్వం రాసే ఆడవాళ్ళంతా గయ్యాళులు అనడం సమస్య గంభీరతను ఎగతాళి చెయ్యడమే ఔతుంది. ఒక రచన స్త్రీదా, పురుషునిదా అని కాకుండా రచనని రచనగా విమర్శించాలి. సిద్ధాంత సమన్వయంలో ఉన్న లోటుపాట్లేమిటి ? కవితా వ్యక్తీకరణలో ఉన్న అవకతవకలేమిటి? అవి సామాజిక ప్రయోజనాన్ని ఎలా దెబ్బతీస్తున్నాయి అని నిష్పక్షపాతంగా కుతర్కాలకు తావులేకుండా, పాఠకుల్ని వక్రమార్గం పట్టించకుండా చేసే విమర్శ ఆహ్వానించతగ్గది.

నిజానికి ఏ రచయిత్రీ కూడా కేవలం ఋతు ధర్మాలకూ, అవయవ ప్రతీకలకూ, సృష్టి చర్యలకు మాత్రమే పరిమితం కాలేదు. మొత్తం రచ

నల్లో ఒక అయిదుశాతం ఈ నీలికవితల్లాంటివి కనిపిస్తాయి. కవితీకరణంలో అనివార్యంగా ఒక సామాజిక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు, ఇక ప్రత్యామ్నాయ పదమేదీ అందుబాటులో లేని సందర్భంతో అలాంటి పదప్రయోగం ప్రమాదకరమేమీ కాదు. "వేల వేల వీర్యాల వర్షాలు" అన్న ప్రయోగం ఒక వేశ్యా వ్యవస్థలోని రుగ్మతకు అద్దం పడుతున్నది. మన సంస్కృతికి మారుపేరుగా చెప్పుకుంటున్న మహాభారతం లోనే ద్రోణాచార్య, కృపాచార్య జన్మ వృత్తాంత సందర్భంలో వీర్యం, శుక్లపాతం, రేతస్కందంలాంటి పదాలు ఎన్నో చోటుచేసుకున్నాయి. అక్కడలేని అభ్యంతరం ఇక్కడ కూడా అవసరంలేదు.

## కొన్ని అభ్యంతరాలు

ఇకపోతే స్త్రీవాద కవిత్వంలో అయిదు శాతమే అయినప్పటికి ఋతుధర్మాల్ని శారీరక ధర్మాల్ని సృష్టి చర్యల్ని అతిగా వర్ణించటంపట్ల నాకు కూడా కొన్ని అభ్యంతరాలున్నాయి. కవిత్వంలో ఆవేశం ఉండాలి కాని ఆ ఆవేశం ఆలోచనను మింగివేసి జుగుప్స కలిగించకూడదు. ఋతు ధర్మ సమయంలో దూరాన్ని పాటించడం ఒక కాలం చెల్లిన మాట. ఏ వర్గ స్త్రీలు కూడా ఇప్పుడు పాటించడంలేదు. అలాగే లైంగిక సంబంధ రుగ్మతలకు స్త్రీ పురుష భేదం లేదు. నిజం చెప్పాలంటే ఈ పదప్రయోగానికి అంతగా ప్రాముఖ్య మియ్యవలసిన అవసరంలేదు. సిద్ధాంత అవగాహనలో లోపాలు, సమన్వయంలో అవకతవకలు, వ్యక్తిగత నిందలు, సెంటిమెంట్లకు లోబడడం, కమిట్‌మెంట్ లేకపోవడం – ఇవి అంతకంటే ప్రమాదకరం. ఇవి స్త్రీవాదాన్నే పక్కదోవ పటిస్తాయి. ఒక వైపు ఫ్యూడల్ వ్యవస్థను దుయ్యబడుతూనే మరోవైపు చకోరాలు, హంసలు, జలతారు ముసుగులు, రుద్రనృత్యం (జయప్రభ) లాంటి పదజాలాన్ని ప్రయోగించడం, ఒకవైపు పురుషాహంకార స్వభావాన్ని చిత్రిస్తూనే మరో వైపు సెంటిమెంట్లకు తలవంచడం ఇలాంటి పరస్పర విరుద్ధభావ వ్యక్తీకరణ కనిపిస్తుంది. ఉదాహరణకు ప్రకృతిలో ప్రళయం అన్న కవితలో ఒక చోట

"కపటపు వాగ్దానాలతో
నీ జీవితాన్ని బంధించి
మోసంతో నిన్నొక బానిసగా మార్చి
పెళ్ళి అనే ఊబిలోకి దింపినా

క్షమిస్తావుదేనికి?" అని స్త్రీని ఒకవైపు 'పెళ్ళి' అనేది ఎలా expoit చేస్తుందో చెబుతూనే మరోచోట

"భర్తగా స్నేహితునిగా
నీ ప్రేమ అపురూపం

నీతో జీవితం కవితాగీతం" అంటూ ఆ భావజాలానికి తలవంచడం చూస్తే వీళ్ళకు ఒక కమిట్‌మెంటు ఉందా అనిపిస్తుంది. ఇలాంటి రాతలకు పాఠకులు అయోమయంలో పడిపోతారు. ఎంత ఫెమినిస్టయినా వ్యక్తిగతానుభూతులు, అనుభవాలు ఎవరికీ తప్పవు. వాటిని మనసులోనే భద్రపరచుకోవాలి. కాని రాతల్లో కెక్కించి రాజకీయం చేయకూడదు. పరిశీలించి చూస్తే ఇలాంటి అవకతవకలున్నాయి.

ఈ సాహిత్యం యొక్క వయసు చాలా చిన్నది. తప్పటడుగులు తప్పవు. ప్రాథమిక దశలో ఉన్న ఏ ఉద్యమ కవిత్వమైనా, ఆటుపోట్లకు గురికాక తప్పదు. ఎప్పటికప్పుడు పాఠకుల, ప్రజల నాడిని గమనిస్తూ ఆత్మ విమర్శ చేసుకుంటూ పురోగమించడంపైనే దాని భవిష్యత్తు ఆధారపడి వుంటుంది.

—గుంటూరులో 1992 నవంబరు 14, 15 తేదీలలో జరిగిన
అరసం మహాసభలో ప్రసంగం

# స్త్రీవాద కవిత్వం - ఒక పరిశీలన

డాక్టర్ యస్వీ. సత్యనారాయణ
(ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి)

దాదాపు పది సంవత్సరాల నుంచి ఒక ప్రత్యేకమైన ఉధృతమైన ధోరణితో 'స్త్రీవాద కవిత్వం' వెలువడుతున్నది. పురుషులు కూడా స్త్రీ వాదానికి అనుకూలంగా స్పందించడం, స్త్రీలు తమ సమస్యలను ప్రతిభా వంతంగా ప్రకటించడం ఈ కవితా ధోరణికి గీటురాయి. స్త్రీవాద కవిత్వం స్త్రీ పురుషుల పరస్పర సమస్యలు, పెళ్ళి, లైంగికత్వం, మాతృత్వం, సంతానోత్పత్తి, ఇంటి చాకిరీ, పితృస్వామ్యం, పురుష దురహంకారం, శరీరం, శరీర అవయవాలు, శరీర ధర్మాలు మొదలైన అనేక అంశాలను ప్రధానంగా చిత్రిస్తున్నది.

అభివ్యక్తిలో ఇప్పుడు సంకోచాలు తొలగి స్వేచ్ఛా వాయువులు వీస్తున్నాయి. ఇది ఆహ్వానించదగిన పరిచయం. భావ ప్రకటనలోనూ, అభివ్యక్తిలోనూ, పదచిత్రాలను పొదగడంలోనూ స్త్రీవాద కవయిత్రులు అద్భుతమైన విజయాన్ని సాధించారు. కొండేపూడి నిర్మల, ఓల్గా, ఘంటసాల నిర్మల, పాటిబండ్ల రజని, విమల, రత్నమాల, మందరపు హైమవతి, వసంత కన్నాబిరాన్ మొదలైన కవయిత్రులు తమ కవితల్లో మధ్య తరగతి స్త్రీల మనోభావాలను, సమస్యలను, ఆలోచనల పరిణామాలనూ శక్తివంతంగా ప్రకటిస్తున్నారు. పురుషాధిక్య సామాజిక విలువలను నిలదీసి ప్రశ్నిస్తున్నారు. వీటిపై యుద్ధం ప్రకటిస్తున్నారు. ఇది హర్షించదగిన సాహిత్య పరిణామమే.

సాహిత్య, సామాజిక రంగాల్లో ఏ కొత్త ధోరణి ప్రవేశించినా, అది మొదట్లో కొంత అతివాద దుందుడుకు నినాదాలతోనే ప్రవేశిస్తుంది. విపరీత స్వభావాన్ని ప్రదర్శించే వారు ఆ ధోరణికి ప్రధానమైన ప్రతినిధులుగా చెలామణి అవుతారు.

ఎమర్జెన్సీ తర్వాత క్రమంగా రెండు ప్రధానమైన ధోరణులు తెలుగు కవితా రంగంలో దూసుకువచ్చాయి. 70-80 దశకాల మధ్య కాలంలో విప్లవ సంస్థల్లో, విప్లవ సాహిత్య సంస్థలో క్రియాశీలంగా పనిచేసిన కొందరు రచయితలు, ఒక దశాబ్ద కాలంలో ఈ దేశంలో విప్లవం వచ్చేస్తుందని భావించినవారు విప్లవం రాకపోగా, విప్లవోద్యమంలో ఏర్పడిన చీలికలు, విభేదాలు, ఒడిదుడుకులు; వీటికి తోడు రోజురోజుకూ పెరుగుతున్న రాజ్యహింస, అణచివేత మొదలైన వాటితో నిరాశ చెంది క్రమంగా దళితవాదం, స్త్రీవాదం వంటి ధోరణులతో ప్రభావితులౌతున్నారు. తమ స్వీయ అనుభవాలను, అనుభూతులను కవితా రూపంలో వ్యక్తీకరిస్తున్నారు. విప్లవ భావాలతో సంబంధంలేని వారు కేవలం శిల్ప ప్రధానమైన రూపవాద కవిత్వాన్ని ఆశ్రయిస్తున్నారు.

దళితులే దళిత కవిత్వాన్ని రాయగలరు, స్త్రీలే స్త్రీవాద కవిత్వాన్ని రాయగలరు అనే పరిమితులను విధించుకోవడం పాక్షిక సత్యమే అవుతుంది. కేవలం పుట్టుకతో దళితుడా ? స్త్రీయా అనేది మాత్రమే కాదు, వారి ఓరియంటేషన్ ప్రాతిపదిక కావాలి. దళితేతరులంతా దళితుల శత్రువులే అనడం ఎంత అర్థరహితమో, పురుషులంతా స్త్రీలకు శత్రువులే అనడం, తరతరాల శత్రువులనడం, వర్గ శత్రువు కన్నా దుష్ట శత్రువుగా అభివర్ణించడం అంతే అర్థరహితమౌతుంది.

గురజాడ, చలం, కొడవటిగంటి కుటుంబరావు, ఉప్పల లక్ష్మణ రావు, మహీధర రామ్మోహనరావు వంటి రచయితల రచనలో స్త్రీవాద ధోరణులు అప్పట్లోనే చోటుచేసుకున్నాయి. వీరేకాక వట్టికోట ఆళ్వార్ స్వామి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలుకొని జాతీయోద్యమ కాలంలోనూ, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం, ఆంధ్రోద్యమం, శ్రీకాకుళం సాయుధ, రైతాంగ పోరాటకాలాల్లో వెలువడిన కవిత్వంలోనూ, ఇతర సాహిత్య ప్రక్రియల్లోనూ ఆయా ఉద్యమ విశేషాలు ఉన్నప్పటికీ,

స్త్రీల సమస్యలు అనుషంగికంగా చిత్రింపబడ్డాయి. స్త్రీలను కించపరిచే ధోరణిని ఉద్యమ సాహిత్యం సృష్టించలేదు. పైగా ఆయా ఉద్యమాల్లో స్త్రీల భాగస్వామ్యాన్ని ల క్రియాశీల కార్యాచరణను ప్రశంసించడం కనబడుతున్నది.

ఒక కొత్త ధోరణి సాహిత్య రంగంలో ప్రవేశిస్తున్నప్పుడు ప్రశంసలూ, విమర్శలూ రెండూ ఎదురౌతాయి. దిగంబర కవిత్వం ఉధృతంగా వెలువడుతున్న రోజుల్లోనే రాచమల్లు రామచంద్రారెడ్డి ఆ ధోరణిపై 'సంవేదన' పత్రికలో అంతే ఉధృతంగా దాడి చేశారు. అది వర్గశత్రువు దాడి కాదు. సాహిత్య విమర్శకుని ప్రతిస్పందన మాత్రమే అలాగే స్త్రీవాద కవిత్వంలోని ప్రగతి అనుకూల వ్యక్తీకరణలను, సాధిస్తున్న శిల్పపరిణతిని ప్రశంసిస్తూనే, ఈ కవిత్వంలో ప్రబలమౌతున్న కొన్ని అభ్యంతరకర వ్యక్తీకరణలపై వెలువడిన విమర్శలను 'పోలిసింగ్', 'సెన్సారింగ్'లుగానో, శత్రు పూర్వక దాడిగానో కాకుండా ఆత్మవిమర్శ పూర్వకదృష్టితో అర్థం చేసుకునే సంయమనం ఉద్యమకారులకు అవసరం. చికాకుపడడం, చికాకు ప్రదర్శించడం ఉద్యమకారుల లక్షణం కాదు. అవయవ ప్రతీకలు, శరీర ధర్మాలు, ప్రపంచ క్రమాన్ని సామాజిక దృక్కోణంతో కాక, సెక్స్‌పరంగా, అవయవపరంగా మాత్రమే చూసే పరిమిత దృష్టి స్త్రీవాద కవిత్వాన్ని ఏ దిశకు నడుపుతుంది? 'ఆత్మహత్యా నా నిరసన' అంటూ స్త్రీని పెరగనివ్వని ప్రపంచం మీద, బ్రతక నివ్వని కాలుష్యం మీద, కసి, కన్నీళ్ళు కలిసి, బ్రద్దలైన భయంకర నిరసన ప్రతిఘటన పోరాటాన్ని నిర్దేశించాలో, ప్రాణాన్ని ఉరితాడుతో బిగించే ఆత్మహత్యామార్గాన్ని నిర్దేశించాలో స్త్రీవాద రచయితలు ఆలోచించాలి. యువతరంలో నిస్పృహ కలిగే వాస్తవికతను చిత్రించడం వల్ల ఈ కవిత్వం ఏ ప్రయోజనాన్ని ఆశించగలదు? మనం ప్రయాణం చేసే బాట, మార్గం మాత్రమే ముఖ్యమనీ, మన గమ్యాలు మన సాధనాలను అప్రధానాలనీ ప్రకటించడం ఏ వెలుగులకి ప్రస్థానం? సిద్ధాంత అవగాహనా రాహిత్యం, సామాజిక, ఆర్థిక రాజకీయ పరిణామాలతో సంబంధం లేని అనిబద్ధత వల్ల స్త్రీవాద కవిత్వం ఏ ఆదర్శాలు ముందుకు తీసుకుని వస్తుంది?

జీవిత వాస్తవికతను, కొంతమేర సవిమర్శక వాస్తవికతను ప్రతిభా

వంతంగా చిత్రిస్తున్న స్త్రీవాద కవిత నేడు తన దిశను నిర్దేశించుకోవలసిన అవసరం ఉంది.

నేడు స్త్రీవాద కవిత్వం, స్త్రీవాద సాహిత్యం ఒక ధోరణిగా మాత్రమే కాదు – ఒక ఉద్యమంగా ఎదిగే దశను చేరాయి. ఏ సాహిత్యోద్యమానికైనా, మతోద్యమానికైనా, రాజకీయోద్యమానికైనా నిబద్ధ నాయకత్వం, నిర్దిష్టమైన ప్రాపంచిక దృక్పథం అవసరం. తాత్విక ప్రాతిపదిక లేని ధోరణి కానీ, ఆందోళన కానీ ఉద్యమ దశకు చేరకుండానే, కొంత కాలం సంచలనం సృష్టించి క్రమంగా చల్లారిపోతుంది. ఉదాహరణకు గురజాడ - చలంల విషయాన్ని పరిశీలిస్తే....'దేశమంటే మట్టికాదు మనుషులు' అన్న స్పష్టతతోపాటు, 'యెల్లలోకము ఒక్క ఇల్లై, వర్ణభేదములెల్ల కల్లై' అని ఉదయించ నున్న నూతన సమాజానికి సంబంధించిన ప్రాపంచిక దృక్పథాన్ని గురజాడ స్పష్టంగా చెప్పాడు. ఆయన సాహిత్యం సమకాలీన సాహిత్యవేత్తలను కాకపోయినా, అనంతర సాహిత్యలోకాన్ని ప్రభావితం చేయగలిగింది. కాల్పనిక సాహిత్యంలో లేని 'పీడిత జనపక్షపాతం, శ్రామికవర్గ చైతన్యం, సామాజిక న్యాయం, సమసమాజ నిర్మాణాకాంక్ష, సోషలిస్టు వాస్తవికత' మొదలైన కొత్త ఆదర్శాలను తెలుగు సాహిత్య ప్రపంచానికి అందించిన అభ్యుదయ సాహిత్యోద్యమానికి - గురజాడ ప్రాపంచిక దృక్పథం కరదీపికగా ఉపయోగపడింది.

అదే చలం విషయానికి వస్తే స్త్రీ స్వేచ్ఛకు సంబంధించిన పరిమిత లక్ష్యాలు తప్ప, స్పష్టమైన దార్శనికత లేనందువల్ల ఆయన భావజాలం ఒక సాహిత్య ఉద్యమానికి కావలసిన సిద్ధాంత భూమికనుఏర్పరచలేకపోయింది. అలాగే తెలుగు కవితారంగంలో స్తబ్దతను బద్దలు కొట్టిన దిగంబర కవితా ధోరణికి కూడా ఒక నిర్దిష్టమైన దార్శనికత లేనందువల్ల అదొక ఉద్యమ రూపాన్ని సంతరించుకోలేకపోయింది. అతి తక్కువ కాలంలోనే ఈ ధోరణి నీరసించిపోయింది.

ఇక రాజకీయ రంగంలో పరిశీలిస్తే 1969 నాటి "ప్రత్యేక తెలంగాణా" వేర్పాటువాద ఆందోళన, 1971 నాటి "జై ఆంధ్ర" ఆందోళన గొప్ప సంచలనాన్ని సృష్టించగలిగాయే తప్ప ఉద్యమాలుగా వికసించలేక

పొయాయి. ఈ వేర్పాటువాద ఆందోళనలకు స్పష్టమైన ప్రాపంచిక దృక్పథం లేకపోవడమే ఇందుకు కారణం.

ఇవ్వాళ రెండు **Predominent** ప్రాపంచిక దృక్పథాలు అన్ని ఉద్యమాలకు కావలసిన సిద్ధాంత ప్రాతిపదికలను ఏర్పరుస్తున్నాయి. ఒకటి పెట్టుబడిదారీ ప్రాపంచిక దృక్పథం, రెండవది మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథం. స్త్రీవాద కవిత్వం ప్రగతిశీల దిశలో పయనించడానికి మార్క్సిస్టు దార్శనికతను తన సైద్ధాంతిక పునాదిగా స్వీకరించవలసి ఉంటుంది.

పురుషాధిక్య భావజాలం ఫ్యూడల్ పెట్టుబడిదారీ సామాజిక భావ జాలంలో భాగమే. పెట్టుబడిదారీ సామాజిక ఆర్థిక వ్యవస్థ స్త్రీని ఒక భోగ్య వస్తువుగా, మార్కెట్ సరుకుగా మార్చడమేకాక, వ్యాపార విష సంస్కృతికి కేంద్ర బిందువుగా చేసింది. దీనికి భిన్నంగా సోషలిస్టు సామాజిక ఆర్థిక వ్యవస్థ- స్త్రీ విముక్తి, సర్వతోముఖ వికాసానికి, స్వయం సమృద్ధికి తోడ్పడడంతోపాటు స్త్రీ సంపూర్ణభద్రత, రక్షణ బాధ్యతవహిస్తు న్నది. ఏ కారణం చేతనైనా స్త్రీ తన భర్త నుంచి విడాకులు పొందితే, పిల్లల సంరక్షణ బాధ్యతను సోషలిస్టు సమాజంలో ప్రభుత్వం స్వీకరిస్తుంది. తద్వారా స్త్రీల పరాధీనతను పోగొడుతున్నది. అందుకే తెలుగు నేలపై తలెత్తిన స్త్రీవాద ఉద్యమం, స్త్రీవాద సాహిత్యం సామ్యవాద సామూహిక ఆదర్శాలను స్వీకరించడం ద్వారా సరైన దృక్పథాన్ని సమాజానికి అందించగలుగుతుంది.

1960 దశకంలో "The end of ideology" (దార్శనికాంతం) అనే గ్రంథాన్ని రాసిన అమెరికన్ సామ్రాజ్యవాద లాక్షణికుడు 'బెల్ డానియల్ ' సాహిత్యంలో సిద్ధాంత రాహిత్యవాదాన్ని ప్రచారం చేశాడు. ఎల్. ఆరెన్, లెప్సిలో వంటి అనుచరులను తయారు చేసుకున్నాడు. ఇదే సామ్రాజ్యవాద సిద్ధాంతకర్త 1973లో "The Making of post Industrial society", 1976లో "The cultural contradi-ctions of capitalism" వంటి గ్రంథాల ద్వారా 'నవ్య సిద్ధాంత వాదానికి' దారి చూపాడు. సామ్రాజ్యవాద అనుకూల దార్శనికతను ఆకర్షణీయమైన నినాదాలతో ప్రచారం చేయడం ఇతని లక్ష్యం.

ఇలాంటి నవ్య సిద్ధాంతవాదులు మార్క్సిజం- లెనినిజం ప్రాథమిక సూత్రాలకు తిలోదకాలిచ్చి, వర్గపోరాట రాజకీయాలకూ, కార్యాచరణకు పోటీగా పర్యావరణం, ఫెమినిజం, కులవాదం, మతవాదం, దళితవాదం, జాతి విముక్తివాదం వంటి సమస్యల ప్రాతిపదికపై భావజాలాన్ని ప్రచారం చేస్తున్నారు. 'పెట్టుబడి'పె సమిష్టిపోరు సంధించాల్సిన పీడిత వర్గంలో అన్యకుల ద్వేషాన్ని, అన్యలింగ ద్వేషాన్ని, అన్యమత ద్వేషాన్ని, అన్య జాతి ద్వేషాన్ని రెచ్చగొట్టడం జరుగుతున్నది. తద్వారా వర్గ శత్రువుపై ఉమ్మడి పోరు నిర్వహించాల్సిన చోదకశక్తులను కులం, లింగం, మతం, జాతి ప్రాతిపదికలపై నిలువునా చీల్చడానికి కావలసిన నేపథ్యాన్ని సామ్రాజ్యవాద సిద్ధాంత కర్తలు సృష్టిస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా జనాకర్షక నినాదాలతో, ఒక పథకం ప్రకారం ఈ కృషి జరుగుతున్నది.

దీనికి భిన్నంగా తెలుగు స్త్రీవాద కవిత్వం నిర్దిష్టమైన పీడిత వర్గ దృక్పథంతో స్త్రీల సామాజిక, ఆర్థిక, రాజకీయ దోపిడులకు వ్యతిరేకంగా పోరాటం సాగించాలి. సామాజిక చైతన్యంలో భాగంగానే స్త్రీవాదం చైతన్యాన్ని సంతరించుకోవాలి. అలాగే ఈ వ్యవస్థలో 'స్త్రీ' ఒక unified unit గా లేదు. దళిత, గిరిజన, వ్యవసాయ కార్మిక, రైతాంగ, గనికార్మిక, పారిశ్రామిక, శ్రామిక స్త్రీలు, మధ్య తరగతి మహిళ, ఉద్యోగిని, ఉన్నత వర్గాల స్త్రీలు మొదలైన విభిన్న స్థాయిలలో స్త్రీలు ఉన్నారు. వీరి సమస్యలు కూడా విభిన్నంగానే ఉన్నాయి. అధిక సంఖ్యలో ఉన్న గ్రామీణ రైతాంగం గిరిజన, దళిత స్త్రీల సమస్యలను చిత్రించడంతోపాటు, ముందు ముందు ఆ వర్గాలను సమరశీల పోరాటాలవైపు ఆకర్షించే చైతన్యాన్ని స్త్రీవాద కవిత్వం ఆవిష్కరింప చేయాలి.

# స్త్రీ విముక్తి ఉద్యమ పూర్వాపరాలు - ఒక పరిశీలన

## శ్రీ పరకాల పట్టాభిరామారావు

మన దేశంలో స్త్రీ విముక్తి ఉద్యమం ఏయే పరిణామ దశలలో ముందుకు సాగుతూ వచ్చిందో, స్త్రీలలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక చైతన్యం ఏ విధంగా పెంపొందుతూ వచ్చిందో చారిత్రక దృష్టితో పరిశీలించినప్పుడే, నేటి స్త్రీ విముక్తి ఉద్యమ కర్తవ్యాలను రూపొందించుకోడానికి సమకాలీన సామాజిక, ఆర్థిక పరిస్థితులను శాస్త్రీయ దృష్టితో నిర్ధారించుకోడానికి వీలవుతుంది.

స్త్రీ విముక్తి ఉద్యమంలో వివిధ చారిత్రిక దశలను, ఆయా దశల్లో స్త్రీలు పొందిన చైతన్యాన్ని, సాధించిన విజయాలను కొంత వివరంగానే పరిశీలించుదాం.

## వీరేశలింగం యుగంలో...

కందుకూరి వీరేశలింగం సాంఘిక సంస్కరణోద్యమ ఫలితంగా ఫ్యూడల్ సాంఘిక దురాచారాలకు, ఫ్యూడల్ సంస్కృతికి వ్యతిరేకంగా స్త్రీలు మొదటిసారిగా చైతన్యం పొందారు. బాలికా పాఠశాలలు మొదలయ్యాయి. ఇళ్ళ నుండి పారిపోయి రాజమండ్రి వచ్చి వీరేశలింగం దంపతుల అండదండలతో వితంతు యువతులు పునర్వివాహాలు చేసుకున్నారు. మోసపోయిన యువతులు పతితయువతీ శరణాలయంలో చేరారు. వీరేశలింగంగారు పెట్టిన "సతీహిత బోధిని" పత్రిక వరవడిలో అటుపిమ్మట

అనేకమంది విద్యావంతులైన స్త్రీలు పత్రికలు స్థాపించి, సంపాదకు రాండ్రుగా ముందుకు వచ్చారు. బాలాంత్రపు శేషమ్మగారి "హిందూ సుందరి", పులగుర్త లక్ష్మీ నరసమాంబగారి "సావిత్రి", వింజమూరి వెంకట రత్నమాంబగారి "అనసూయ", కృపాబాయి సత్యనాధమ్మగారి "విద్యావతి", గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి సతీమణి శ్రీమతి రాంబాయి ప్రచురించిన "సౌందర్యవల్లి", రాయసం వెంకట శివుడిగారి "జనానా", కె.ఎన్. కేసరిగారి "గృహలక్ష్మి" మొదలైనవి యిందులో చెప్పుకోదగినవి. ఇవి ఆనాటి స్త్రీలలో విద్యా, విజ్ఞానాలు, సాంఘిక చైతన్యం కల్గించాయి. బండారు అచ్చమాంబ గారి "అబల సచ్చరిత్రమాల", కనుపర్తి వరలక్ష్మమ్మగారి "శారద లేఖలు", కొటికలపూడి సీతమ్మగారి "ఉపన్యాస మాలిక" మున్నగు రచనలు ఎంతో ప్రబోధం కల్గించాయి. వీరేశలింగం, గురజాడ, కొమర్రాజు లక్ష్మణరావు, రఘుపతి వెంకటరత్నం నాయుడు మున్నగు నవయుగాంధ్ర నిర్మాతలు, జాతీయ పునరుజ్జీవనోద్యమ నేతలు తమ సాంఘిక, సాహిత్య పునరుజ్జీవనోద్యమాలలో ఒక ముఖ్య అంతర్భాగంగా స్త్రీ విముక్తి ఉద్యమానికి ప్రేరణ యిచ్చారు. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు దేవదాసీ వృత్తిని, భోగం మేళాల దుష్ట సంప్రదాయాన్ని ఎదుర్కొని, వేశ్యాంగనలకు పెళ్ళిళ్ళు చేయించి, వారిలో చైతన్యం, ఆత్మ గౌరవం తీసుకొని వచ్చారు. అటువంటి వారిలో యామినీ పూర్ణతిలకం వంటి ఎందరో మహిళలు కళావంతుల సంఘాలు స్థాపించి తమ కులం లోని వారిచే వేశ్యావృత్తిని మాన్పించి వివాహాలు చేసుకొనేటట్లు పాటు పడారు. దేవదాసీ నిషేధ చట్టం కొరకు కృషి చేశారు.

తెలుగునాట అసంఖ్యాక మహిళలు చైతన్యం పొంది జాతీయోద్య మంలోకి పెద్ద యెత్తున రావడానికి పూర్వరంగం యిది.

## జాతీయోద్యమ కాలంలో ....

గాంధీజీ నాయకత్వాన 1919-22 సహాయ నిరాకరణోద్యమం, 1930-32 ఉప్పు సత్యాగ్రహం మొదలైన ఉద్యమాలలో ఆంధ్రదేశంలో స్త్రీలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. కల్లు అంగళ్ళ వద్ద, విదేశీ వస్త్ర

 దుకాణాల దగ్గర పికెటింగులలో పాల్గొన్నారు. విదేశీ వస్త్రాలను దహనం చేశారు. ధైర్యసాహసాలతో నిర్బంధాలను ఎదుర్కొన్నారు. పికెటింగ్ చేస్తున్న స్త్రీలపై రంగునీళ్ళు, బురద నీళ్ళు పిచికారీలతో కొట్టి, అరెస్టు చేసి దూరంగా అడవులలో నిర్జన ప్రదేశాలలోవదలి, రౌడీలచే దుర్భాష లాడించి ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం మహిళా సత్యాగ్రహులపై అనేక నిర్బంధాలు అమలు జరిపినా వాటన్నిటినీ ధైర్యంతో ఎదుర్కొని స్త్రీలు పోరాడారు. చంటిబిడ్డలతో జైళ్ళకు వెళ్ళారు. పిల్లలను తల్లులను వేరు చేసినా భరించారు. జైళ్ళలో బిడ్డలను ప్రసవించారు. బంగారంపై స్త్రీలకు సహజంగా వుండే వ్యామోహాన్ని ప్రక్కకు పెట్టి మాగంటి అన్నపూర్ణా దేవీ వంటివారు తమ నగలన్నింటిని గాంధీజీకి యిచ్చి ఆదర్శం నెల కొల్పారు. 1921 లో బెజవాడలో జరిగిన ఈ కాంగ్రెస్ మహాసభలకు తొలిసారిగా స్త్రీలు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు. ఆ తరువాత ఆంధ్ర ప్రదేశ్ అంతటా గాంధీజీకి స్త్రీలు కనకవర్షం కురిపించారు. యలమంచిలి సత్యవతి అనే వితంతు యువతి తన ఒంటిమీదనున్న 100 కాసుల బంగారం సమర్పించింది. స్త్రీలు వంట యింటి కుందేళ్లు కారాదని, జాతీయ విముక్తి పోరాటంలో పురుషులతోపాటు తమవంతు పాత్ర నిర్వహించాలనీ, మూఢనమ్మకాలను, మూఢాచారాలను విడనాడాలనీ, బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, వరకట్నాలు, కన్యాశుల్కం, ఘోషా మున్నగు సాంఘిక దురాచారాలను పటాపంచలు చేయాలని గాంధీజీ నాయకత్వాన జాతీయోద్యమం ఇచ్చిన పిలుపు స్త్రీలలో అపూర్వ చైతన్యం తెచ్చింది. దువ్వూరి సుబ్బమ్మ వంటి బ్రాహ్మణ వితంతు స్త్రీలు వైధవ్యాన్ని సూచించే నైనుపంచె ముసుగులతోనే వేదికలెక్కి, లాఠీచార్జీలకు ఎదురొడ్డి వీరోచితంగా పోరాడారు. గుమ్మిడిదల దుర్గాబాయమ్మ, ఆచంట రుక్మిణి, లక్ష్మీపతి, వేదాంతం, కమలాదేవి, పెద్దాడ కామేశ్వరమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, కనపర్తి వరలక్ష్మమ్మ, కంభంపాటి మాణిక్యాంబ, యామినీ పూర్ణతిలకం, దిగుమర్తి జానకిబాయి, పాలకోడేటి శ్యామలాంబ, సూర్యదేవర రాజ్యలక్ష్మి, భారతిదేవిరంగా, మెల్లీ షోలింగర్, చుక్కమ్మ, సరస్వతిగోరా ఇంకా అనేకమంది స్త్రీలు ఇలా స్వాతంత్ర్య సమరంలో దుమికి అటు పిమ్మట స్త్రీ విముక్తి పోరాటానికి నాంది పలికారు సాంఘిక సంస్కర

జోద్యమానికి, స్త్రీల ఆర్థిక సాంఘిక హక్కుల కోసం పోరాడారు. ఆంధ్ర దేశంలో ఆ మూల నుండి ఈ మూల వరకు జిల్లాల వారీగా ఎంతోమంది మహిళలు ఇలా జాతీయోద్యమంలో పాల్గొని జైళ్లకు వెళ్ళారు.

## మహిళా ఉద్యమ ప్రారంభ దశలో

రాజారామమోహన్‌రాయ్, వీరేశలింగం, గాంధీజీ మొదలైన మహనీయులు యిచ్చిన స్ఫూర్తితో, ముఖ్యంగా జాతీయోద్యమం యిచ్చిన ఉత్తేజంతో స్త్రీలు తమంత తాము సంఘాలు ఏర్పరచుకొని, తమ హక్కుల కోసం పోరాడే చైతన్యం సంతరించుకొన్నారు. ఉమెన్స్ ఇండియన్ ఎసోసియేషన్ పేరుతో అనిబిసెంట్ నాయకత్వాన శ్రీమతి మార్గరెట్ కజిన్స్ 1917 లోనే మహిళా సమాజాన్ని ఏర్పరచారు. ఆనాటి భారత సెక్రటరీ ఆఫ్ స్టేట్ అయిన మాంటెగ్యూ వద్దకు ఈ సంఘంవారు రాయబారం వెళ్ళి స్త్రీలకు ఓటు హక్కు కావాలని కోరారు. 1927లో సరోజినీ నాయుడు, విజయలక్ష్మి పండిట్ మొదలైన వారి నాయకత్వాన ఆలిండియా వుమెన్స్ కాన్ఫరెన్సు (అఖిలభారత మహిళా సంఘం) అనే సంస్థ ఏర్పడి భారత మహిళా ఉద్యమ నిర్మాణానికి ఎంతో దోహదంచేసి ప్రముఖపాత్ర వహించింది. ఆంధ్రలో అంతకుముందే వీరేశలింగం సతీమణి కందుకూరి రాజ్యలక్ష్మమ్మ, కొమర్రాజు లక్ష్మణరావుగారి సోదరి బండారు అచ్చమాంబ మహిళా ప్రార్థనా సమాజాలు, మహిళా విద్యాభివర్ధనీ సమాజాలు, విద్యార్థినీ సమాజాలు అను పేరిట అనేకచోట్ల మహిళా సంఘాలు స్థాపించి స్త్రీ విద్యా వ్యాప్తికి, మూఢాచారాల నిర్మూలనకు కృషి చేశారు. కళావంతుల కుటుంబాలలోని యువతులకు వివాహాలు చేయడానికి, కళావంతుల సామాజిక సంస్కరణల కమిటీ 1926లో ఏర్పడింది. పురుష మహిళోద్ధారకులు మహిళల విముక్తి కోసం పాటుపడే దశనుండి, స్త్రీలు తమంతతాము తమ కాళ్ళపై నిలబడి తమ ప్రత్యేకవేదికలుగా మహిళా సంఘాలను ఏర్పరచుకోవడం, తమ హక్కుల కోసం పోరాడే స్థితికి రావడం, స్త్రీలలో వచ్చిన నూతన చైతన్యానికి, నూతన పోరాట దశకు తార్కాణం.

# సాధించిన అనేక సాంఘిక చట్టాలు

"స్త్రీలలో వచ్చిన ఈ రాజకీయ, సాంఘిక చైతన్యం" ఆ తరువాత స్త్రీల అనర్హతలు తొలిగించే అనేక న్యాయ చట్టాల రూపకల్పనకు దారి తీసింది. బాల్య వివాహాల నిరోధక చట్టం 1929లో చేయబడింది. శ్రీహర విలాస శారదా అనే కేంద్ర శాసనసభ సభ్యుడు ప్రవేశపెట్టిన చట్టం గనుక దీనికి శారదా చట్టం అన్న పేరు వాడుకలోకి వచ్చింది. దీని ప్రకారం 14 ఏళ్ళ లోపు బాలికలకు వివాహం నిషేధించబడింది. డాక్టర్ ముత్తు లక్ష్మి రెడ్డి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఇటువంటి బిల్లునే ప్రవేశపెట్టారు. కాని అది వాయిదా పడింది.

1930లో మద్రాసు శాసనసభలో డాక్టర్ ముత్తు లక్ష్మిరెడ్డి తొలి సారిగా దేవదాసీ వృత్తి (పడుపువృత్తి) నిర్మూలన చట్టం ప్రవేశపెట్టి చట్టం చేయించాడు. కేంద్ర శాసనసభలో 1923లోనే హరిసింగ్ గౌర్ ఇటువంటి చట్టం చేయించారు.

1937 హిందూ స్త్రీల ఆస్తి హక్కు చట్టం వచ్చింది. దీనితో భర్త చనిపోతే భార్యకు ఆస్తిపై హక్కు వచ్చింది. (జీవితాంతం అను భవించే హక్కు మాత్రమే).

దేవదాసీ విధానాన్ని పూర్తిగా నిషేధించడానికి 1937లో శ్రీమతి అమ్మన్న రాజా మద్రాసు శాసనసభలో ఒక బిల్లు ప్రవేశపెట్టారు. అయితే అది 1947లో కాని చట్టం కాలేదు.

ఈ చట్టాల వెనుక మహిళా సంఘాలు చేసిన నిరంతర ఆందోళన, అనేక మహాసభల తీర్మానాలు, విజ్ఞప్తులు ఉన్న విషయం గమనించాల్సి ఉంటుంది.

1940 దశకంలో మహిళా సంఘాలు రావు కమిటీ బిల్లుకు అనేక ముఖ్య సవరణలు ప్రతిపాదించి వేలాది సంతకాలతో మహజర్లు సమర్పించారు. వివాహం, వారసత్వం, దత్తత, బహు భార్యాత్వ నిషేధం మున్నగు అనేక విషయాలపై చట్టాలు చేయబడ్డాయి. ఈ చట్టాలన్నింటికి మూలం మహిళా ఉద్యమ ఆందోళనే.

# వామపక్ష మహిళా ఉద్యమం ప్రారంభం

వీరేశలింగం యుగంలో సంస్కరణ ఉద్యమం అటుపిమ్మట జాతీయోద్యమం యిచ్చిన స్ఫూర్తితో ప్రారంభమైన మహిళా సంఘాలు 1930 రెండవ అర్థభాగం నుండి ఆంధ్రదేశంలో ప్రారంభమైన కమ్యూనిస్టు ఉద్యమం యిచ్చిన తోడ్పాటుతో తొలిసారిగా విస్తృత ప్రాతిపదికపై గ్రామసీమలకు విస్తరించి అసంఖ్యాక కార్మిక, కర్షక స్త్రీలను మహిళా సంఘాలలోకి సమీకరించగల్గాయి. స్త్రీల చైతన్యంతో గుణాత్మకమైన మార్పు తీసుకొనివచ్చాయి. వందలాది మహిళా కార్యకర్తలను కమ్యూనిస్టు పార్టీ తయారు చేసింది. వారికి రాజకీయ శిక్షణా తరగతులను నడిపింది. వీరు వందలాది గ్రామాలలో మహిళా సంఘాలను స్థాపించారు. వీరేశలింగం ప్రారంభించిన సంఘ సంస్కరణ ఉద్యమానికి మహిళా ఉద్యమం వారసత్వం వహించింది.

కాంగ్రెస్ నాయకత్వం క్రింద ప్రారంభమైన బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక పోరాటాన్ని, ఫ్యూడల్ జమీందారీ భూస్వామ్య వ్యతిరేక పోరాటంగా కమ్యూనిస్టు ఉద్యమం విస్తరింపజేసింది. ఫ్యూడలిజాన్ని నిర్మూలించాలంటే ఫ్యూడల్ నాగరికత, సంస్కృతి, దాని అభివృద్ధి నిరోధక సాంఘిక కట్టుబాట్లను, భావజాలాన్ని ఎదుర్కొని పోరాడాలి. స్త్రీల పరాధీన స్థితి, అణచివేత, సాంఘిక అనర్థాలు, సాంఘిక దురాచారాలు, కుల, మత, ఛాందసత్వాలకు వ్యతిరేకంగా పోరాడాలి. సమాజంలో సగ భాగంగా ఉన్న స్త్రీల ఆర్థిక, సాంఘిక బానిసత్వాన్ని, వారి అజ్ఞానాన్ని పారద్రోలాలి. పురుషాధిక్య భావం క్రింద అణగారిపోతున్న స్త్రీలలో విద్యా, విజ్ఞానాలు, వికాసం, వ్యక్తిత్వం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు పెంపొందించాలి.

ఇటువంటి నిర్దిష్ట సామాజిక సిద్ధాంత ప్రాతిపదికగానే కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్రదేశంలో మహిళా ఉద్యమాన్ని ఒక సువిశాల ప్రజాతంత్ర ఉద్యమంగా నిర్మించడానికి సమకట్టింది. వారిలో చైతన్యాన్ని పెంపొందించి, వందలాది కార్యకర్తలను, నాయకత్వాన్ని అభివృద్ధిచేసింది. వీరేశలింగంగారు స్త్రీలను బహిరంగసభలకు తీసుకొని రావడానికి తమ రోజు

లలో ఎంతో శ్రమపడ్డారు. మండల సాంఘిక సభలకు స్త్రీలను తీసుకొని రావడానికి తమ అనుయాయుల ద్వారా ప్రత్యేక కృషి చేసేవారు.

# ఫ్యూడల్ సంప్రదాయ సంకెళ్ళకు స్వస్తి

కమ్యూనిస్టుపార్టీ, వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమానికి వారసత్వం వహించుతూ ప్రతీ కమ్యూనిస్టు తన భార్యని, సోదరిని, తల్లిని మహిళా సంఘాలలో చేర్పించాలనీ, బహిరంగ సభలకు తీసుకొని రావాలనీ, ఘోషా పద్ధతిని విడనాడేటట్లు చేయాలని సర్క్యులర్లు ద్వారా ఆదేశాలు అందజేసేది.

ఈ సందర్భంలో ఆంధ్రదేశంలో జరిగిన కొన్ని ప్రధాన ఘట్టాలను పేర్కొనాలి.

1938లో పశ్చిమ గోదావరి జిల్లా రాజకీయ మహాసభ లంకలకోడేరులో జరిగినప్పుడు అదే వేదికమీద మొదటి జిల్లా మహిళా మహాసభ జరుపబడింది.

ఆ రోజుల్లో క్షత్రియ కుటుంబాలలో స్త్రీలకు ఘోషా విపరీతంగా ఉండేది. భర్తకు కూడా భార్య పగలు కనబడకూడదు. అన్నం వడ్డించడానికి ఎదురుపడకూడదు. ఆఖరికి చిన్న మరుదులకు కూడా కనబడకూడదు. అంత విపరీతంగా ఘోషా పద్ధతి అమలు జరిగే రోజులలో లంకలకోడేరు మహిళా సభకు 400 మంది క్షత్రియ స్త్రీలు ఘోషా సంకెళ్ళను తెంచుకొని తొలిసారిగా బహిరంగసభకు వచ్చారు. ఆ రోజు మధ్యాహ్నం ప్రమాదవశాత్తు మహాసభ పెండాలుకు అగ్నిప్రమాదం జరిగింది. ఇంకేముంది? కమ్యూనిస్టులు కులభ్రష్టులు, మతభ్రష్టులు, హిందూ సదాచారాలను ఉల్లంఘించి స్త్రీలను పరదాల చాటు నుండి బైటకు తెచ్చారు. ఈ పాపం పండి పెండాలు తగలబడిందని క్షత్రియ కుల పెద్దలు, ఛాందసవాదులు దుష్ప్రచారం చేశారు. ఈ మహిళా మహాసభకు అనాటి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకుడు మద్దూరి అన్నపూర్ణయ్య, డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, కృష్ణాజిల్లా మహిళా నాయకురాలు వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ హాజరయ్యారు. స్త్రీలను యిళ్ళల్లోంచి బైటికి తీసుకురావడానికి కమ్యూనిస్టులు ఇటువంటి ప్రతిబంధకాలను ఎన్నింటినో

ఎదుర్కొని పోరాడవలసి వచ్చింది. స్త్రీని ఘోషాలోంచి బయటికి తీసుకు రావడానికి ఆ రోజుల్లో జరిగిన పోరాటం ఎంత భీషణ స్థాయిలో జరిగిందో దీనినిబట్టి తెలుసుకోవచ్చు.

కమ్యూనిస్టు నాయకుడు ఉద్దరాజు రామం తన భార్య మాణిక్యాంబచే సత్యాగ్రహం చేయించడానికి తీసుకువెళ్ళడానికి యింటికి వచ్చి భోజనం చేస్తూండగా - ఆయన తండ్రి పేము బెత్తంతో రామాన్ని కొట్టారు.

మహిళా కార్యకర్తలు చెప్పులు తొడుక్కొని, నడివీధులలో పగలు నడిచి వెళ్ళడం కూడా తప్పుగా ఎంచబడే రోజులు అవి. పగలు స్త్రీలు సమావేశాలకు రాకపోతే రాత్రిళ్ళు స్త్రీల సమావేశాలు జరుపవలసి వచ్చేది. మగవారు వీధులలో అరుగులమీద కూచుంటే స్త్రీలు వీధిలో నడిచి వెళ్ళ కూడని రోజులు అవి. ఆడవాళ్ళకు సంఘాలు పెట్టడానికి వచ్చారని తెలిసి మహిళా కార్యకర్తలపై దౌర్జన్యాలు కూడా జరుపబడిన పరిస్థితులు అవి !

## రాజకీయ శిక్షణా తరగతులు

1940-50 దశకంలో రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమం, మహిళా ఉద్యమం సుమారు 1000 మంది మహిళా కార్యకర్తలకు రాజకీయ శిక్షణ యిచ్చి, చైతన్యం కలిగిన సమర్థవంతమైన మహిళా కేడర్లను నిర్మించుకో గల్గారు. 1943లో బెజవాడలో జరిగిన ప్రథమ రాష్ట్ర స్థాయి శిక్షణా శిబిరంలో రాష్ట్ర మహిళా ఉద్యమ వ్యాప్తికి నాయకత్వం రూపొందింది. డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, మానికొండ సూర్యావతి, చండ్ర సావిత్రి దేవి, కాట్రగడ్డ హనుమాయమ్మ, వెల్లంకి అన్నపూర్ణ, మోటూరి ఉదయం, టి. సావిత్రిదేవి, జోశ్యభట్ల సుబ్బమ్మ, పరచూరి సూర్యాంబ, మాకినేని జగదాంబ, శ్రీమతి (ముక్తేవి) కోటమ్మ, గోపరాజు సీతాదేవి, పరకాల అహల్యాదేవి, అన్నే రామ తులశమ్మ, పందిరి జగదాంబ, మహీధర సీతా దేవి, దుర్భా హనుమాయమ్మ మొదలైనవారు శిక్షణా తరగతిలో శిక్షణ పొందారు. వివిధ జిల్లాల్లో మహిళా ఉద్యమాన్ని వ్యాపింపజేశారు. ఆ తరువాత కృష్ణా, గుంటూరు, తదితర చోట్ల జిల్లా స్థాయి రాజకీయ శిక్షణా శిబిరాలు జరిగాయి. తెలంగాణాలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమై, ఆంధ్ర మహాసభల వేదికలపై మహిళా సభలు

జరిపి స్త్రీలలో చైతన్యం కల్గించారు. ఆరుట్ల కమలాదేవి, బ్రిజిరాణిగౌడ్, మల్లు స్వరాజ్యం, ఇంకా ఎంతోమంది మహిళా కార్యకర్తలు ముందుకు వచ్చారు. ఆ తర్వాత ఆయుధాలుపట్టి పోరాడారు.

## కాకి నిక్కర్లతో కదంత్రొక్కిన మహిళలు

బెజవాడ రాజకీయ శిక్షణా శిబిరంలోను, వివిధ జిల్లా శిక్షణా శిబిరాలలోను రాజకీయ విజ్ఞానంతోబాటు డ్రిల్లు, కర్రసాము, ఆత్మరక్షణోపాయాలు నేర్చుకున్నారు. అది రెండవ ప్రపంచ యుద్ధ కాలం. ఆ రోజుల్లో దేశంపై జపాను దండయాత్ర ప్రమాదం ఏర్పడింది. విశాఖ, కాకినాడ, మద్రాసులపై జపాను విమానాలు బాంబులు వేశాయి. అందుచేత స్త్రీలు కూడా విమాన దాడి రక్షణ, ప్రథమ చికిత్స, అగ్నిమాపకదళ శిక్షణ మున్నగునవి నేర్చుకున్నారు. జపాను దండయాత్ర వస్తే, లేదా రౌడీలను ఎదుర్కోవలసి వస్తే మహిళలు ఎలా ఆత్మరక్షణ చేసుకోవాలో, (దమ్మీ కొట్టడం వగైరా) నేర్చుకున్నారు. రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులు చండ్ర రాజేశ్వరరావు, సుందరయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు మొదలగువారు జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలు, చరిత్ర, భూగోళం, జాతీయోద్యమ చరిత్ర మొదలైన పాఠాలు చెప్పటమేకాక, చండ్ర రాజేశ్వరరావుగారు బెజవాడ భారత మహిళా మండలి ఆవరణలో వీరికి డ్రిల్లు, కర్రసాము నేర్పారు. శిబిరం ముగింపు సందర్భంలో మహిళలు కాకీ నిక్కర్లు, హాఫ్ ఆరమ్ చొక్కాలు వేసుకొని, కర్రలు భుజాన పెట్టుకొని బెజవాడ వీధులలో కదంతొక్కుతూ చేసిన ప్రదర్శన (అర్థ శతాబ్దం క్రిందట) ఆంధ్ర మహిళా లోకంలో వచ్చిన నూతన చైతన్యానికి, ఆత్మ ధైర్య, స్థైర్యాలకు ప్రతిబింబంగా నాటికీ నేటికి గర్వించదగిన స్త్రీ విముక్తి పోరాటఘట్టంగా చెప్పుకోవచ్చు.

* * *

## రంగస్థలంపై మహిళలు

1940 దశకం నాటికి సినీమాలలోగాని, రంగస్థలం పైకిగాని సంసార స్త్రీలు వచ్చి, వేషాలు వేయడం చాలా అభ్యంతరకరంగా చూసే

వారు. మద్రాసు నగరంలో టంగుటూరి సూర్యకుమారి, కొమ్మూరి పద్మావతి మొదలైన కుటుంబాల స్త్రీలు తొలిసారిగా రైతుబిడ్డ, వందేమాతరం వంటి సినిమాలలో నటించారు. కాని ఆంధ్రదేశంలో రంగస్థలంపైకి సంసార స్త్రీలు వచ్చేవారు కాదు. వేశ్యల కుటుంబాల నుండి వచ్చిన స్త్రీలే నాటకాలలో వేషాలు వేశారు. అటువంటి పరిస్థితులలో తెనాలిలో 1943 లో జరిగిన ప్రధమ రాష్ట్ర అభ్యుదయ రచయితల మహాసభ సందర్భంలో వేసిన సోవియట్ నాటకం "ఇంగా" లోను, 1944 చివర బెజవాడలో జరిగిన ద్వితీయ అరసం మహాసభ సందర్భంలో వేసిన "కన్యాశుల్కం" నాటకం మహిళా సంఘాల ద్వారా ముందుకు వచ్చిన మహిళలు వేషాలువేసి రంగస్థలం మీదకు ధైర్యంతోవచ్చారు. కొమర్రాజు లక్ష్మణరావుగారికోడలు డాక్టర్ అచ్చమాంబగారి మరదలుఅయిన కొమర్రాజు పద్మ బుచ్చమ్మగాను, కొండపల్లి కోటేశ్వరమ్మ మీనాక్షిగాను(రెండూ వితంతువువేషాలే) జోశ్యభట్ల సత్యనారాయణ సుబ్బమ్మ దంపతులు అగ్నిహోత్రావదాన్లు దంపతులుగా వేషాలు వేశారు. రవీంద్రనాధ టాగూర్ మేనకోడలు దేవికారాణివంటివారు సినిమాలలో నటిస్తున్నారు. సంసార స్త్రీలుకూడా రంగస్థలం మీద నటించవచ్చు నటించాలి. కళలు కళల కోసం కాదు ప్రజల కోసం. ప్రజానాట్యమండలిని ఒక ప్రజా ఉద్యమంగా ముందుకు తీసుకుపోవాలి. అందుచే రంగస్థలంపై నటించడానికి స్త్రీలు వెరువకూడదు అని కమ్యూనిస్టు నాయకులు ఆనాడు మహిళా కార్యకర్తలకు ధైర్య స్థైర్యాలు, ఆత్మ విశ్వాసం కల్గించారు. కన్యాశుల్కం నాటకంతో ప్రారంభించి ఆ తరువాత ముందడుగు, మాభూమి మొదలైన అనేక నాటకాలలో మహిళా కామ్రేడ్స్ పాల్గొని ఆంధ్రదేశంలో ఇతరరాష్ట్రాలలో వందలాది ప్రదర్శనలుఇచ్చారు. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి దంపతులు, ఇంకా అనేక మంది దంపతులు ఇలా నటించిన వారిలో ఉన్నారు. స్త్రీ, పురుషులు కలిసి కోలాటాలు, అన్నాచెల్లెలు మొదలైన విచిత్ర వేషాలు వేశారు. జోయా, వీరేశలింగం, అల్లూరి సీతారామ రాజు మొదలైన బుర్రకథలు చెప్పారు. తెలంగాణా సరిహద్దు గ్రామాలలో రావి నారాయణరెడ్డి మున్నగు తెలంగాణా పోరాట యోధుల సమక్షంలో,

పోలీసుల రజాకార్ల నిర్బంధాల మధ్య, ధైర్య సాహసాలతో మా భూమి నాటక ప్రదర్శనలలో మహిళలు పాల్గొన్నారు.

## సంస్కరణ వివాహాలు; పూలదండల పెళ్లిళ్లు

బాల్య వివాహాలు, అతి బాల్య వివాహాలు జరిగే రోజులలో ప్రేమించి పెళ్లి చేసుకోవడం అనే భావనకే ఆస్కారంలేదు. వీరేశలింగం సంస్కరణోద్యమకాలంలో వితంతువులను పెళ్లి చేసుకోడానికి వరుళ్లే దొరికేవారు కాదు. ముందుకు వచ్చేవారే అరుదు. వితంతువును పెళ్ళాడినవాడు మొదటి భర్తవలెనే మృత్యు వాతపడతాడని నాటి ఛాందసవాదులు విపరీత ప్రచారం చేశారు. వీరేశలింగంగారు వితంతు యువతులను రహస్యంగా తన యింటికి తెచ్చి వరుళ్ళకోసం వెతుకుతున్నారనే సంగతి విని తల్లి దండ్రులు తమ కుమారులకు (విద్యార్థులకు) త్వరత్వరగా వివాహాలు చేసేసేవారు. అతికష్టం మీద వితంతువులను వివాహాలు చేసుకోడానికి వరుళ్ళు దొరికేవారు. వీరేశలింగంగారు 1919లో మరణించారు. ఆ తరువాత ఆంధ్రలో ఈ సంస్కరణోద్యమం కొంత వెనుకపట్టుపట్టింది. జాతీయోద్యమ ప్రభావం, ఆ తరువాత కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావంతో తిరిగి సంఘ సంస్కరణోద్యమం వేగంపుంజుకుంది. కుల, మత, ఛాందస భావాలను ప్రక్కకునెట్టిన యువకులు అనేక మంది సంస్కరణ వివాహాలు- వితంతు పునర్వివాహాలు, కులాంతర, మతాంతర వివాహాలు చేసుకోడానికి ముందుకు వచ్చారు. కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్ర దేశంలో సంఘ సంస్కరణ ఉద్యమాన్ని పట్టుదలగా ముందుకు తీసుకుపోయింది. మహిళా ఉద్యమంలో చైతన్యం పొందిన యువతులు, వితంతువులు బలవంతపు పెళ్ళిళ్ళకు గురి అయినవారు, వృద్ధులకు కట్టబెట్టబడినవారు సంస్కరణ వివాహాలు చేసుకోడానికి కమ్యూనిస్టు పార్టీ సహాయం, మహిళా ఉద్యమ సహాయం కోరేవారు.

పరస్పర ప్రేమతో పెళ్ళిళ్ళు చేసుకొనే నూతన సంప్రదాయాన్ని కూడా జాతీయోద్యమం, కమ్యూనిస్టు ఉద్యమం తీసుకొని వచ్చింది. వివాహానికి ప్రాతిపదిక పరస్పర ప్రేమ, పరస్పర భావ సమైక్యత, ఉమ్మడి జీవితాశయాలు కావాలని, ప్రగతిశీల భావాలుకల రచయి

తలు చలంలాంటి వారు కన్న కలలను నిజం చేసింది– జాతీయోద్యమమూ, కమ్యూనిస్టు ఉద్యమాలే. ఆ రోజులలో (1937 - 1938) సోషలిస్టులు, కమ్యూనిస్టుల ఆధ్వర్యాన నడుపబడిన కొత్తపట్నం, మంతెనవారి పాలెం రాజకీయ పాఠశాలలకు తొలిసారిగా అనేక మంది యువతులు వచ్చారు. అక్కడ పరస్పరం పరిచయాలతో అనేక మంది యువతీ యువకులు ఆ తరువాత ప్రేమ వివాహాలు చేసుకున్నారు. అటువంటివారిలో కమ్యూనిస్టు అగ్ర నాయకులు చండ్ర రాజేశ్వరరావు, సావిత్రిదేవిగార్లు ఉన్నారు. కొత్తపట్నం స్కూలులో ఉభయుల మధ్య పరిచయం-ఆ పాఠ శాల అనంతరం వెంట్రప్రగడలో వివాహానికి దారితీసింది. రాష్ట్ర మహిళా ఉద్యమ నిర్మాతలలో ఒకరైన సూర్యావతిగారికి మానికొండ సుబ్బా రావుగారికి ఈ రాజకీయ పాఠశాలలోనే పూలదండల పెళ్ళి జరిగింది. ఆ రోజుల్లో బ్రాహ్మణులలోనేకాదు అన్నికులాల్లోను శాఖా భేదాల పట్టింపులుండేవి. పెద్దకమ్మ, చిన్నకమ్మ, కామంచిరెడ్లు, భూమంచి రెడ్లు, మోటాడరెడ్ల మధ్య వివాహాలు జరిగేవి కావు. నేటి పీపుల్స్‌వార్ గ్రూపు నక్సలైట్ నాయకుడు శ్రీ కొండపల్లి సీతారామయ్యకు - బాల వితంతువు కోటీశ్వరమ్మకు కమ్యూనిస్టుపార్టీ వెంట్రప్రగడలో పెళ్ళిచేసింది. కొండపల్లి సీతారామయ్య తక్కువ శాఖ. అందుచే గ్రామంలోని రెడ్లు ఈ వివాహాన్ని జరగకుండా చేయాలని దౌర్జన్యానికి తలపడితే, సీతా రామయ్యను రెండెడ్ల బండిలో తెరలుకట్టి గ్రామంలోకి రహస్యంగా స్మగుల్ చేసి, చండ్ర రాజేశ్వరరావు, కొసరాజు శేషయ్య, టి. కె. రామ స్వామి మొదలైన కమ్యూనిస్టు నాయకులు వివాహం జరిపించారు. వివాహా నంతరం కోటీశ్వరమ్మ కుటుంబం వెలివేయబడింది. దౌర్జన్యాలకు గురయింది. జోశ్యభట్ల సుబ్బమ్మగారు పునర్వివాహ సమయానికి వితంతువే కాదు ఇద్దరు బిడ్డలున్న తల్లి. ఈ రోజుల్లో కూడా బిడ్డలున్న వితంతు యువతులను పెళ్ళిళ్లు చేసుకోడానికి సాధారణంగా ఎవరూ ముందుకు రావడంలేదు. కాని జోశ్యభట్ల సత్యనారాయణగారు సుబ్బమ్మగారిని వివాహ మాడారు. ఈ వివాహాన్ని డాక్టర్ అచ్చమాంబగారు తమ యింట జరిపించారు. మద్దుకూరి చంద్రశేఖరరావు మున్నగు కమ్యూనిస్టు నాయకులుకూడా అదివరకే బిడ్డలున్న వితంతు యువతులను వివాహాలు చేసుకొన్నారు. సుంద

రయ్యగారు, బొంబాయి కమ్యూనిస్టుపార్టీ కేంద్రకార్యాలయంలో ఉన్న లైలా గారు పరస్పరం ప్రేమించుకొని కులాంతర, మతాంతర, రాష్ట్రాంతర వివాహం చేసుకున్నారు. నాటి పార్టీ కార్యదర్శి పి. సి. జోషి, చిట్టగాంగ్ ఆయుధగారం దోపిడీలో పాల్గొన్న వీర నారీమణి కల్పనా దత్తు పరస్పరం ప్రేమించుకొని పెళ్లి చేసుకున్నారు.

ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ వివాహ విధానంలో పెద్ద విప్లవం తెచ్చింది. స్త్రీని దానం యిచ్చే కన్యాదాన వివాహాన్ని త్రోసిపుచ్చి, భరించే వాడు భరించబడేది అనే భావనగల భార్య భర్త అనే పదాన్ని వదలి, దంపతులు అనే మాట వాడుకలోకి తెచ్చింది. భార్య, భర్త పదాలకు స్వస్తి చెప్పి స్త్రీ, పురుష లిద్దరు వివాహానికి, దాంపత్యానికి, జీవితానికి, సమాన భాగస్తులన్న వివాహ ప్రమాణంతో, పూల దండల పెళ్లిళ్ళకు కమ్యూనిస్టు పార్టీ నాంది పలికింది. ఆ రోజులలో అనేక వందల పెళ్లిళ్ళు ఇలా జరిగాయి. తూర్పు గోదావరి జిల్లాలో డాక్టర్ చెలికాని రామారావు, డాక్టర్ భావనాచారి, ప్రభాకర చౌదరి మొదలైనవారు కులాంతర వివాహాలు సంస్కరణ వివాహాలు చేసుకొన్నవారు. ఇలా అన్ని జిల్లాల్లోను ఒక ఉద్యమంగా కమ్యూనిస్టు పార్టీ వివాహ వ్యవస్థలో సమానత్వ భావాన్ని ప్రవేశపెట్టింది. దీనిలో మహిళా ఉద్యమం ఒక నూతన చైతన్యాన్ని, స్థాయిని అందుకుంది. (ఈ వ్యాస రచయిత కుటుంబంలోని కమ్యూనిస్టు కార్యకర్తలు కులాంతర వివాహం చేసుకున్నందుకు బలవంతపు పెళ్లికి గురైన వివాహితను తిరిగి వివాహం చేసుకున్నందుకు బహిష్కరణకు గురైనారు.)

## జాయింటు కుటుంబాల సమస్య

స్త్రీలను మహిళా సంఘాలలోకి, ఉద్యమాలలోకి తీసుకురావడానికి ఆ రోజుల్లో ఫ్యూడల్ సంస్కృతికి చిహ్నంగా ఉన్న జాయింటు కుటుంబాలు, అందలి కట్టుబాట్లు పెద్ద ప్రతిబంధకంగా ఉండేవి. తాత, తండ్రి కుమారుడు, ఒకే కుటుంబంలో, ఒకే ఇంటిలో ఒకే కప్పు క్రింద కాపురం చేసేవారు. కోడరికం, తోటికోడళ్ళ మధ్య తగవులే కాక స్త్రీ, పురుషులకు

జాయింటు కుటుంబంలో ఆర్థిక స్వాతంత్ర్యం కాని, అభిప్రాయ స్వాతంత్ర్యం కాని ఉండేవికావు. పైకులాలవారు క్రింది కులాలవారి ఇళ్ళకు వెళ్ళడంగాని, భోజనాలు చేయడం కాని కుల భ్రష్టత్వం క్రింద, పెద్ద తప్పు క్రింద పరిగణించేవారు. ఇటువంటి పరిస్థితుల్లో మహిళా ఉద్యమంలోకిగాని కమ్యూనిస్టు ఉద్యమంలోకిగాని స్త్రీలను తీసుకు రావడం అంటే చాలా దుర్ఘటంగా తీవ్ర ప్రతిబంధకంగా ఉండేది. అందుచేత ఆ రోజుల్లో జాయింటు కుటుంబాల నుండి వైదొలగండి అని కమ్యూనిస్టుపార్టీ ఒక నినాదం తీసుకుంది. ఫ్యూడల్ సంప్రదాయాల సంకెళ్ళ నుండి స్త్రీలను విముక్తి చేయడానికి జాయింటు కుటుంబాల నుండి విడివడండి అనేది ఒక మెట్టుగా ఆ రోజుల్లో ఎంచి సాధ్యమైనంత ఎక్కువగా ఈ నినాదాన్ని అమలు జరుపుతూండేవారు. అయితే మారిన నేటి పరిస్థితుల్లో సమిష్టి కుటుంబాల బదులు వ్యష్టి కుటుంబాలే ఎక్కువగావటం, వృద్ధాప్యం ఒక సాంఘిక సమస్యగా మారడం చూస్తున్నాం- (అది వేరే సంగతి) అయితే పార్టీ సభ్యులు జైళ్ళకు వెళ్ళినప్పుడు అజ్ఞాతవాసాలలో, నిర్బంధాల పాలైనప్పుడు మహిళా కార్యకర్తలకు తిరిగి జాయింటు కుటుంబాల బాధలు తప్పేవికావు. అత్తమామలు, తల్లి దండ్రులు కమ్యూనిస్టులై ఉన్నప్పుడు, జాతీయోద్యమంవలన సంస్కార దృష్టి కలిగినప్పుడు పరిస్థితులు కొంత మెరుగుగా ఉండేవి.

## "తమకు తెలియని తమ చరిత్ర"

ఈ విధంగా ఆంధ్రదేశంలో స్త్రీ విముక్తి పోరాటం ఏయే దశల్లో, ఏయే సమస్యలను ఎదుర్కొంటూ, ఎన్ని అగడ్తలుదాటి ముందుకు వచ్చిందో నేటి ఫెమినిస్టులు తెలుసుకోవడం మంచిది. కాని నేటి ఫెమినిస్టు గ్రూపులలో అనేక మందికి స్త్రీ విముక్తి ఉద్యమం గురించి అటువంటి చారిత్రిక దృష్టిలేదని చెప్పవలసి వస్తోంది. ఇంతవరకు వెలువడిన వారి సాహిత్యం చూస్తే ఈ విషయం తెలుస్తుంది. వారి కొన్ని ప్రధాన ప్రచురణలు ఇవి :

1) "మనకు తెలియని మన చరిత్ర" తెలంగాణా రైతాంగ పోరాటంలో స్త్రీ— ఒక సజీవ చరిత్ర - ప్రచురణ - స్త్రీ శక్తి సంఘటన -

ఇంటర్వ్యూల సంకలనం- కె. లలిత, వసంతకన్నబిరాన్, రమమేల్కొటే, ఉమామహేశ్వరి, సూసీతారూ, వీణా శత్రుఘ్ను, ఎమ్. రత్నమాల - వెల 15-00, ప్రచురణ సంవత్సరం 1986 డిస్ట్రిబ్యూటర్స్ : నవయుగ బుక్‌హౌస్, సుల్తాన్‌బజార్, హైద్రాబాద్-200 195.

2) కఠోర షడ్జమాలు : వ్యాస సంకలనం - రచన : వసంత కన్నబిరాన్ ప్రచురణ : పెర్‌స్పెక్టివ్స్, వెల : రు. 20-00, 3-6-262 శిల్ప అపార్ట్‌మెంట్స్, ఎర్రమంజిల్ కాలనీ, హైద్రాబాద్-500 482, లేదా వసంత కన్నబిరాన్, 10-3-29/2 ఫ్లాట్ 128, ఈస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్.

3) మూడుతరాల కథ, రచన: కొల్లెంతాయ్ - అనువాదం : వోల్గా

స్త్రీ విముక్తి సంఘటన వారి ప్రచురణే.

4) నీలిమేఘాలు : స్త్రీవాద కవితా సంకలనం : స్వేచ్ఛా ప్రచురణలు, వెల : రు. 25/-, దొరుకుచోటు : నవోదయ బుక్‌హౌస్, ఆర్య సమాజ్ ఎదురుగా, కాచిగూడ, హైద్రాబాద్-500 027, - అస్మిత్, రోడ్ నెం. 2, ఈస్టు మారేడ్‌పల్లి, సికింద్రాబాద్-500 003.

5) నూరేళ్ళ చలం : వ్యాస సంకలనం - సంపాదకత్వం -ఓల్గా, వెల : రు. 25/- విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ అన్ని బ్రాంచీలు, నవోదయ బుక్‌స్టాల్, ఆర్య సమాజ్ ఎదురు సందు, కాచిగూడ, హైద్రాబాద్-500 027; ప్రచురణ : నూరేళ్ళ చలం శత జయంతి కమిటీ.

స్త్రీ శక్తి సంఘటన - స్వేచ్ఛా ప్రచురణలు, నూరేళ్ళ చలం శత జయంతి కమిటీ - ఇవన్నీ వసంతకన్నబిరాన్, ఓల్గాల నాయకత్వానగల ఒకే అభిప్రాయాలు కల ఫెమినిస్టు గ్రూపు; "భూమిక", "మాతృక", "ఎదురీత", "ప్రజాసాహితి" మున్నగు పత్రికలు ప్రచురిస్తున్న ఫెమినిస్టు గ్రూపులున్నాయి.

శ్రీమతి జయప్రభ, శ్రీమతి రంగనాయకమ్మ, వేర్వేరు అభిప్రాయాలుగల ఫెమినిస్టు గ్రూపులకు చెందినవారు.

# కమ్యూనిస్టు ఉద్యమంపై అభియోగం

తెలంగాణా సాయుధ పోరాటంతో ముందుకు వచ్చిన స్త్రీలను ఆ తరువాత కమ్యూనిస్టు ఉద్యమం గాలికి వదలి - తిరిగి వంటిళ్ళలోకి పంపించిందని "మనకు తెలియని మన చరిత్ర" సంకలన కర్తల అభియోగం. వీరికి చారిత్రక దృష్టి ఉంటే ఈ అభియోగాన్ని చేసి ఉండేవారు కాదు.

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో, మహిళా ఉద్యమ చరిత్రలో స్త్రీలు తొలిసారిగా తుపాకి చేతబట్టి తెలంగాణా విప్లవంలో పోరాడారు. రజాకార్లకు, నైజాం సైనికులకు వ్యతిరేకంగా వడిసెలలు, కారం పొడి మొదలైన వాటితో ప్రారంభించి చివరకు తుపాకులను బట్టి, దళాల్లో చేరి స్త్రీలు పోరాడారు. తెలుగు స్త్రీల విముక్తి పోరాటంలో ఇదొక మహోజ్వల ఘట్టం. ఇంత ఘన చరిత్ర కల్గిన ఈ పోరాటం గురించి, పోరాట విరమణ గురించి కమ్యూనిస్టు ఉద్యమంలో భిన్నాభిప్రాయాలు, తీవ్ర సిద్ధాంత సంఘర్షణలు నాటికి నేటికీ ఉన్నమాట నిజం.

ఈ పోరాటంలో స్త్రీలను యింత అత్యున్నత చైతన్యస్థాయికి పోరాట స్థాయికి తీసుకొని వచ్చిన ఘట్టం మాత్రం ఎవరూ కాదనలేనిది. అయితే ఈ చారిత్రక ప్రాధాన్యతను తక్కువచేసి చూపడానికి - కమ్యూనిస్టు ఉద్యమంపై అపప్రచారం చేయడానికి - ఫెమినిస్టు గ్రూపులకు చెందిన స్త్రీ శక్తి సంఘటన వారు ప్రయత్నించడం శోచనీయం. వారిలా ఆరోపిస్తున్నారు :

"స్వాతంత్ర్య పోరాటం మొదలుకొని దేశ వ్యాప్తంగా సాగిన అనేక పోరాటాలలోను ప్రజా ఉద్యమాలలోను స్త్రీలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నప్పటికీ ఈ పరిస్థితిని వినియోగించుకొని బలమైన స్త్రీ విముక్తి ఉద్యమాన్ని నిర్మించడానికిగాని ఆ స్త్రీలను రాజకీయంగా అభివృద్ధి చేసి, వారి నుండి పెద్ద ఎత్తున కార్యకర్తలను, నాయకురాండ్రను తయారు చేయడానికిగాని కమ్యూనిస్టు ఉద్యమం పూనుకోలేదు" అని వీరు అటు తెలంగాణా పోరాట యోధురాండ్రను, ఇటు కమ్యూనిస్టు ఉద్యమాన్ని కించపరచడానికి ప్రయత్నించారు. ఆంధ్ర మహిళా ఉద్యమం చరిత్ర తెలిస్తే ఇలా అనగలరా?

తెలంగాణా సాయుధ పోరాట విరమణ తదనంతర చరిత్ర తెలిసిన

వారు ఎవరూ ఇలా అనలేరు. తెలంగాణా సాయుధ పోరాటం - పోలీసు యాక్షన్ తరువాత విరమించాలా ? విరమించకూడదా? అన్న విషయంలో జరిగిన తీవ్రవివాదాలు, జరిగిన పొరపాట్లు, ఫలితంగా అదే సమయంలో ఆంధ్ర ప్రాంతంలో అవలంబించిన అతివాద దుస్సాహసిక విధానాల ఫలితంగా ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం తీవ్రసంక్షోభాన్ని ఎదుర్కొంది. 1955 ఆంధ్ర ప్రాంత మధ్యంతర ఎన్నికలలో సెక్టేరియన్ ఎత్తుగడల వలన కమ్యూనిస్టు ఉద్యమం తీవ్ర పరాజయం పాలైంది. అప్పటి నుంచి సాగిన తీవ్ర సిద్ధాంత విభేదాలతో చివరకు కమ్యూనిస్టు ఉద్యమం 1964లో చీలి ముక్క ముక్కలైంది. ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా ఉండే తన బలమైన స్థానాన్ని కోల్పోయింది. కమ్యూనిస్టు ఉద్యమంతోపాటు ప్రజాతంత్ర ఉద్యమాలన్నీ చీలిపోయి చిన్నాభిన్నమై పోయాయి. భారత దేశంలో సాయుధ పోరాటానికి పరిస్థితులు పరిపక్వమయ్యాయన్న మావో సేటింగ్ గారి తప్పు అంచనాను బొదలదాల్చి మొదట సి.పి.ఎమ్. ఆ తరువాత నక్సలైట్లు భారత కమ్యూనిస్టు ఉద్యమానికి ఈ దుర్గతి పట్టించారు. నాటికీ నేటికీ భారతదేశంలో సాయుధ విప్లవమూ జరగలేదు. తుపాకిగొట్టం లోంచి రాజ్యాధికారమూ రాలేదు. నేటి విప్లవదశ అదికాదని చరిత్ర తీర్పు చెప్పింది. ఈలోగా కమ్యూనిస్టు ఉద్యమం మాత్రం ముక్క చెక్కలై అధోగతిపాలైంది. దాని పర్యవసానంగానే అన్ని ప్రజా ఉద్యమాలూ చీలికలు వాలికలు అయి ఒకనాటి ప్రాభవాన్ని కోల్పోయాయి. అందులో భాగంగానే తెలంగాణాలో ముందుకు వచ్చిన స్త్రీ విముక్తి పోరాటమూ దెబ్బతింది. ఈ చరిత్ర క్రమాన్ని వక్ర భాష్యం చేయడానికి "మనకు తెలియని మన చరిత్ర" ఫెమినిస్టు గ్రూపువారు ఎంత ప్రయత్నించినా అది నెరవేరలేదు. వీరి ప్రయత్నం విఫలమైందని ఫెమినిస్టు గ్రూపులలో మరొక గ్రూపునకు చెందినవారే వారికి తగిన సమాధానం యిచ్చారు.

"ఎదురీత" 1994 ఆగస్టు నెల సంచికలో డాక్టర్ చల్లపల్లి విజయ ఇలా వ్రాశారు.

"మనకు తెలియని మన చరిత్ర" పుస్తకం ద్వారా కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొన్న మహిళలను ఇంటర్వ్యూ చేయడం ద్వారా కమ్యూనిస్టుపార్టీ మహిళలకు సమాన ప్రతిపత్తి యివ్వలేదని రుజువు చెయ్య జూపి

అందులో విఫలమయ్యారు ఆంధ్ర రాష్ట్ర ఫెమినిస్టులు. వారెంత ప్రయత్నించినప్పటికీ ఇంటర్వ్యూ చేయబడ్డ మహిళలందరూ దాదాపుగా, కమ్యూనిస్టు ఉద్యమంలో తామెలా ఉత్తేజితులయ్యారో చెప్పారు."

ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం స్త్రీ విముక్తి పోరాటాన్ని ఏవిధంగా ముందుకు తీసుకుపోయిందీ డాక్టర్ చల్లపల్లి విజయ చెబుతూ స్త్రీ శక్తి సంఘటన వారిని ఇలా ప్రశ్నించారు.

"....మహిళలను తట్టిలేపి వారికి వ్యక్తిత్వమున్నదంటూ, ఫ్యూడల్ సమాజాన్ని ఎదుర్కొని, మహిళలను విద్యలో, ఉద్యోగాల్లో, ఉద్యమాల్లో నడిపించి, కుటుంబాలలో ప్రజాస్వామిక సంస్కృతిని ఆచరించి చూపిన, వితంతు వివాహం వంటి వాటిని గూడా ఒక సామాజిక ఉద్యమంగా నడిపిన కమ్యూనిస్టు ఉద్యమపు పాజిటివ్ కృషి మీకు కనబడక పోవడం ఏ వక్ర దృష్టి వలన ?"

"మనకు తెలియని మన చరిత్ర" సంకలనకర్తలకు నిజంగానే ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర, మహిళా ఉద్యమ చరిత్ర తెలియదని లేదా తెలుసుకొనదలచలేదని స్పష్టం.

## చలం సాహిత్యం గురించి కమ్యూనిస్టుపార్టీ చర్చ: మహిళా ఉద్యమ సమాలోచన

1940 దశకం ప్రథమార్థ భాగంలో చలం గురించి, చలం సాహిత్యం గురించి ఆనాటికి లభించినంతవరకు కమ్యూనిస్టుపార్టీ క్షుణ్ణంగా చర్చించింది, చర్చించవలసిన అవసరం వచ్చింది. అప్పటికే మైదానం (1927), అరుణ (1935), దైవమిచ్చిన భార్య, బ్రాహ్మణీకం (1937), స్త్రీ మొదలైన చలం రచనలు ప్రాచుర్యంలో ఉన్నాయి.

స్త్రీ స్వేచ్ఛ గురించి, వివాహం, విడాకులు, వారసత్వం, దత్తత స్వీకారం మున్నగు స్త్రీలహక్కులు గురించి కమ్యూనిస్టుపార్టీ తోడ్పాటుతో రాష్ట్ర మహిళా ఉద్యమం తీవ్రంగా చర్చించి, ఆనాటి కమ్యూనిస్టుపార్టీ వారపత్రిక ప్రజాశక్తిలో అనేక వ్యాసాలువ్రాసి, వ్రాయించి ఈ సమస్యలపై బహుః ప్రచారం సాగించుతూంది. పైన పేర్కొన్నట్లు రాష్ట్రస్థాయి రాజకీయ శిక్షణా తరగతులు, జిల్లా స్థాయి మహిళా శిక్షణా తరగతులు

నడిపి వందలాది మహిళా కార్యకర్తలను తయారుచేసి మహిళా ఉద్యమాన్ని ఆంధ్రదేశంలో యించుమించు అన్ని జిల్లాలకు వ్యాపింప జేసిన రోజులు అవి. కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, కొమర్రాజు లక్ష్మణరావు మున్నగు నవయుగాంధ్ర నిర్మాతల వర్ధంతులు పెద్ద యెత్తున జరిపించి, వారి రచనలను, ప్రహసనాలను పునర్ముద్రించి, కన్యాశుల్కం వంటి నాటకాలను ప్రదర్శింపజేసి, మహిళా సమస్యలపై అనేక కరపత్రాలు ప్రచురించి, లక్షలాది స్త్రీలను మహిళా ఉద్యమం ద్వారా చైతన్యపరుస్తున్న రోజులు అవి. దాదాపు లక్ష కాపీలు అమ్ముడైన ప్రఖ్యాత గ్రంథం (తెలుగు సారస్వతంలో అంతవరకు అటువంటి విజ్ఞాన గ్రంథం రాలేదు) డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ గారి "ప్రసూతి-శిశు పోషణ" అన్న గ్రంథం, అభ్యుదయ పత్రిక ప్రత్యేక సంచికలు. కొన్ని వందల సభలలో ప్రదర్శించిన "నాటు మంత్రసాని" మొ॥ నాటికలు (ఈ వ్యాస రచయిత రచించింది,) కన్యక, వీరేశలింగం, టాన్యా మొదలైన బుర్రకథలు ఆనాడు మహిళల్లో శాస్త్రీయ విజ్ఞానాన్ని, ఆరోగ్య విజ్ఞానాన్ని, సాంఘిక రాజకీయ విజ్ఞానాన్ని, చైతన్యాన్ని పెద్ద యెత్తున పెంపొందించుతున్న రోజులు. ఫ్యూడల్ సంస్కృతికి, పురాతన సాంఘిక కట్టుబాట్లకు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఆంధ్ర మహిళా లోకంలో బ్రహ్మాండమైన వెల్లువను తీసుకొని వస్తున్న రాష్ట్ర మహిళా ఉద్యమం, రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమం; స్త్రీ స్వేచ్ఛ కోసమే ఉద్దేశించబడినట్లు, అదే పరమ లక్ష్యమైనట్లు వెలువడుతున్న ఆనాటి చలం సాహిత్యం గురించి కూడా క్షుణ్ణంగా చర్చించి అందులోని మంచి చెడ్డలను మహిళా ఉద్యమానికి మహిళా ఉద్యమ కార్యకర్తలకు విడమర్చి విప్పి చెప్పవలసిన అవసరం ఏర్పడింది. చలం సాహిత్యాన్ని హేతువాద దృష్టితో, శాస్త్రీయ దృష్టితో గతితార్కిక భౌతికవాద దృష్టితో పరిశీలించడం జరిగింది.

## స్త్రీలు సిగ్గుతో తలవంచుకోవలసిన చలం "స్త్రీ పాత్రలు"

మైదానం, అరుణ, దైవమిచ్చిన భార్య మొదలైన నవలలోని

పాత్రలు మహిళా లోకానికి ఎంత మాత్రం ఆదర్శంకావు, కాజాలవు. అవి అరాచకవాదానికి, స్వేచ్ఛా ప్రణయానికి, విశృంఖల కాముకత్వానికి అడుగడుగునా, పురుష వాంఛకు లొంగుబాటుతనానికి చిహ్నాలు; ఒక జానిసత్వంనుండి మరొక జానిసత్వానికి, పరాధీనతకు పురుషుల కాముకత్వానికి లోబడి పోవడానికి తప్ప, స్త్రీల విముక్తికిగాని, ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యానికిగాని, నూతన సామాజిక విలువలకుగాని, స్త్రీల వ్యక్తిత్వానికి గాని స్త్రీల హక్కుల సాధనకుగాని ప్రతీకలుకావు. చలం వ్రాసిన "స్త్రీ" "బిడ్డల శిక్షణ" మొదలైన గ్రంథాలు మాత్రమే చదువదగినవి, చదివించ దగినవి అని కమ్యూనిస్టు పార్టీ, మహిళా సంఘం అభిప్రాయపడినాయి.

## మహిళా ఉద్యమానికి మైనస్ పాయింటుగా పరిణమించిన చలం సాహిత్యం

కమ్యూనిస్టు కుటుంబాలలోని స్త్రీలు, ఆనాటి ఫ్యూడల్ కట్టుబాట్లను' ఛాందస ఆచారాలను, ఆంక్షలను ఎదుర్కొని యింటి గడపదాటి బైటకి వచ్చి మహిళా ఉద్యమాన్ని నిర్మించడానికి వందలాదిగా గ్రామాలలో తిరుగుతున్నప్పుడు ఆనాటి చలం నవలలో చిత్రించబడిన స్త్రీ పాత్రలు, రాజేశ్వరి, అరుణ, పద్మావతి మొదలైన స్వేచ్ఛా ప్రణయ పాత్రలతో తమ్ము ఎక్కడ పోల్చి అవహేళన చేస్తారో అని మహిళాకార్యకర్తలు భీతిల్లవలసి వచ్చేది. ఎందుకంటే చెప్పులు తొడుక్కొని, చేతి సంచులు పట్టుకొని ఘోషాను ధిక్కరించి నడివీధులలో పగలు స్త్రీలు నడవటమే తప్పుగా ఎంచబడే ఆ రోజులలో మహిళాకార్యకర్తలు ప్రచారానికి వెళు తున్నప్పుడు-వారిని యిళ్ళలోంచి లేచిపోయినవారుగా, చెడిపోయినవారుగా, నీతి, నియమాలు లేని వారుగా, సనాతనవాదులు, గ్రామీణ భూస్వామ్య పెత్తందారీ వర్గాలు రాజకీయ వైరంలో కొందరు మితవాద కాంగ్రెస్ నాయకులు ఎంచడం, అప ప్రచారం చేయడం జరిగేది. పితృస్వామిక సమాజ వ్యవస్థను నిర్మూలించడానికి భూస్వామ్య ఆర్థిక, సామాజిక విధానాలతో, అభివృద్ధి నిరోధక సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక భావాలతో పోరాడాలి. అంతేగాని రాజేశ్వరి, అరుణ మొదలైన పాత్రలవలె ఇళ్ళలోంచిలేచి.

పోయి, ఒకరి తర్వాత మరొకరితో సెక్స్ సంబంధాలు పెట్టుకోవడం ఏక సమయంలో భర్తతో, ప్రియునితో సెక్స్ సంబంధం కలిగి ఉండటం మహిళా లోకానికి ఆదర్శం ఎలా కాగలదు? చలం రూపొందించిన అట్టి స్త్రీ పాత్రలను ఎలా సమర్థించగలం? అన్నదే ఆనాటి మహిళా ఉద్యమ కార్యకర్తలకు ఎదురైన విషమ సమస్య, వికృత ప్రశ్న. చలం నవలలు చదవడం, చదివించడం సిగ్గుచేటుగా ఒక అపభ్రంశ విషయంగా, ఆనాటి మహిళా ఉద్యమానికి పరిణమించింది.

## చలం సాహిత్యంపై కమ్యూనిస్టుపార్టీ విశ్లేషణ

రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ అగ్ర నాయకులు శ్రీ సుందరయ్య, శ్రీ చంద్ర రాజేశ్వరరావు, శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు తదితరులు చలం సాహిత్యంద్వారా నాటి మహిళా ఉద్యమానికి, మహిళా లోకానికి ఎదురైన ఈ విషమ సమస్యను చర్చించారు. ఆ చర్చ సారాంశంగానే ఆనాడు వ్రాసిన సాహిత్య విమర్శ వ్యాసాలలో చలం గురించి, చలం సాహిత్యం గురించి "ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు" అన్న వ్యాసంలో (1948 అక్టోబరులో ప్రకటితమైన అభ్యుదయ సంచికలో) చంద్రంగారు ఇలా వ్రాశారు:

## "ఇంట్లోంచి లేచిపోవడమే స్త్రీ విముక్తి మార్గమా?"

"చలంగారు ముఖ్యంగా స్త్రీలు సమాజంలో అనుభవించుతున్న కష్ట నిష్ఠురాలను వాస్తవికంగా చిత్రించుతారు. సజీవమైన వ్యవహారిక భాష వాడుతారు. వీరి కథలకు, నవలలకు దాదాపు యితివృత్తం స్త్రీ - పురుష సంబంధాలు. పూర్వశృంఖలాలను బ్రద్దలుచేసి, స్త్రీ తిరుగుబాటు చేయడమే అనేక రూపాలలో చలంగారు చిత్రించారు. కాని వీరేశలింగంగారివలె ఒక నిర్మాణాత్మకమైన మార్గాన్ని మహిళలకు చూపలేక పోయారు. "బానిసగా ఉండవద్దు. తిరుగుబాటు చెయ్. ఇంట్లో నుంచి లేచిపో." అని ధైర్యంగా బోధించారు. కాని యింట్లోంచి

తేచిపోయి బజారున పడిన సోదరికి నేటి సమాజంలో గతి ఏమిటి ? పెట్టుబడిదారీ నాగరికతలో తక్కిన అన్ని వస్తువుల మాదిరిగానే అమ్ముడు కావడమే కదా! తద్వారా ఆమె ఇంకో రకపు బానిసత్వంలోకి దిగజారి చిదికి పోవడమే కదా. ఈ విష మావస్థ నుండి తప్పించుకొనే మార్గాన్ని చలం రచనలు ఏమాత్రం సూచించవు. అదే వాటిలోని అరాచకత్వం."

—చంద్రం వ్యాసావళి పేజీ 108, 109
విశాలాంధ్ర ప్రచురణాలయంవారి ప్రచురణ.

అదే విధంగా ఆనాటి అభ్యుదయ రచయితలలో, మార్క్సిస్టు మేధావులలో ప్రముఖులు, తత్వవేత్త డాక్టర్ కుప్పా వెంకట్రామశాస్త్రి గారు కూడా అభ్యుదయ సంచికలలో చలంపైన చలం సాహిత్యంపైన ఎంతో నిశితమైన పరిశీలనా వ్యాసం వ్రాశారు.

డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ వంటి అభ్యుదయగాములు మహిళా ఉద్యమ నిర్మాతలు, ఆ రోజులలో బెజవాడలో చలం కుటుం బాన్ని ఆదుకోడానికి, (చలం అరాచక జీవితం ఫలితంగా కుటుంబ సభ్యులు సామూహికంగా విషం త్రాగడానికి ప్రయత్నించిన విషయం తెలిసి) ఎంతో సానుభూతితో ప్రయత్నించిన విషయం ఈ వ్యాస రచయి తకు వారి సన్నిహిత మిత్రులు శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారికి కూడా తెలుసు. చలం అరుణాచలానికి పలాయనం చిత్తగించకుండా చేయడానికి, డాక్టర్ అచ్చమాంబగారు చాలా ప్రయత్నించారు కాని లాభం లేక పోయింది.

## నూరేళ్ళ చలం పూతగా ఫెమినిజం ముందుకు పోతుందా ?

చారిత్రిక అవగాహనలేని, స్త్రీ విముక్తి ఉద్యమ సమకాలీన సమస్యల పట్ల శాస్త్రీయమైన, వాస్తవికమైన అవగాహనలేని ఫెమినిస్టు గ్రూపులకు చలం సాహిత్యం ఒక "పెన్నిధి"గా దొరకడం యాదృచ్ఛికం కాదు. వారి మాటలలోనే చెప్పాలంటే ఇది "అనివార్యమైన చారిత్రక సందర్భం". ఇది

నేటి మహిళా లోకాన్ని ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించలేమ సరికదా ఒక వేర్పాటు ఉద్యమంగానే మిగిలిపోతుంది. స్త్రీ విముక్తి పోరా టాన్ని చలం దృక్పథానికే పరిమితం చేస్తే - అసంఖ్యాక మహిళా లోకాన్ని వారు సమీకరించలేరు.

## పాశ్చాత్య దేశాల అనుభవాలు

ఎయిడ్స్ వ్యాధి ప్రబలమైన తరువాత స్వేచ్ఛా ప్రణయం, సెక్స్ విశృంఖలత, సెక్స్ వికృత సంబంధాలు ఎక్కడకు దారితీస్తున్నాయో అనుభవ పూర్వకంగా అమెరికన్ సమాజమూ, పాశ్చాత్య దేశాలు నేడు గుర్తిస్తున్నాయి. వివాహ వ్యవస్థ, కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమైతే ఏమి జరుగుతుందో వారు అనుభవ పూర్వకంగా గుర్తిస్తున్నారు. అందుచేతనే అమెరికాలో నేడు కన్యాత్వాన్ని కాపాడుకోవాలనీ, వివాహానికి పూర్వం సెక్స్ సంబంధాలు పెట్టుకోరాదనీ యువతీ యువకులు ప్రతిజ్ఞలు, ప్రదర్శనలు చేస్తున్నారు. ఐక్యరాజ్యసమితి "ప్రపంచ కుటుంబ దినోత్స వానికి" పిలుపు యిచ్చింది. కుటుంబం ఒక యూనిట్‌గా లేకపోతే, దిక్కు మొక్కులేని అనాధ శిశువులు, ప్రేమ, దయ, కరుణ, ఆప్యాయతలు నోచుకోని, మానవ సంతతులు, నేరస్తులుగా తయారవుతున్న యువతీ యువకులు, అవివాహిత తల్లులు ఎక్కువై సమాజం విచ్ఛిన్నమై పోతున్న దనీ, సామాజిక విలువలు నశించిపోతున్నాయని వారు గుర్తిస్తున్నారు. ఇటువంటి విపత్కర పరిణామాల నేపథ్యంలో వివాహ వ్యవస్థపై, కుటుంబ వ్యవస్థపై చలం భావనలు, "నూరేళ్ళ చలం" గ్రూపు భావనలు ప్రతీఘాత ఫలితాలకే దారితీస్తాయి.

## స్వాతంత్ర్యానంతర దశలో

1947లో మనదేశం స్వాతంత్ర్యం పొంది, వలస బానిసత్వం నుండి వలస ఆర్థిక విధానం నుండి బైటపడి, ప్రణాళికాబద్ధమైన ఆర్థికాభివృద్ధి విధానాన్ని (దానికి ఎన్ని పరిమితులు, లొసుగులు ఉన్నప్పటికీ) అవలంబించి దేశాన్ని వ్యవసాయ పారిశ్రామిక విద్యా విజ్ఞానరంగాలలో అభివృద్ధిచేస్తున్న

దశ. అందులో భాగంగానే తొలిసారిగా స్త్రీలు, పురుషులతోబాటు అన్ని రంగాలలోను అభివృద్ధి పొందడానికి అవకాశాలు (అవి కూడా ఎంత పరిమితంగా ఐనప్పటికి) వచ్చిన దశ. గడచిన 47 సంవత్సరాల స్వాతంత్ర్యంలో స్త్రీలు విద్యా, విజ్ఞాన రంగాలలో, ముందంజ వేసి, అన్ని రంగాలలోను పురుషులతో సమానంగా అభివృద్ధి పొందగలమనీ శక్తి, సామర్థ్యాలు ప్రదర్శించగలమనీ నిరూపించుకోగల్గిన దశ. అధ్యాపకురాండ్రుగా, న్యాయవాదులుగా, డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, శాసనసభ, పార్లమెంటు సభ్యులుగా అభివృద్ధి చెందిన, చెందుతున్న నేటి దశ.

అయితే ఈ దశలో కూడా స్త్రీ విముక్తి పోరాటం అసంపూర్తిగానే ఉండిపోయింది. విద్య, ఉద్యోగం చట్టరీత్యా అనేక హక్కులు వచ్చిన ఈ దశలో కూడా అనేక రూపాలలో స్త్రీ, పురుషుల అసమానత్వం, స్త్రీల అణచివేత కొనసాగుతూనే ఉంది. వివాహ వ్యవస్థలో, కుటుంబంలో సమాజంలో నేటి విద్యాధిక స్త్రీలతో సహా స్త్రీలు అనేక అన్యాయాలకు, అవమానాలకు గురి అవుతూనే ఉన్నారు. సమాజంలో పురుషాధిక్య భావం, పెత్తనం కొనసాగుతూనే ఉంది. నేటి నూతన పరిస్థితుల్లో స్త్రీలు అనేక నూతన సమస్యలను ఎదుర్కొంటున్నారు.

అందుచేత వివిధ దశలలో సాగుతూ వచ్చిన స్త్రీ విముక్తి ఉద్యమం నేడు ఏ దశలో ఉంది ? ఏ కర్తవ్యాలు స్త్రీల ఉద్యమం ముందున్నాయి ? అన్న విషయం చారిత్రిక దృష్టితో, శాస్త్రీయ దృష్టితో, వస్తుగత దృష్టితో పరిశీలించడం అవసరం.

స్వాతంత్ర్యానికి పూర్వం గ్రామాలలో హైస్కూళ్ళు లేవు, కాలేజీలు లేవు. ఇప్పుడు ప్రతి పెద్ద గ్రామంలో హైస్కూలు, ప్రతికూడలి గ్రామంలో, మండలంలో జూనియర్ కాలేజీలు, పాలిటెక్నిక్‌లు వచ్చాయి. అనేక ఇంజనీరింగ్, మెడికల్ కాలేజీలు, వచ్చాయి. మహిళా కాలేజీలు వచ్చాయి. వందలు, వేల సంఖ్యలో బాలికలు హైస్కూళ్ళకు, కాలేజీలకు, యూనివర్శిటీలకు, సాంకేతిక విద్యలకు వెళ్ళడం ప్రారంభమైంది. 1950-60 దశకంలో స్త్రీ విద్యా వ్యాప్తి గుణాత్మకమైన మార్పు చెందింది.

పరిమాణాత్మక అభివృద్ధి-గుణాత్మక అభివృద్ధికి (Quantitative development into Qualitative development) దారి తీసింది. ఇంటింటా మగపిల్లలతో సమానంగా ఆడపిల్లలను చదివించడం ప్రారంభ మైంది. ముందు స్కూలు ఫైనల్ తరువాత డిగ్రీలు చదివించినా ఆడపిల్ల లను తల్లిదండ్రులు ఉద్యోగాలు చేయడానికి ముందు అనుమతించలేదు. మగవాళ్ళ మధ్య ఆడపిల్లలు ఉద్యోగాలు చేయడానికి వెళితే ఎక్కడ చెడ్డ పేరు వస్తుందోనన్న భయంతో తల్లిదండ్రులు ఉద్యోగాలు చేయనిచ్చేవారు కాదు. ఉద్యోగాలకు పొరుగూళ్ళు అసలే పంపేవారుకాదు. ఆ తరువాత క్రమంగా ఆడపిల్లలను ఉద్యోగాలలోకి పంపడం ప్రారంభమైంది. వర్కింగ్ విమెన్స్ హాస్టళ్ళు మొదలయ్యాయి. ఇప్పుడు వివాహానికి ఉద్యోగం ఒక అర్హత అయింది. అందం, డిగ్రీ, కట్నంతోబాటు ఉద్యోగం ఉంటే చప్పున పెళ్ళిళ్ళు అయ్యే స్థితి వచ్చింది. అయితే పురుషునికి ఒకే బాధ్యత. స్త్రీకి నాల్గు బాధ్యతలు- బరువులు. యింటి బాధ్యత, వంట బాధ్యత, పిల్లల బాధ్యత, ఉద్యోగ బాధ్యత.

ద్రవ్యోల్బణంతో పాటు కట్నాలరేట్లు, ఆడంబరం, అట్టహాసం పెళ్లిళ్ల, వరకట్న హత్యలు ఆత్మహత్యలు ఎక్కువయ్యాయి. అంటే ఫ్యూడల్ ఆర్థిక వ్యవస్థ రద్దు అయినంత మాత్రాన ఫ్యూడల్ నాగరికత, సంస్కృతి వెంటనే రద్దయిపోదు. అనేక దశాబ్దాలు ఈ అవశేషాలు కొన సాగుతూనే ఉంటాయి. ఈలోగా పెట్టుబడిదారీ వ్యాపార నాగరికత, వ్యాపార సంస్కృతి వచ్చిపడింది. ఆడది ఒకనాడు వంటయింటికి, పడకటింటికి పరిమితం అయితే యిప్పుడు అంగడి బొమ్మ అయింది.

సినిమాలలో, సాహిత్యంలో, ఎలక్ట్రానిక్ మీడియాలలో స్త్రీ నగ్న సౌందర్యాన్ని ప్రదర్శించే క్షీణ సంస్కృతి నేడు విజృంభించుతూంది. అంతేకాదు. స్త్రీలకు మరిన్ని బరువులు బాధ్యతలు వచ్చి పడ్డాయి. వంట పని, యింటి పని, పిల్లల బాధ్యతలతోపాటు ఉద్యోగం చేయాలి. వర కట్నం యివ్వాలి. కట్నం యివ్వలేక అవివాహితంగా ఉండిపోవాలి.

## విద్యాధిక మహిళల్లో వచ్చిన నూతన చైతన్యం

స్వాతంత్ర్యానంతర నూతన పరిస్థితుల్లో స్త్రీ విముక్తి పోరాటం

ధరించిన నూతన స్వరూపమే ఫెమినిస్టు ఉద్యమం. లేదా స్త్రీవాద ఉద్యమం అనవచ్చు. శతాబ్దకాలంగాసాగిన సాంఘిక సంస్కరణోద్యమం, స్వాతంత్ర్యో ద్యమాలలో అంతర్భాగంగా వివిధ దశలలో ముందుకు సాగిన స్త్రీ విముక్తి పోరాటంలో ఇది భాగమే. దాని కొనసాగింపే (continuation) నేటి ఫెమినిస్టు ఉద్యమం. ఆవిధంగా దీనిని అర్థం చేసుకొన్నప్పుడే ఈ ఉద్యమాన్ని సరిగా అంచనా వేయగలం. ఇది ఇప్పుడే అవతరించిన ఉద్యమంగా కాదు. అయితే ఈ ఉద్యమ పోకడలు ఏమిటి ?

స్త్రీ విముక్తి పోరాటం ఒక్కొక్క దశలో ఒక్కొక్క సమస్య, ఒక్కొక్క అంశం ప్రాధాన్యం వహిస్తుంది. ఎజెండాలోకి వస్తుంది. నేటి స్త్రీ విముక్తి పోరాట దశలో ముఖ్యంగా మధ్యతరగతి మేధావి వర్గాలలో వారికి నిత్యం ఎదురవుతున్న సమస్య పురుషాధిక్య సమస్య. దీనికి ప్రతిబింబాలైన సెక్సువాలిటీ, జండర్ వివక్ష ఈ వివక్షలకు ప్రాతిపదిక అయిన ఫ్యూడల్ - పెట్టుబడిదారీ సంస్కృతుల సమ్మేళనం. వీటికి ప్రాతిపదికలైన ఫ్యూడల్ ఆర్థిక వ్యవస్థ అవశేషాలు, పెట్టుబడిదారీ వ్యవస్థలు. అయితే గత 47 యేళ్ళ స్వాతంత్ర్యంలో స్త్రీల జీవితంలో, సాంఘిక జీవనంలో మార్పులు రాలేదా? వచ్చాయి. వాటినీ మనం విస్మరించ కూడదు.

## నాటికీ నేటికీ తేడాలు

స్త్రీలకు ఒకనాటి ఘోషా ఈనాడులేదు. స్త్రీలు చదువుకోకూడదు అనే ఆంక్ష ఈనాడు లేదు. (పేదరికంవల్ల తప్పితే-ఇప్పుడు డిగ్రీ వరకు స్త్రీకి ఉచితవిద్య వచ్చింది.) ఒకనాటి అతి బాల్య వివాహాలు, బాల్యవివాహాలు ఎక్కడో వెనుకబడిన ప్రాంతాలలో తప్ప ఇప్పుడులేవు. అలాగే ఒకనాటి నిర్బంధ వైధవ్యం ఈనాడు లేదు. ఒకనాటి మనోవర్తి దశ ఈనాడు లేదు. మగపిల్లలతో సమానంగా ఆస్థి హక్కు వచ్చింది. (అమలులోకి రావడం కష్టంగా ఉన్నది.) ఈనాడు వృద్ధులకు ముక్కు పచ్చలారని పిల్లలను యిచ్చి పెళ్ళిళ్లు చేసే ఆచారం లేదు. విడాకులు తీసుకోవడం తప్పుగా చూడటంలేదు. (కాని డైవోర్సీలకు మగవాళ్ళు దొరకడం సమస్యగానే ఉంది) ఒకనాటి బాల్య వివాహాల బదులు ఈనాడు వరకట్నం మార్కెట్

ధరలు పెరిగిపోయి అనుకూలమైన వరుడు దొరక్క అవివాహిత యువతుల, వృద్ధ కన్యల సంఖ్య హెచ్చిపోతూంది. వివాహాలు కాని యువతులు- గత్యంతరం లేక రెండవ భార్యగా ఉండటానికి (మొదటి భార్య, పిల్లలు ఉండగానే,) తయారవుతున్న దుస్థితి పెరుగుతోంది. అవివాహితులుగా జీవితాంతం ఉండిపోతామంటే ఒకనాటి ఆక్షేపణ, అపవాదు ఈనాడు లేదు. అది వారి యిష్టంలే అంటున్నారు. ఒకనాటి అధిక సంతానం స్థానం లోనే నేడు గర్భస్థ స్త్రీ శిశువుల హత్యలు (ఎమినో సింటసిస్) గర్భ స్రావాలు వచ్చాయి. మగపిల్లలనే తప్ప ఆడపిల్లలను దత్తత చేసుకోకూడదనే ఆంక్షలేదు. రాత్రిళ్లు యింటి గడప దాటడానికి స్త్రీ వెరిచే పరిస్థితి నేడులేదు. పత్రికారంగంలో, పరిశ్రమలలో గుండె నిబ్బరంగా నైట్ డ్యూటీలు చేసి – రవాణా సౌకర్యంతో యిళ్ళకు తిరిగి వస్తున్నారు. యితర చోట్లకు వెళ్ళి, విద్యా, ఉద్యోగాలు చేయడం సాధ్యంకాదనే దశ నుండి రాష్ట్రేతర ప్రాంతాలకు ఖండాంతరాలకు స్వేచ్ఛగా ధైర్యంగా స్త్రీలు వెళ్ళిపోతున్నారు. భర్త ఒకచోట, భార్య యింకో చోట ఉద్యోగాలు చేయవలసివస్తే స్త్రీలు వెనుదీయడంలేదు. (పిల్లలతో అనేక యిబ్బందులు పడుతూనే) ఇదివరకు స్త్రీలు చొరరాని పారిశ్రామికరంగానికి, పోలీసు, సైనిక, వైమానిక, నౌకారంగాలకు ఇప్పుడు ప్రవేశం పొందారు. మహిళా ఐ.ఎ.ఎస్.లు, ఐ.పి.ఎస్.లు పురుషులకు తీసిపోని సమర్థత, చాకచక్యం, ధైర్య స్థైర్యాలు ప్రదర్శిస్తున్నారు. కిరణ్ బేడీలు, సుజాతారావులు, లక్ష్మిపార్థసారధి భాస్కర్‌లు, ఊర్మిళా సుబ్బారావులు దేశంలోని స్త్రీ, పురుషులందరికీ గర్వకారణం అవుతున్నారు. క్రీడారంగంలో ఉష, అశ్విని, వలసమ్మలే దేశానికి బంగారు పతకాలు తెచ్చేది. మగధీరులు కాదు.

అయితే నూతనంగా తలెత్తిన మధ్య తరగతి మహిళా మేధావి వర్గాలకు ప్రధానంగా ఎదురవుతున్న సమస్యలే మొత్తం మహిళా లోకం సమస్యలు కావు. నెలకు 5,6 వేలు జీతాలు తెచ్చుకొనే మహిళా ప్రొఫెసర్లు ఉన్నత ఉద్యోగినులతోపాటు అసంఖ్యాక శ్రామిక మహిళలు, గ్రామీణ మహిళలు ఉన్నారు. దేశ జనాభా 80 కోట్లలో సుమారు 40 కోట్ల మంది

మహిళలుంటే అందులో సగభాగం 20 కోట్లు మహిళలు దారిద్ర్యరేఖకు దిగువనే ఉన్నారు. వారికి తిండి, బట్ట, యిల్లు, విద్య, వైద్యం, ఉపాధి ప్రధాన సమస్యలు. నేటికీ నూటికి 60-70 మంది స్త్రీలు నిరక్షరాస్యత లోనే మగ్గి ఉన్నారు. విద్యాధిక మహిళలు నూటికి 10 మంది మాత్రమే. మధ్య తరగతి విద్యాధిక మహిళలు తమ బాధలను గాధలను శక్తివంతంగా వెల్లడించగలరు. వీరు తమవాణిని వినిపించగలరు. (Vocal Sections) మిగిలిన నూటికి 90 మంది స్త్రీ జనం తమ బాధలను, గాధలను వినిపించ లేరు. నేటి అసమాన ఆర్థిక వ్యవస్థ నేటి పితృస్వామిక కుటుంబ వ్యవస్థలో మొత్తం స్త్రీ లందరు తరతమ స్థాయిల్లో బాధలు పడుతున్నారు. అందు చేత స్త్రీ విముక్తి పోరాటానికి పాక్షిక దృక్పథంకాక సమగ్ర దృక్పథం, సమ్యక్ దృక్పథం అవసరం, సామూహిక ఉద్యమం అవసరం.

సారా వ్యతిరేక ఉద్యమం యిచ్చిన గుణపాఠం ఏమంటే స్త్రీ జన బాహుళ్యం (Mass of women) కార్యాచరణలోకి దిగినప్పుడు కాని ఏ సమస్య అయినా ఉద్యమ రూపం ధరించదు. అందుచేత జండర్ సమస్య సెక్సువాలిటీ పునరుత్పత్తి సమస్యలు మాత్రమేగాక, స్త్రీల ఆర్థిక, సామాజిక విముక్తికి ప్రధానమైన అన్ని సమస్యలపై బలమైన, సమైక్య మైన మహిళా ఉద్యమం నిర్మించడం నేటి తక్షణావశ్యకత.

స్త్రీ విముక్తి, స్త్రీల ఒంటరి పోరాటం ద్వారా సాధ్యమా? కాదు. ప్రగతిశీల భావాలు కల స్త్రీ, పురుష లందరి తోడ్పాటు కల విశాల మహిళా ఉద్యమమే, సామాజిక విముక్తి పోరాటంలో భాగంగానే స్త్రీ విముక్తి పోరాటం ముందుకు నడుస్తుంది. స్త్రీవిముక్తికి కలసి వచ్చే పురుష వర్గాలు లేవనుకోవడం పొరపాటు.

## ఒంటరి పోరాటమా? సమిష్టి పోరాటమా?

పురుషాధిక్యత భావంపైన, పురుష అహంకృతిపైన జండర్ వివక్షపైన భావ సంఘర్షణ సాగిస్తూనే స్త్రీ విముక్తి ఉద్యమం ప్రగతిశీల భావాలు కల్గిన పురుష వర్గాలన్నిటిని కూడగట్టుకొని సమిష్టి పోరాటం, సమైక్య పోరాటం సాగించవలసిన అవసరం ఉంది. స్త్రీలు ఒంటరి పోరాటం చేయవలసిన అవసరం లేదు. అభిలషణీయముకాదు. పురుషాధిక్య భావానికి

వ్యతిరేకంగా పురుషులు సైతం పోరాడేటట్లు చేయడంలోనే స్త్రీ విముక్తి ఉద్యమ సాఫల్యం, విజయం ఆధారపడి ఉంది. పురుషాధిక్య భావాన్ని వ్యతిరేకించే పురుషులు లేరా ? రామమోహనరాయ్ మొదలు వీరేశలింగం వరకు, గాంధీజీ మొదలు గోరా వరకు పురుషాధిక్య భావాన్ని, స్త్రీని తక్కువచేసి చూసే అన్ని ధోరణులను వ్యతిరేకించినవారే.

అభ్యుదయ భావాలు, ప్రజాతంత్ర భావాలు కల మేధావి వర్గాలన్నీ పురుషాధిక్య భావాన్ని వ్యతిరేకించుతూ స్త్రీ, పురుషుల సమానత్వాన్ని ఆచరణలో సాధించడానికి తోడ్పడేవారే.

వివిధ సిద్ధాంత, రాజకీయ ధోరణులు కల వివిధ మహిళా సంఘాలూ, వివిధ ఫెమినిస్టు గ్రూపులు ఒక అంగీకృత ప్రణాళిక ఆధారంగా కలిసికట్టుగా సమిష్టిగా, సమైక్యంగా, శక్తివంతమైన ఉద్యమాన్ని నిర్మించాలి. ఎవరి సిద్ధాంత రాజకీయాభిప్రాయాలను వారు వదులుకోకుండానే ఒక ఉమ్మడి కార్యాచరణ రూపొందించుకోవడం అసాధ్యమైన విషయం కాదు.

## చలంవైపు కాదు జనం వైపు...

నేడు రాష్ట్రంలో ఇంచుమించు ప్రతి రాజకీయ పార్టీకి అనుబంధంగా కాకపోయినా అనుయాయులుగా ఆయా మహిళా సంఘాలు, గ్రూపులు అనేకం పని చేస్తున్నాయి. కాంగ్రెస్ మహిళా సంఘం, తెలుగు దేశం మహిళా సంఘం, ఉభయ కమ్యూనిస్టు పార్టీల వామపక్ష మహిళా సంఘాలు, స్వతంత్ర మహిళా సంఘాలు, నక్సలైట్ భావాలకు చెందిన వివిధ గ్రూపుల మహిళా సంఘాలు వారి వారి పత్రికలు, ప్రచురణలు ఉన్నాయి. తమ రాజకీయ, సిద్ధాంతాలే సరియైనవని ఎవరికి వారు భావించు కొనవచ్చు. విశ్వసించవచ్చు. ఎదుటివారిది రివిజనిజమో, ఉగ్రవాదమో అని విమర్శలు చేసుకుంటూ ఉండవచ్చు. కాని ఈ అన్ని మహిళా సంస్థలు తమ తమ రాజకీయ, సిద్ధాంత విధానాలు తాము వదులుకోకుండానే (అవి ఎంతవరకు సవ్యమో అపసవ్యమో చరిత్ర నిర్ధారణకు వదలి) ఒక అంగీకృత కార్యక్రమం ప్రాతిపదికపై, సమైక్య పోరాట వేదికలను, సమైక్య కార్యాచరణను రూపొందించుకోవాలి. స్త్రీ విముక్తిని కేవలం

సెక్స్ సమస్యకే పరిమితం చేసే చలంవైపుగాక, స్త్రీ జనంవైపు నేటి ఫెమినిస్టు గ్రూపులు తమ దృష్టి సారించాలి. అత్యధిక సంఖ్యాక స్త్రీలను సమీకరించగల నినాదాలను (**Rallyin, slogans**) తీసుకోవాలి. ప్రచార ఆందోళనల దశ దాటి, సదస్సులు, చర్చలు, గోష్ఠులు, పత్రికా రచనలు బులిటెన్ల దశ దాటి స్త్రీజన సామాన్యాన్ని పెద్దయెత్తున కదిలించి రంగం లోకి దింపగల కార్యాచరణ పథకం అందరు కలసి రూపొందించుకోవాలి. నేటి విభిన్న రాజకీయ సిద్ధాంత భావజాలం దృష్ట్యా అటువంటి సమైక్య కార్యాచరణ సాధ్యం కాదనుకోవడం స్త్రీ విముక్తి పోరాట సమిష్టి ప్రయోజనాలను గుర్తించి నిరాకరించడం మాత్రమే అవుతుంది.

గత దశాబ్దకాలంగా రాష్ట్రంలోని ఫెమినిస్టు గ్రూపులు మహిళా ఉద్యమాన్ని ప్రజా ఉద్యమంగా ఎందుకు అభివృద్ధి చేయలేక పోయాయో, ఈనాటికీ గ్రూపుల దశలోనే ఎందుకు ఉండిపోయాయో వారు ఆత్మావ లోకనం చేసుకోవడం మంచిది. భావ సంఘర్షణా ఆకాశ హార్మ్యాలలోంచి (**Ivory Towers**) కార్యాచరణ ప్రజా ఉద్యమభూమి మీదకు వారు దిగి రావాలి. స్త్రీ విముక్తి పోరాటాన్ని ఒకడుగు ముందుకు తీసుకుపోవాలని కోరే వారందరూ, రాష్ట్రంలోని స్త్రీ పురుషులందరూ వాంఛించేది, ఎదురు చూచేది అందుకే! అటువంటి సానుకూల పరిణామం కోసమే!

(కమ్యూనిజం, సెప్టెంబరు సంచిక నుండి 8-9-'94)